కార్య రూపంలో ఏది గోచరించినా, దానికి కార్యారంభము నందు సత్తామాత్రమైన కారణము ఉండి తీరాలి. కార్యము ఏదైనా అది కారణము నందే సుప్రతిష్ఠమై ఉంటుంది. అంటే కారణమునే ఆశ్రయముగా కలిగి ఉంటుంది. కారణ సత్తా కన్నా వేరుగా కార్య సత్తా ఉండ లేదు.

ప్రపంచము కార్య రూపంలో తెలుస్తూ ఉంది. కార్య రూపమైన ఈ మాయా ప్రపంచానికి ఈశ్వరుడైన సగుణ బ్రహ్మము మాయావిగా శోభిస్తూ, మాయను తన అధీనంలో ఉంచుకొని, ఈశ్వరత్వంతో సృష్టి కార్యాన్ని సాగిస్తున్నాడు.

కార్యమైన దృశ్యమాన జగదుత్పత్తికి ముందు కారణ రూపంలో సద్రూప చైతన్యం ఏకమై, అద్వయమై భాసిస్తూ ఉండింది. అది ఏకము, అద్వయము కనుక నిర్గుణము. కార్యరూపమైన జగత్తుకు, కార్యరూప జగ ద్వ్యాపారాలను సాగించే ఈశ్వరునకు కార్యారంభంలో సద్రూపము, నిర్గుణము, అద్వితీయమైన బ్రహ్మమే ఉండింది. సాకార ప్రపంచానికి, సగుణ బ్రహ్మమునకు నిర్గుణ నిరాకార పరబ్రహ్మమే ఆశ్రయంగా ఉంది ***(సగుణ బ్రహ్మణః అహం నిరాకార పరమాత్మా ప్రతిష్ఠా)*** అనేది రెండవ అర్థము. అచంచలమైన భక్తియోగము చేత సవికల్పక బ్రహ్మమును పొందిన భక్తుడు, కార్యమైన సగుణ బ్రహ్మము తన కాశ్రయమైన నిర్గుణ బ్రహ్మమునకు, లేదా పరమాత్మకు అన్యం కానందున, భక్తి చేత గుణములను అధిగమించిన భక్తుడు బ్రహ్మత్వమునకు అర్హు డగుటయే గాక బ్రహ్మమే అగుచున్నాడు.

***శ్లో॥ సర్వేషా మేవ వస్తూనాం భావార్థో భవతి స్థితః।***
***తస్యాపి భగవాన్ కృష్ణః కి మత ద్వస్తు రూప్యతామ్ ॥***

సమస్తములైన కార్య వస్తువులకు భావార్థమైన పరమార్థ వస్తువు సత్తా రూపంగా ఉంది. కార్య సత్తా కారణ సత్తా కన్నా వేరుగా ఉండలేదు కదా! మరి అట్టి సత్తా రూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ కంటే అన్యమైన పారమార్థిక వస్తువు ఏముంది? ***( కిం అతత్ వస్తు ? ).*** కనుక శ్రీకృష్ణుడే 'అహం' శబ్దము చేత సర్వమునకు ప్రతిష్ఠగా శోభిస్తున్నాడు అని భాగవతంలో శుక యోగీంద్రుని అమృత భాషణము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
గుణత్రయ విభాగయోగో నామ చతుర్దశో౽ధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు గుణత్రయ విభాగయోగ మనే పద్నాల్గవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ పంచదశో౽ధ్యాయః - పదిహేనవ అధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తి యోగః - పురుషోత్తమ ప్రాప్తి యోగము

### సందర్భము

***ఫలమత ఉపపత్తేః -*** కర్మఫలము పరమేశ్వరుని వల్లనే కలుగుతుంది *( బ్రహ్మసూత్రం ; 3-2-38 ).* కర్మలు ఆచరించే వారికి కర్మఫలము, జ్ఞానవంతులకు జ్ఞానఫలము పరమేశ్వరుని వల్లనే కలుగుతూ ఉన్నాయి. ఫలప్రదాత భగవంతుడు కావడం చేత, ఎవరైతే అచంచలమైన భక్తితో పరమేశ్వరుని సేవిస్తారో, వారు భగవ దనుగ్రహం చేత బ్రహ్మత్వమునకు అర్హులై మోక్షాన్ని పొందుతారు అని ప్రవచించి పూర్వాధ్యాయాన్ని ముగించాడు గీతాచార్యుడు.

జీవునికి భక్తియోగము వలన బ్రహ్మభావము ఎలా ఏర్పడుతుంది? అనే శంకను నివారిస్తూ, తానే బ్రహ్మమునకు ఆశ్రయము ***(బ్రహ్మణః ప్రతిష్ఠా అహ మేవ)*** అని కూడా చెప్పడం జరిగింది.

గుణయుతుడైన వాడు జీవుడై నరు డయ్యాడు. గుణాతీతుడైన వాడు దేవుడై నారాయణు డవుతాడు. ప్రకృతి తాదాత్మ్యంతో జీవుడు పురుషు డయ్యాడు. గుణయుతమైన ప్రకృతి నుండి విడిపడి పురుషుడైన జీవుడు పురుషోత్తముడు కావాలి. మానవుడు మాధవుడు కావాలి. బద్ధుడు ముక్తుడు కావాలి.

సత్త్వగుణ ప్రధానుడైన సాత్త్వికుడు జ్ఞాన ప్రభావంతో అంతర్ముఖుడు. రజోగుణ ప్రధానుడైన రాజసుడు కర్మ ప్రవృత్తి చేత బహిర్ముఖుడు. తమోగుణ ప్రధానుడైన తామసుడు మోహ ప్రభావం చేత నిర్ముఖుడు. ఈ త్రిగుణాలను భగవ దనుగ్రహం చేత అధిగమించిన వాడు భగవన్ముఖుడు. గుణాతీతుడు. ఇలా గుణాతీతులైన వారు మోక్షాన్ని పొందుతారు ***( మాం ఈశ్వరం యే సేవన్తే తే మదనుగ్రహాత్ జ్ఞాన ప్రాప్తి క్రమేణ గుణాతీతాః మోక్షమ్ గచ్ఛన్తి ! ).*** పరమేశ్వరుని కృప వలన భక్తుడు గుణములను అధిగమించి, జ్ఞానప్రాప్తి క్రమంలో ముక్తిని పొందేటప్పుడు, ఇక పరమాత్మ తత్త్వమును చక్కగా గ్రహించిన వారి విషయం ప్రత్యేకించి చెప్పేదేముంటుంది? అని వ్యాఖ్యానించారు పంచదశాధ్యాయ భాష్య పీఠికలో శ్రీ శంకరాచార్యస్వామి ***(కిము వక్తవ్యమ్ ఆత్మనః తత్త్వ మేవ సమ్యక్ విజానన్తః ).*** ఈ కారణం చేత ఆత్మతత్త్వాన్ని వివరించ డానికి భగవానుడు ఈ పదిహేనవ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.

### అధ్యాయ నామ వైభవము

ఇది పదిహేనవ అధ్యాయము. 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అని అధ్యాయ నామము. ఈ నామంలో నాలుగు పదాలు ఉన్నాయి. ఒకటి పురుషుడు; రెండు ఉత్తమము; మూడు ప్రాప్తి ; నాలుగు యోగము. ఈ నాలుగు పదాలు కలిసి 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అయింది. 'పురుషోత్తమ' అనే దానిని సమాస పదంగా గ్రహిస్తే, అధ్యాయ నామం మూడు పదాలతో ఉంటుంది.

పురుషుడు అంటే సాధారణంగా మగవాడు అనే అర్థాన్ని గ్రహిస్తూ ఉంటాము. కాని, 'పురుషః' శబ్దార్థాన్ని గ్రహిస్తే, అది లింగభేదం లేకుండా సర్వ మానవులకు వర్తిస్తుంది.

'పురం' అంటే శరీరము అని అర్థము. శరీరము నందు శయనించి ఉండేవాడు 'పురుష:' (**పురం శరీరం, తస్మిన్ శేతే ఇతి పురుషః**). అంటే, జీవుడు; క్షేత్రజ్ఞుడు. మరి, పురం రాక ముందు పురుషుడు లేడా? నిన్న లేకుండా నేడు వచ్చిన వాడైతే, నేడు ఉండినా రేపు లేకుండా పోయేవాడు అవుతాడు కదా! అలాంటి వాడు పురం లాంటి వాడు అవుతాడే గాని పురుషు డెలా అవుతాడు? కనుక పురంలో, అంటే దేహంలో ఎవడైతే శయనించి ఉన్నాడో, వాడు పురానికి పూర్వము కూడా ఉన్నవాడే. ఆ మాట కొస్తే సృష్టికి పూర్వమే ఉన్నవాడు (**పురా ఏవ ఆసీత్ ఇతి పురుషః**).

పురంలో, అంటే దేహంలో పురుషుడు ఎక్కడ శయనించి ఉన్నాడు? ఊపిరితిత్తుల లోనా? కాలేయము లోనా? లేక హృదయము లోనా? ధ్యాన నిమిత్తం ఉపలబ్ధి స్థానంగా హృదయంలో ఉన్నాడు అని చెప్పుకున్నా (**హృదయ దేశే తిష్ఠతి**). వాస్తవానికి పురుషుడు పురము నంతా పూరించే ఉన్నాడు. ఘటములో ఘటాకాశము ఎక్కడుంది అంటే ఏమి చెప్పగలం? ఘట మంతా పూరించి ఉంది అంటాము. పురుషుడు కూడా దేహ మనే పురంలో ఉన్నాడు అంటే, దేహ మంతా పూరించి ఉన్నాడు అని అర్థము (**పూరయతీతి పురుషః**). అతడే క్షేత్రజ్ఞుడు. అతడే ఆత్మ. అతడిని మించిన ఉత్తమమైన వస్తువు మరొకటి లేదు. అతడే ఉత్కృష్టమైన వాడు.

**పురుషాత్ న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః।**

పురుషుని కంటే ఉత్కృష్ట మైనది ఏదీ లేదు. అదే అన్నిటికీ పరాకాష్ఠ; అదే పరమ గమ్యము అని కఠోపనిషత్ *(1 - 3- 11)*.

ఘటంలో ఉంటూ ఘటాన్ని పూరించి ఉన్న ఘటాకాశము ఘటానికి పరిమితమా? ఆకాశం విశాల మైంది. అది కుండకే పరిమితమై ఉండ లేదు. ఆకాశాన్ని కుండ పరిమితం చేయ లేదు. ఆ మాట కొస్తే కుండే ఆకాశంలో తయారైంది. ఆకాశం లోనే ఉంది. కుండలో ఉన్న ఘటాకాశమే కుండకు బాహ్యంలో మహాకాశంగా ఉంది. ఘటాకాశంగా ఉన్నప్పుడు కూడా ఆకాశం విశాలాకాశం గానే ఉంది. మహాకాశం గానే ఉంది.

మరి పురంలో, అంటే శరీరంలో ఉండే పురుషుడు పురానికి పరిమితుడా? కానే కాదు. ఘటాకాశము ఎలాగైతే మహాకాశము అయ్యే ఉందో, అలాగే దేహంలో చైతన్యాత్మగా శోభించే పురుషుడు సర్వత్ర నిండి నిబిడీ కృతమైన సద్రూప చైతన్యము అయ్యే ఉన్నాడు. దేహాన్ని పూరించిన పురుషుడే విశ్వాన్ని పూరించి ఉన్న పురుషోత్తముడు. కుండ ఉత్పత్తికి ముందు కూడా ఆకాశము ఉండనే ఉంది. అలాగే పురం రాక ముందు కూడా పురుషుడు ఉండనే ఉన్నాడు. కుండ పగిలినా ఆకాశం పారి పోదు. పురం రాలిపోయినా, కాలిపోయినా పురుషుడు నశించడు.

ఈ జగత్తు ఆవిర్భవించక ముందు ఏ సద్రూప చైతన్యము అద్వితీయంగా ఉండిందో (**సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ ఏక మేవ అద్వితీయం బ్రహ్మ** - ఛాందోగ్యోపనిషత్తు ) అది జగత్కార్యం జరిగినా ఉంది. ప్రళయంలో జగత్తు విలీనమై పోయినా, ఆ సద్రూప చైతన్యము దివ్యమై అద్వితీయంగా శోభిస్తూనే ఉంటుంది. అదే పరబ్రహ్మము. అదే పురుషోత్తమ స్వరూపము.

చైతన్యము ఒక్కటే గాని రెండు కాదు. పురుష చైతన్యము, పురుషోత్తమ చైతన్యము అని రెండు లేవు. ఘటాకాశము, మహాకాశము అని వ్యావహారికంగా మనం చెప్పుకుంటున్నా, వాస్తవానికి ఆకాశము ఒక్కటే. పురుష చైతన్యము, ఈశ్వర చైతన్యము అని రెండుగా మనం భావించినా, జీవ చైతన్యము, ఈశ్వర చైతన్యము అని రెండు లేవు. చైతన్యము ఒక్కటే. దేహంలో, అంటే పురంలో ఉన్నప్పుడు ఉపాధి స్థాయి నుండి సోపాధిక





చైతన్యము అంటున్నాము. దానినే ఉపాధి వినిర్ముక్త మైనపుడు, నిరుపాధిక చైతన్యము అంటాము. అఖండము, అద్వితీయమైన చైతన్యమే పురుషోత్తమ చైతన్యము.

**పురుషోత్తముడు**

'పురుషోత్తమః' అనేది సమాస పదము. షష్ఠీ సమాసము. పురుషులలో ఉత్తముడు పురుషోత్తముడు (**పురుషాణాం ఉత్తమః పురుషోత్తమః**). షష్ఠీ సమాసములో ఉండే పదానికి ***న నిర్ధారణే*** అనే వ్యాకరణ సూత్ర నిషేధము ఉంది (***న నిర్ధారణే షష్ఠీ*** - పాణినీ వ్యాకరణము ; *2 - 2 - 10* ). 'పురుషోత్తమః' అనే పదం 'షష్ఠీ' లోనే ఉన్నా, ఈ వ్యాకరణ సూత్ర నిషేధము దానికి వర్తించదు.

షష్ఠీలో ఒక పదమును ప్రయోగించి నపుడు, జాతి, గుణ, క్రియల చేత వేరు చేయడము జరిగి నపుడు, మనం ఉదహరించిన వ్యాకరణ సూత్ర నిషేధము వర్తిస్తుంది, లేదా సంభవిస్తుంది. దీనిని సులభంగా అర్థం చేసుకోవ డానికి సోదాహరణంగా చెప్పుకుందాం.

***మనుష్యాణాం క్షత్రియః శూరతమః*** - 'మనుష్యులలో క్షత్రియుడు శూరతముడు' అన్నప్పుడు, క్షత్రియుడు మనుష్యులలో ఒకడే అయినా, జాతి చేత, క్షత్రియ జాతి చేత విశిష్టంగా చెప్పబడ్డాడు.

***గవాం కృష్ణాగౌః సంపన్న క్షీరతమా*** - గో సమూహాన్ని చూచి, 'ఆవులలో నల్ల ఆవు సంపన్న క్షీరతమము' అన్నప్పుడు, ఆవులలో నల్ల ఆవు ఒకటి అయినా, పాలు పుష్కలంగా ఇవ్వడ మనే గుణము చేత ప్రత్యేకంగా చెప్పబడింది.

***అధ్వగానాం ధావన్ శీఘ్రతమః*** - 'బాటసారులలో పరుగు పెట్టేవాడు శీఘ్రతముడు' అన్నప్పుడు, పరుగు పెట్టేవాడు కూడా బాటసారే అయినా, పరుగు పెట్టడ మనే క్రియ వల్ల విశిష్టంగా చెప్పబడుతూ ఉన్నాడు. కనుక, క్షత్రియుడు జాతి చేత, కృష్ణ గోవు గుణము చేత, పరుగు తీసేవాడు క్రియ చేత వేరు చేయబడు తున్నారు. కనుక, ఇలాంటి చోట ***న నిర్ధారణే*** అనే వ్యాకరణ సూత్ర నిషేధము వర్తిస్తుంది.

జాతి, గుణ, క్రియాదులు లేకుండా సమాసాలు రూపొందించ బడవు. కాని, భగవంతుడు పురుషోత్త ముడు అన్నప్పుడు, భగవంతునితో పోల్చడానికి మరొకరు లేనందున, జాతి, గుణ, క్రియాదులు లేకనే 'పురుషోత్తమః' అనే పదాన్ని సమాసంగా చెప్పవచ్చు. భగవంతుడు ఉత్తముడు అని చెప్పినపుడు, భగవంతుడు లాంటి భగవంతులలో ఆయన ఉత్తముడు అని అర్థం కాదు. కనుక, 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అనే అధ్యాయ నామంలో 'పురుషోత్తమః' అని షష్ఠీ సమాసంగా గ్రహించ బడిన ప్రత్యేకమైన విశిష్ట పదము అద్వితీయ సద్రూప చైతన్యమును సూచిస్తూ ఉంది.

ప్రస్తుతం మనం అధ్యయనం చేయబోతున్న ఈ పురుషోత్తమ ప్రాప్తి యోగము అనే పదిహేనవ అధ్యాయం లోని పద్దెనిమిదవ శ్లోకంలో 'పురుషోత్తమః' పదాన్ని పంచమీ సమాసంగా చూస్తాం (**పురుషాభ్యాం ఉత్తమః**).

***యస్మాత్ క్షర మతీతోఽహం అక్షరాదపి చోత్తమః।***
***అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥***

'అర్జునా! క్షర రూపమైన సృష్టి కంటె, అక్షర రూపమైన అవ్యక్తము కంటె నేను ఉత్తముణ్ణి కావడం చేత లోకములో, వేదములో కూడా పురుషోత్తముడుగా ప్రసిద్ధిని పొందినాను' అని ప్రవచించడము జరిగింది. క్షరా క్షరాలను భరిస్తూ, ఆ రెండిటికి విలక్షణంగా ఉంటూ, వాటికి అతీతంగా, అధిష్ఠానంగా తెలుస్తూ ఉన్నందున,

తాను పురుషోత్తముడు. ఈ శ్లోక వ్యాఖ్యాన సందర్భంలో దీనిని విస్తరించి చెప్పుకుందాము. కనుక పురుషోత్తముడు పూర్ణరూపుడు అని స్పష్టమౌతూ ఉంది. ఈ ప్రపంచము గోచరిస్తూ ఉన్నా ***(ఇదం)*** పురుషోత్తముడు పూర్ణ రూపుడే ***(పూర్ణ మిదం)***. ఈ దృశ్యమాన జగత్తు ఆవిర్భవించక ముందు కూడా పురుషోత్తముడు పూర్ణ రూపుడే ***(పూర్ణమదః)***. నిర్వికార, నిష్ప్రపంచ రూపుడైన పూర్ణ పురుషుని నుండి ఈ దృశ్యమాన జగత్తు వచ్చినా, తిరిగి లేకుండా పోయినా ***(పూర్ణస్య పూర్ణమాదాయ)*** ఆయన పూర్ణత్వానికి భంగం లేదు; రాదు. పురుషోత్తముడు సదా పూర్ణుడే ***(పూర్ణ మేవ అవశిష్యతే)***. ఈ విధంగా క్షరాక్షర విలక్షణ మైన పురుషోత్తమ తత్త్వమే ఈ పంచ దశాధ్యాయంలో కేంద్ర విషయంగా ఉంది. అందుచేత ఈ అధ్యాయం లోని విషయము అత్యంత రహస్య మైందని, గోప్యతమ మని భగవంతుడే అధ్యాయాంత శ్లోకంలో చెబుతాడు. ఈ అధ్యాయాన్నే సమస్త శాస్త్రంగా పరిగణించి ప్రవచించడం జరిగింది. గీతా శాస్త్రంలో చెప్పబడిన విషయ మంతా ఈ అధ్యాయం లోనే సంక్షిప్తంగా చెప్పబడింది అని ఆచార్యులే భాష్యంలో అభిప్రాయ పడ్డారు ***(సర్వో హి గీతా శాస్త్రార్థః అస్మిన్ అధ్యాయే సమాసేన ఉక్తః)***. ఆచార్యుల వారు అంతటితో ఆగ లేదు. ఈ పంచదశాధ్యాయంలో సంక్షిప్తంగా చెప్పబడింది కేవలం గీతాశాస్త్రమే కాదు; సమస్త వేదార్థ సారమంతా ఈ అధ్యాయంలో పూర్ణమైంది అని కూడా అన్నారు ***(న కేవలం గీతా శాస్త్రార్థ ఏవ, కిం తు సర్వశ్చ వేదార్థః ఇహ పరిసమాప్తః*** - *శ్రీ శంకర భాష్యము)*.

ఇటువంటి పరమార్థ తత్త్వమైన పురుషోత్తమ తత్త్వము మనకు ఈ అధ్యాయంలో ప్రాప్తించబోతూ ఉంది అని చెప్పేందుకే అధ్యాయ నామంలో 'పురుషోత్తమ' పదము తరువాత 'ప్రాప్తి' పదము. ఆ పురుషోత్తమ తత్త్వము ఎలా ప్రాప్తిస్తుందో తెలియ చెప్పే ఉపాయమే తరువాత వచ్చే 'యోగ' పదము. ఆ రెండు పదాలను కూడా వివరంగా చెప్పుకొని (ప్రాప్తి, యోగములను) ఆ తరువాత, పూర్ణావగాహనతో ఆనందంగా అధ్యాయం లోకి ప్రవేశిద్దాం.

**ప్రాప్తము - అప్రాప్తము**

మనం ఆశించేది ఏదైనా అది మనకు లేనిదే. మనం ప్రియంగా భావించేది మనకు లేనిది అయినపుడు, దానిని పొందే ప్రయత్నము చేస్తాము. ప్రయత్నంలో పొంద బడితే అది ప్రాప్తము. అంటే లేనిది ప్రాప్తించింది అని అర్థము.

లేనిది అని మనం భావించేది అసలు లేనిదే అయితే మనం ప్రయత్నిస్తే మాత్రం ఎలా ప్రాప్తిస్తుంది? కనుక ప్రాప్తించింది అంటే ఉన్నదే. కాని, మన వద్ద లేనిది. మనకు దూరంగా ఉన్నది. ఈ దూరాలను సృష్టించేవి దేశ, కాల, వస్తు, పరిస్థితులు కావచ్చు.

సంత కెళ్ళి సొరకాయను తెచ్చుకుంటాం. వస్తువుగా సొరకాయ మన కన్నా వేరుగా ఉంది. సొరకాయ ఇంటిలో లేదు. సంతలో ఉంది. అంటే ప్రదేశంలో మనకు దూరంగా ఉంది. కనుక కాలంలో ప్రాప్తిస్తుంది. ఈ విధంగా మనం ఆశించేవి మనకు లేనపుడు ప్రయత్నము ద్వారా పొందుతూ ఉంటాము. అప్రాప్తా లన్నీ ఇలాగే ప్రాప్తిస్తూ ఉంటాయి ***(అప్రాప్తస్య ప్రాప్తిః)***.

అదలా ఉంచితే, కొన్ని సమయాలలో ఉన్న వాటినే మనం ఆశిస్తుంటాము. ఉన్నవి లేవు అనుకొని వాటిని పొందే ప్రయత్నం చేస్తూ ఉంటాము. అలా లేవని భావించేవి నొసటనే ఉన్న సులోచనాలు కావచ్చు, భుజంపై ఉన్న తుండుగుడ్డ కావచ్చు, చంకనే ఉన్న గొర్రెపిల్ల కావచ్చు, లేదా మెడలో ఉన్న కంఠాభరణమే కావచ్చు. ఏదైనా సరే, పొందాలి అని అనుకు న్నప్పుడు, లేని సొరకాయను సంత కెళ్ళి తెచ్చుకున్నట్లు, ఉండి కూడా లేనట్లు తెలిసే దానిని ప్రయత్నం ద్వారా పొంద లేము. కర్మ ద్వారా సాధించ లేము. అలాంటి దానిని పొందాలి





అంటే, దానిని మనం పొందే ఉన్నట్లు తెలుసుకోవాలి. అంతే. కారణం, అది పొందబడి ఉన్నదే గాని లేనిది కాదు కనుక ***(ప్రాప్తస్య ప్రాప్తిః)***. అప్రాప్తాలను పొందటానికి కర్మలు చేయాలి. ప్రాప్తాలను పొందటానికి కర్మలు ఉపకరించవు; జ్ఞానమునే ఆశ్రయించాలి.

జ్ఞానం అనేది మన వల్ల నైనా మనకు కలగాలి. లేదా జ్ఞానము కల వారు ఇవ్వడం వల్ల నైనా లభించాలి. ప్రాప్తించే ఉన్న దానిని పొందడానికి స్వప్రయత్నం పనికి రాదు. ఉన్న దానిని లేదని నిర్ణయించుకున్న వాడు, తాను లేదని భావిస్తున్నది లేనిది కాదని, ఉన్నదే నని తనకు తానుగా పునః నిర్ణయించుకో లేడు. తనకు తానుగా తెలుసుకో లేని దానిని ఇతరులు తెలిపితే తెలుసు కుంటాడు. జ్ఞాన మెప్పుడూ ఇలాగే ప్రాప్తిస్తుంది. వెలుగులో చీకటి అదృశ్య మైనట్లు, జ్ఞాన ప్రాప్తిలో అజ్ఞానం అంతరిస్తుంది ***(అవిద్యా యాః నివర్తకం సమ్యగ్దర్శనమ్*** - *గీతాభాష్యం - 13 - 27)*.

**ప్రాప్తమే ప్రాప్తించాలి**

మరి, మనం పొందాలి అనుకుంటున్న పురుషోత్తముడు లేని వాడా, ఉన్నవాడా? లేనివాడు పురుషోత్తము డెలా అవుతాడు? ఉన్నవాడే. ఎలా ఉన్నాడు? సర్వమూ తానై అద్వయంగా ఉన్నాడు. పూర్ణుడై ఉన్నాడు ***(పూర్ణత్వాత్)***. అందుచేతనే సర్వోన్నతుడై శోభిస్తున్నాడు ***(ఉత్తమః)***. అంటే, తానొక్కడే ఉన్నాడు. సర్వమూ తానే అయి ఉన్నాడు ***(సర్వం ఖల్విదం బ్రహ్మ)***. ఆ బ్రహ్మమే పురుషోత్తముడు. ప్రాప్తమై ఉన్న పురుషోత్తముడు ప్రాప్తించినట్లు తెలియడం లేదు. ఇదే అజ్ఞానము. జ్ఞానము ద్వారా అజ్ఞానము నివారింప బడితే, మేఘాలు తొలగి పోగానే సూర్యదర్శన మైనట్లు, పురుషోత్తమ ప్రాప్తి సిద్ధిస్తుంది. ఎప్పుడు? ఇప్పుడే, ఇక్కడే. అంతేగాని ఎప్పుడో, ఎక్కడో కాదు. ఎప్పుడో, ఎక్కడో పొందడానికి అది సంత లోని సొరకాయ కాదు; తలకాయ మీదే ఉన్నా లేనట్లు అనిపించిన కళ్ళజోడు లాంటిది. అలాంటిది దేశ కాల నిమిత్తాపేక్ష లేనిది. కర్మాపేక్ష లేనిది. ప్రాప్తించే ఉన్నది. అదే మోక్షము. పురుషోత్తమ తత్త్వము. ఉన్నది అనే జ్ఞానం వల్ల ప్రాప్తించే మోక్షము.

**న దేశ కాల నిమిత్తాపేక్షో మోక్షః కర్మ ఫలవత్ భవితు మర్హతి !**

'మోక్ష మనేది, దేశ, కాల, నిమిత్తాదులపై ఆధారపడి ఉండేది కానందున అది కర్మఫలం కాదు' అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి *( సూ.భా ; 4 - 1 - 13 )*. మోక్షం ఉన్నదే; రానున్నది, కానున్నది కాదు. నీవు మోక్ష రూపుడవే. అది నీకు తెలియాలి, అంతే. కనుక, మోక్ష రూపమైన పురుషోత్తమ ప్రాప్తి స్మారకమే గాని కారకం కాదు. మరి, ప్రాప్తించే ఉన్న నిత్యమోక్షం తెలిసే దెలా? ఆ ఉపాయమే తెలియాలి. అదే జ్ఞానోపాయము. పురుషోత్తమ ప్రాప్తి అనే అధ్యాయ నామంలో 'యోగం' అనే పదము.

**'యోగ' శబ్దార్థము**

'యోగము' అంటే సఙ్గతి లేదా యుక్తి అని అర్థము ***(యోగః సఙ్గతి యుక్తిషు)***. యుక్తి అంటే ఉపాయము అని అర్థము. నిత్యముక్తమైన మోక్షము ప్రాప్తించి ఉన్నదే కనుక, దానిని పొందడము అంటే తెలుసుకోవడమే అనే వాస్తవాన్ని ఇప్పటికే దర్శించాము. కనుక పురుషోత్తముని పొందడానికి ఉపాయము ***(యోగః)*** జ్ఞాన మొక్కటే. మోక్షము అనేది జ్ఞాన గమ్యము. అంటే జ్ఞానము వల్లనే పొంద బడేది అని అర్థము ***(జ్ఞానే నైవ గమ్యతే ఇతి జ్ఞానగమ్యః)***. అంటే, వేదాంత తత్త్వజ్ఞానము చేత ప్రాప్తించేది. పురుషోత్తముడే జ్ఞాన గమ్యము. ఇట్టి తత్త్వ జ్ఞానము ఆచార్యుని బోధ వల్లనే ప్రాప్తిస్తుంది. కాని, ఇక్కడ మన భాగ్య మేమిటంటే, జ్ఞాన గమ్యమైన ఆదిదేవుడే ఆచార్యదేవుడై వచ్చి బోధిస్తున్నాడు. అందుకనే అర్జునుడు అడగక పోయినా అచ్యుతుడు అందించడానికి ఆరంభిస్తున్నాడు.

అడిగితే అడిగిందే లభిస్తుంది. అడగకుండానే లభిస్తూ ఉంది అంటే అవసరమైన దంతా పూర్ణంగా సిద్ధిస్తూ ఉంది అని అర్థం. అదే పురుషోత్తమ ప్రాప్తి. ఆచార్యుల వారు అభిప్రాయ పడినట్లు సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహము. అర్జునుని ప్రశ్న కొరకు నిరీక్షించకుండా భగవంతుడే స్వయంగా ఉపక్రమించి ఉద్బోధించిన అధ్యాయాలలో ఇదొకటి ***( అర్జునేన అపృష్ట మపి ఆత్మనః తత్త్వం వివక్షుః ఉవాచ భగవాన్ ).***

## అర్థ సిద్ధ ప్రసంగము

ఏదైతే ప్రాప్తించే ఉందో, సిద్ధించే ఉందో, అట్టి స్వతః సిద్ధమైన పరమాత్మ విషయమే ఈ అధ్యాయంలో ప్రసంగ విషయమై ఉంది. కనుకనే పార్థుని ప్రశ్నతో సంబంధం లేకుండానే, అడగక పోయినా తల్లి బిడ్డ ఆకలి తీర్చినట్లు, దీనదయాళుడు, భక్తవత్సలుడు అయిన పరమేశ్వరుడు తనకు తానుగా ఈ అధ్యాయాన్ని ఆరంభించాడు. ఇక్కడ అడగ వలసింది ఏమీ లేదు. అంతా వినవలసిందే ఉంది. శ్రవణమే సాధనమై ఉంది ***(శ్రవణ మేవ సాధనం ).*** కనుకనే వేదాంతము శరణ్య మైంది ***( శ్రుతి రేవ శరణ మితి ).*** వేదాంత శాస్త్ర మంతా సారభూతంగా ఈ అధ్యాయం లోనే సమాప్త మైంది అని ఆచార్యుల వారి అభిప్రాయాన్ని కూడా మనం చెప్పుకున్నాం. కొందరైతే, భగవద్గీత పదిహేనవ అధ్యాయం వద్దనే సమాప్త మైంది అని కూడా భావించి వ్యాఖ్యానించారు.

గ్రంథము యొక్క ఉపక్రమ ఉపసంహార పద్ధతులలో కొన్ని నియమాలు అనుసరణీయాలు. ***అథ*** శబ్దాన్ని గ్రంథారంభమును సూచించడానికి ఉపయోగిస్తారు. అలాగే **ఇతి** శబ్దాన్ని గ్రంథ సమాప్తికి ఉపయోగిస్తారు. గ్రంథారంభం లోని ప్రార్థనా సంగతిలో అనుబంధ చతుష్టయమును అనుసరించినట్లే, ఈ 'అథ - ఇతి' శబ్దాలను ప్రయోగిస్తూ ఉపక్రమ, ఉపసంహార విధానాలను అనుసరిస్తారు. ఇది శిష్టాచార సంప్రదాయ విధి.

పదిహేనవ అధ్యాయము ***ఇతి గుహ్యతమం శాస్త్రం*** అంటూ సమాప్తం చేయబడింది. విషయం చూస్తే పురుషోత్తమ ప్రాప్తి అయింది. పైగా అధ్యాయాంత శ్లోకంలో ఈ జ్ఞానం వల్ల కృతకృత్యత లభిస్తుందని ఫలశ్రుతి కూడా చెప్పడం జరిగింది. ఈ కారణం చేతనే పంచదశాధ్యాయమును గీతా శాస్త్రము యొక్క సంక్షిప్త రూప మనే గాక, సర్వ సిద్ధాంత సార సంగ్రహంగా శ్రీ శంకరాచార్యస్వామి అభివర్ణించారు.

మరి, పదిహేనవ అధ్యాయం వద్ద పురుషోత్తమ ప్రాప్తితో గీత సమాప్త మైతే, మిగిలిన మూడు అధ్యాయాల విషయ మేమిటి? అనే సందేహము సాధారణం గానే కలుగుతుంది. పదహారు, పదిహేడు అధ్యాయాలను పరిశిష్ట విషయంగా గ్రహించారు. అంటే, పూర్వాధ్యాయాలలో చెప్పడానికి అవకాశం లేని ముఖ్య విషయాలను ప్రస్తావించి ప్రసంగించడం, లేదా చెప్పిన విషయాలనే విస్తరించి చెప్పవలసిన అవసరాన్ని గుర్తించి వాటిని పునః ప్రవచించడం పరిశిష్టం. ఇకపోతే, చివరి అధ్యాయమైన మోక్ష సన్యాస యోగమును ఉపసంహార విషయంగా గుర్తించి, సింహావలోక న్యాయమును అనుసరిస్తూ, పూర్వ ప్రవచనము నంతా దృష్టిలో ఉంచుకొని బోధించిన పరిసమాప్తి విషయంగా భావించారు.

నా అభిప్రాయంలో ఈ అధ్యాయం వామనమూర్తి దర్శనం చేయిస్తుంది. కేవలం ఇరవై శ్లోకాలే ఉన్నా, వేద సారాన్నంతా అందిస్తుంది. బలి చక్రవర్తి భాగవతంలో చెప్పినట్లుగా,

*క॥ ఉడుగని క్రతువుల వ్రతముల బొడుగన జననట్టి పొడవు పొడవున గుఱుచై*
*యడి గెడినట నను బోటికి నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్ ॥*

'ఎన్ని యజ్ఞాలు చేసినా, మరెన్ని క్రతువు లాచరించినా లభ్యం గాని వాడు, ఎంతో పెద్దవాడు, చాలా చిన్నవాడై, పొట్టివాడై పలుకు తున్నాడు. అతడు చెప్పినట్లు చేయడం కన్నా కావలసింది ఏముంటుంది?'





అన్నట్లు, ఆద్యంతము లెక్కడో బ్రహ్మ రుద్రాదులకే అంతుపట్టని వేదనారాయణుడైన పురుషోత్తముడు ఈ అధ్యాయంలో కేవలం ఇరవై శ్లోకాలలో వామనమూర్తిలా చూడ ముచ్చటగా దర్శన మిస్తాడు.

శ్లోకానుక్రమంలో ముందుకు సాగుతూ ఉంటే, ***ఇంతింతై వటుడింతయై.... ప్రభారాశిపై నంతై, చంద్రుని కంతయై .....*** అంటూ ఆకాశంలో సూర్యచంద్రులే అప్రధానులై కనిపిస్తున్న దశలో బ్రహ్మాండాన్నంతా ఆక్రమించిన వామనమూర్తికి ***రవి బింబం బుపమింప బాత్ర మగు ఛత్రంబై*** - సూర్యబింబము గొడుగులా నిలిచి ఉందని ఆంధ్ర మహాభాగవతంలో పోతనామాత్యుడు వర్ణించినట్లు; పురుషోత్తముని శరణుజొచ్చి, అవ్యయ పదమును పొందే స్థితిని అయిదవ శ్లోకంలో చెప్పి, సూర్యచంద్ర నక్షత్రాగ్నులు ప్రకాశించ లేని పురుషోత్తముని దివ్య ధామమును ***న తద్భాసయతే సూర్యో*** అంటూ ఆరవ శ్లోకంలో వర్ణిస్తూ ఉంటే, బ్రహ్మాండాంత సంవర్ధి యైన వామనమూర్తి వైభవము మనస్సులో తళుక్కు మంటుంది. శ్లోక పరంగా చూస్తే అధ్యాయం చాలా చిన్నది. విషయపరంగా చూస్తే చాలా పెద్దది. బ్రహ్మాండాలను తన కుక్షిలో నింపుకున్న పురుషోత్తమునే గర్భం దాల్చిన అధ్యాయ మిది. ఉపోద్ఘాతాన్ని తృప్తిగా చెప్పుకున్నాం. ఇక అధ్యాయం లోకి ప్రవేశిద్దాం. చదవండి.

**శ్రీ భగవానువాచ :**

ఊర్ధ్వమూల మధః శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥ 1

***ఊర్ధ్వమూలం-అధఃశాఖం-అశ్వత్థం-ప్రాహుః-అవ్యయం***
***ఛందాంసి-యస్య-పర్ణాని-యః-తం-వేద-సః-వేదవిత్***

| | | | |
|---|---|---|---|
| ఊర్ధ్వమూలం | = మూలము పైన గలది | పర్ణాని | = ఆకులు |
| అధః శాఖం | = శాఖలు క్రింద గలది | తం | = దానిని |
| అశ్వత్థం | = అశ్వత్థము | యః | = ఎవడు |
| అవ్యయం | = నశించనిది | వేద | = గ్రహించు చున్నాడో |
| ప్రాహుః | = చెప్పారు | సః | = వాడు |
| యస్య | = దీనికి | వేదవిత్ | = వేదార్థమును తెలిసిన వాడు |
| ఛందాంసి | = వేదములు | | |

**శ్రీ భగవంతుడు చెబుతున్నాడు :**

**అర్జునా! ఈ ప్రపంచాన్ని అశ్వత్థ వృక్షము అన్నారు. దీని మూలము పైన ఉంటుంది. శాఖలు క్రిందికి ఉంటాయి. ఇది అంతు లేనిది. వేదాలే దీని ఆకులు. దీనిని తెలుసుకున్న వాడే వేదవేత్త.**

**వ్యాఖ్య**

**భక్తి వైశిష్ట్యము**

భగవంతుడు భక్త వశుడు. భగవంతుని వశపరచు కోవడానికి భక్తికి మించిన సాధనం లేదు. ***అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ*** - సాధన లన్నిటి లోకి భక్తి సులభమైంది. సురక్షిత మైంది. సరళమైంది. సమున్నత మైంది. భక్తి నిత్య స్మరణాత్మకం. సదా ధ్యానమయం. సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారము. భక్తి వ్యాపారానికి కావలసిన పెట్టుబడి అందరి వద్ద ఉంది. యోగానికి ప్రత్యేక లక్షణాలు ఉండాలి. జ్ఞానయోగానికి

ప్రత్యేకమైన సాధన చతుష్టయాది యోగ్యతలు ఉండాలి. మరి భక్తికి ఏమి ఉండాలి? ప్రేమ ఉండాలి. ప్రేమ ఒక్కటే భక్తికి పెట్టుబడి. ప్రేమ లేని మనిషి ప్రపంచంలో ఉన్నాడా? ఎవరు దేనిని ప్రేమిస్తున్నారు, ఎవరిని ప్రేమిస్తున్నారు అనేది వేరే విషయం. ప్రేమించకుండా ఎవరూ ఉండలేరు అనేది మాత్రం నిజం.

అందరూ ప్రేమించే వారే. ప్రేమ అందరి హృదయం లోనూ ఉంది. కాకపోతే, మన హృదయం లోని ప్రేమ ప్రవాహం అనిత్య మార్గాలలో పయనిస్తోంది. అందువల్ల అది లాభదాయకంగా లేదు. పైగా అంతా నష్టదాయకమే. ఎక్కడ లాభముందో, ఎక్కడ నష్టముందో, ఏది శ్రేయస్సో, ఏది ప్రేయస్సో అర్థం కాకపోవడం చేత, ప్రేమకు పూర్ణత్వం కలగక పోగా, అనిత్యాలను ప్రేమించిన దోషానికి భగవ న్మందిరాలుగా ప్రకాశించ వలసిన మానవ హృదయాలు శూన్య కుటీరాలుగా మిగిలి పోతున్నాయి.

భక్తి బ్రతుకును భగవన్మయం చేస్తుంది. భక్తి ఏదో కాదు; భగవంతుని యందు అచంచలంగా నిలిచిన పరమోత్కృష్టమైన ప్రేమయే భక్తి. ప్రేమ అందరిలో ఉంది. ప్రేమించడానికి అందరూ అర్హులే. పండితులలో ప్రేమ ఉంది. పామరుల లోనూ ఉంది. స్త్రీలలో ఉంది, పురుషులలో ఉంది, పిల్లలలో ఉంది, ధనికులలో ఉంది, దరిద్రులలో ఉంది, యోగులలో ఉంది, భోగులలో ఉంది, రోగుల లోనూ ఉంది. ప్రేమ ఎవరిలో లేదు? అందరి లోనూ ఉంది. అమూల్యమైన, పవిత్రమైన ప్రేమ అందరిలో ఉన్నా, అందరూ ప్రేమను వృథా చేసుకుంటూనే ఉన్నారు. పుత్ర, దార, గృహాదుల యందు, బంధు, మిత్ర, వాహనాదుల యందు, ఒక్క మాటలో చెప్పాలంటే, అనిత్యమైన ప్రపంచంలో ప్రేమను పెట్టుబడిగా పెట్టి అందరూ నష్ట జాతకు లవుతున్నారు. కష్టాల కానలలో కాపుర ముంటున్నారు. కన్నీటి కడలిలో మునిగి పోతున్నారు. సంసార మనే ఊబిలో కూరుకు పోతున్నారు. జననమరణాల మధ్య పరుగు పెడుతున్నారు. ఈ తీరు మారాలి. బ్రతుకును బాధలమయం చేసే ఈ రీతి మారాలి. ఈ దుస్థితి తొలగాలి. ఈ దుర్గతి దూరం కావాలి. సద్గతి సమీపించాలి. ప్రాప్తించాలి. దాని కొక్కటే మార్గం. మన హృదయంలో ఉత్పన్నమై నికృష్ట మైన అనిత్య మార్గాలలో పయనించి, ప్రపంచ ఎడారిలో పడి మృగ్యమయ్యే పవిత్ర ప్రేమ జలాలను దారి మళ్ళించి, ఉత్కృష్ట మైన సత్యమార్గంలో పయనింప చేసి, పరమేశ్వరుని దివ్యధామాన్ని చేరే ప్రయత్నంలో జీవు లందరూ కృతకృత్యులు కావాలి. అదే ఏకైక మార్గము. భగవంతుని చేరి తరించే భక్తి మార్గము *(14 వ అ - 26 వ శ్లో)*. జననమరణాల సుడిగుండం నుండి బయట పడి ముక్తిని పొందే ఏకైక ఉపాయము.

ఆ॥ ***దీన శుభము లేదు, దివ్య కీర్తియు లేదు, జగతి బుట్టి పుట్టి చచ్చి చచ్చి***
***పొరల నేల మనకు బుట్టని చావని త్రోవ వెదకి కొనుట దొడ్డ బుద్ధి***

ఏముంది సంసారంలో? సుఖము లేదు. శుభము లేదు. సన్మతి లేదు. సద్గతి లేదు. పుట్టడం చావడం, చావడం తిరిగి పుట్టడం. ఎంత కాలం ఈ చక్ర భ్రమణం? వక్ర గమనం? చావుపుట్టుకలు లేని, ద్వంద్వాలు బంధించని, అందమైన, ఆనంద ప్రదమైన మార్గాన్ని వరించి పయనించడమే శ్రేయమని ప్రహ్లాదుడు చెప్పిన సదుపదేశాన్ని, చూపిన సన్మార్గాన్ని అనుసరించడమే సర్వులకు కర్తవ్యం కావాలి. అదే శ్రేయోమార్గం.

## విరక్తి ఉంటేనే భక్తి

ప్రకృతికి వశమైన వాడు పరమాత్మను వశం చేసుకోలేడు. మాయలో పడ్డవాడు మహిమను దర్శించ లేడు. ప్రపంచంపై అనురక్తి కలవాడు పరమేశ్వరునిపై ఆసక్తిని పెంచుకోలేడు.

అన్య విషయ విస్మరణము లేనిదే అనన్య భక్తి కలగదు. అనన్య భక్తి కలవారే భగవంతుని ఆశ్రయిస్తారు. ఆశ్రయించిన వారే ఆరాధిస్తారు. ఆరాధించిన వారే అచ్యుతుని పొంది తరిస్తారు.





పట్టుకున్న దానిని విడిచి పెడితేనే, పట్టుకోదగిన దానిని పట్టుకుంటాము. బంధము తొలగి నపుడే ఎవరి కైనా ముక్తి. అదే మోక్షము. అందరికీ నిత్యమోక్షం కావాలి. మరి, అనిత్య సంసారంలో నిత్యమోక్షం ప్రాప్తిస్తుందా? కనుక సంసారాన్ని దాటిన వారికే నిత్యమోక్షం. ఇంతకీ ఏమిటి ఈ సంసారం? ఎక్కడుంది ఈ సంసారం? ఈ సంసార సాగరాన్ని దాటే దెలా?

ఇక్కడే ఒక చిక్కుముడి ఉంది. గోడ ఉంది కనుక గోడను దాటుతాము. నది ఉంది కనుక నదిని దాటుతాము. మరి, సంసారాన్ని దాటాలి అంటే సంసారం ఉండాలి కదా! ఉందా? ఉంది. ఎలా ఉంది? సత్యంగా ఉందా? లేక సత్యంగా లేకనే ఉన్నట్లు అనిపిస్తూ ఉందా?

సంసారము సత్యమే అయితే, సత్యమైనది నశించేది కాదు కనుక, సంసారం కూడా నశించదు. ఒకవేళ సంసారము లేనిదే అయితే, అసత్యమే అయితే, దానిని ఛేదించ నవసరం లేదు. భేదించ నవసరం లేదు. ఇదీ చిక్కుముడి.

అటు ఉన్నది కాక, ఇటు లేనిదీ కాక, ఉన్న త్రాడులో లేని సర్పము గోచరించినట్లు ***(రజ్జుసర్పవత్)***. లేని సంసారము ఉన్న దాని వలె ***(ఇవ)*** భ్రాంతిలో కనిపిస్తూ ఉంది. అలాంటి సంసార సాగరాన్ని ఎలా దాటాలి?

ఉన్నదాని నైతే శ్రమించి దాటాలి. లేనిది ఉన్నట్లుగా అనుభవానికి అందే టప్పుడు, దానిని దాటడము అంటే, అది లేదు అని తెలుసుకోవడమే. పాము లేదు అని తెలుసుకు న్నప్పుడు సర్పభ్రాంతితో పాటు సర్పభయం కూడా తొలగినట్లు, సంసారము లేనిదే, ఇది మిథ్యా ప్రపంచమే అనే జ్ఞానం కలిగితే, సంసార దుఃఖం కూడా దూర మవుతుంది.

మరి, లేకనే ఉన్నట్లు అనిపించే ఈ సంసారం ఎక్కడుంది? ఎలా ఉంది? తెలిసి నపుడే అది నివారించ బడుతుంది. అదొక మహావృక్షంలా ఉంది. మహా విచిత్రంగా ఉంది. మూలం పైన ఉంది. శాఖలు క్రిందికి ప్రాకుతూ ఉన్నాయి. అదొక మాయా వృక్షం. అనాదిగా ఉంది. ప్రవాహ నిత్యత్వంతో అవ్యయంగా తెలుస్తూ ఉంది. ఎంత అవ్యయమైనా వృక్షం కనుక ఒకనాడు కూలి పోయేదే ***(వృశ్చతే ఇతి వృక్షః)***. అందుచేత నేడు ఉన్నా రేపు ఉంటుందని నిర్ధారణ చేయ శక్యం కానిది. అందుకే అది అశ్వత్థమై ఉంది.

సంసారాసక్తి ఎవరిలో అయితే క్షీణిస్తూ ఉంటుందో, వారిలో భగవదాసక్తి వృద్ధి చెందుతూ ఉంటుంది. సంసారముపై వైరాగ్యము జనించి నపుడే బుద్ధి భగవంతుని ఆశ్రయిస్తుంది. కనుక ఎవడు విరక్తుడో వాడే భక్తుడు అవుతాడు. భక్తి చేయడానికి అర్హుడు అవుతాడు ***(విరక్తస్య హి సంసారాత్ భగవత్తత్త్వ జ్ఞానే అధికారః)***. ఎవడు సంసారము నందు విరక్తుడో, వాడికే భగవంతుని తత్త్వజ్ఞానమును పొందుటకు అధికారము. కనుక, భక్తికి ప్రధానమైన వైరాగ్యమును కల్పించడం కోసం సంసారమును వృక్ష రూపక అలంకారము చేత వర్ణిస్తున్నాడు భగవంతుడు.

గుణత్రయమును దాటిన వాడు మోక్షానికి సమర్థు డగుచున్నాడు అని పద్నాల్గవ అధ్యాయం - ఇరవై ఆరవ శ్లోకం. గుణాతీతుడు కావడానికి అచంచలమైన భక్తి ప్రధాన మైనది అని కూడా అక్కడ చెప్పడం జరిగింది. అంటే, భక్తిలో చపలత కలిగి స్థిరత లేని వారు ప్రగతిని సాధించ లేరని, సద్గతిని పొంద లేరని స్పష్ట మౌతూనే ఉంది. మరి, భక్తిలో ఎందుకని అస్థిరత్వము ఏర్పడుతూ ఉంది? స్థిర భక్తి కలగక పోవడానికి కారణ మేమిటి? ఏది ప్రతిబంధకము? ప్రపంచమే. నామరూపాత్మకమైన ప్రపంచమే. నిరంతరము ప్రపంచం స్మృతిలో ఉండటమే పరమాత్మ విస్మృతికి కారణము. పరమాత్మపై అచంచలమైన భక్తి ఏర్పడాలి అంటే అస్థిరమై,

అనిత్యమైన ప్రపంచంపై ఉండే మక్కువ తక్కువ కావాలి. అలా జరగాలి అంటే ప్రపంచము యొక్క నిజరూపం తెలిసి రావాలి. అది అశ్వత్థ మని అర్థం కావాలి.

**అశ్వత్థం**

సంసారముపై విరక్తి జనించడానికి, సంసారానికి వృక్ష రూపాన్ని కల్పించి వర్ణిస్తున్నాడు భగవంతుడు ***(వృక్ష రూప కల్పనయా వైరాగ్య హేతోః సంసార స్వరూపం వర్ణయతి ).*** సంసార వృక్షమును అశ్వత్థ వృక్షంగా వర్ణిస్తున్నాడు. ***అశ్వత్థః*** అంటే రావిచెట్టు అని అర్థము. ***శ్వః*** అంటే రేపు అని అర్థము. రేపు ఉండునది శ్వత్థం. రేపు ఉండనిది అశ్వత్థం. రేపు కూడా ఉంటుంది అని చెప్పడానికి వీలు లేనిది అశ్వత్థం ***( న శ్వః అపి స్థాతా ఇతి అశ్వత్థః ).*** అదే సంసార వృక్షము. మార్పే లక్షణంగా కలది. నశించే స్వభావం కలది. క్షణంలో నశించిపోయే స్వప్నం లాంటిది ***( అశ్వత్థం క్షణ ప్రధ్వంసినమ్ స్వప్నవత్ ).*** అంటే కాలగత మైంది. ఎంతకాలం మనుగడను సాగించినా, ఏదో ఒక కాలంలో లేకుండా పోయేది సంసార వృక్షము. ఖండిస్తే పోతుంది. ఖండించక పోయినా దానంతట అదే ఎండి పోతుంది. కాలంలో కనుమరు గవుతుంది. కనుక అశ్వత్థము క్షణ భంగురము.

వృక్షము ఏదైనా దానికి ఆది ఉంటుంది. ఆది ఉన్న దానికి అంతము ఉండి తీరాలి. సంసారమును వృక్షంతో పోల్చడం చేత దానికి కూడా ఆద్యంతా లున్నాయని చెప్పినట్లే అయింది. వృక్షం కార్య రూపంలో ఉంది కనుక దానికి కారణం ఉండి తీరాలి. సంసారం కూడా కార్యంగా తెలుస్తూ ఉంది కనుక దానికి కూడా కారణం ఉండాలి.

సంసారమును అశ్వత్థ మంటూ వృక్ష రూపక కల్పన చేత వర్ణించినా, సాధారణంగా మనం చూచే వృక్షాలకు ఈ సంసార వృక్షము విలక్షణంగా ఉంది. అసాధారణ వృక్షంగా కనిపిస్తూ ఉంది. ప్రపంచంలో మనం చూచే వృక్షాలకు మూలాలు క్రింద ఉంటాయి. వాటి కొమ్మలు పైకి విస్తరించి ఉంటాయి. కాని, ఈ అశ్వత్థ మనే సంసార వృక్షానికి మూలం పైన ఉంటుంది. కొమ్మలు అధోముఖంగా వ్యాపించి ఉంటాయి. ప్రపంచం లోని వృక్షా లన్నీ ఒక విధంగా ఉంటే, వృక్షా లన్నిటినీ తన లోనే ఉంచుకున్న ప్రపంచ వృక్షము మాత్రము ప్రత్యేకంగా ఉంది.

వృక్షము ఎంత పెద్ద దైనా అది బీజం నుండే ఆవిర్భవించినట్లు, బీజంలో అవ్యక్తంగా ఉన్నదే బాహ్యంలో వృక్షంగా పరిణమించినట్లు, ఈ విశ్వ వృక్షము కూడా ఆదిబీజమైన బ్రహ్మము నుండే ఆవిర్భవించింది. అవ్యక్తము, మాయోపాధిక మైన బ్రహ్మమే ఈ వృక్షమునకు మూలము. అందుచేత సంసార వృక్షానికి మూలము పైన ఉంది ***( ఊర్ధ్వమూలం )*** అని చెప్పబడింది.

మానవుల మైన మన దృష్టి మూడు విధాలుగా ఉంటుంది. మొదటిది బాహ్యదృష్టి , లేదా బయటి చూపు. రెండవది అంతర్దృష్టి , లేదా లోచూపు. మూడవది ఊర్ధ్వ దృష్టి , లేదా పైచూపు.

ఇంద్రియాల ద్వారా మనస్సు బాహ్య ప్రపంచాన్ని వీక్షించడం బాహ్యదృష్టి. ఇది విషయ ప్రపంచాన్ని గ్రహించే వీక్షణం. అలా కాకుండా, ఇంద్రియాల నుండి, ఇంద్రియ విషయాల నుండి విడిపడి కేవలం మనస్సు తనలో తనను అవలోకించు కోవడం అంతర్దృష్టి. దానినే అంతర్ముఖం అంటారు. ఇది మనో ప్రపంచ వీక్షణం. ఇక మూడవది, బాహ్య ప్రపంచ వీక్షణము కానిది, అంతరీక్షణానికి అతీత మైనది. అదే ఊర్ధ్వ దృష్టి అనే బ్రహ్మదృష్టి. ఆకాశం వైపు సాగే దృష్టి. గగన విహారం చేసే దృష్టి. అంతా విచిత్రమై, అద్భుతంగా గోచరిస్తూ, విషయం అగ్రాహ్య మైనపుడు, మనస్సు కందని ఆ విషయాన్ని గూర్చి విస్మయాన్ని వ్యక్తం చేస్తూ ఆకాశం వైపు దృష్టి సారిస్తాము. అనంతాన్ని అవలోకించే ప్రయత్నంలో ఉంటాము. అదే ఊర్ధ్వం.





ఊర్ధ్వం అంటే ఉన్నత మైనది, ఉత్కృష్ట మైనది, శ్రేష్ఠ మైనది అని అర్థం. అంతేగాని పైన అనే అర్థాన్ని మాత్రమే గ్రహిస్తే, మూలమైన ఊర్ధ్వం తెలిసి రాదు. ***ఊర్ధ్వం*** అంటే ఉత్కృష్టము కనుక ***అధః*** అంటే నికృష్టము అని అర్థము.

సాధారణంగా వృక్షము మనకు గోచరిస్తుందే గాని దాని మూలము అంటే బీజము మనకు గోచరించదు. అలాగే ఇక్కడ కూడా ప్రపంచ వృక్షము మనకు కనిపిస్తూ ఉంది. కాని, దాని మూల మెక్కడో మనకు కనిపించడం లేదు. మన చూపు కందనంత ఊర్ధ్వంగా మూలం ఉంది. అదే ఈ విశ్వానికి కారణము. కనిపించే కార్యరూప ప్రపంచానికి కారణము. అదే 'ఆజీవ్యము' అంటే జీవనాధారము. అవ్యక్తమైన మాయాశక్తితో కూడిన బ్రహ్మమే ఈ సంసార వృక్షమునకు ఊర్ధ్వమున ఉండే మూలము. లేదా మూల కారణము ***( ఊర్ధ్వమూలం - ఊర్ధ్వం ఉత్కృష్టం మూల కారణం యస్య ).*** అట్టి కారణము నుండి ఉత్పన్నమైన ఈ విశ్వ వృక్షము 'అవ్యక్త మూల ప్రభవము'.

ప్రపంచ మనే సంసార వృక్షానికి మూలము ఊర్ధ్వంగా ఉంది అని అర్థం చేసుకున్నాం. బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉన్న అవ్యక్తమే జగత్కారణమైన ప్రకృతి అని, కారణం కావడం చేత అది మూల ప్రకృతి అని తెలుసుకున్నాం. పరమేశ్వరుని సన్నిధిలో ఈ మూల ప్రకృతి సృష్టి కార్యాన్ని నిర్వహిస్తూ ఉంది *(9 వ అ - 10 వ శ్లో).* పరమేశ్వరుడు బీజ ప్రదాతగా ఉండటం చేతనే అవ్యాకృతమైన ప్రకృతి వ్యాకృతమైన ఈ విశ్వ సృష్టికి కారణ మవుతూ ఉంది *(14 వ అ - 3 వ శ్లో).* ఎప్పుడైతే, ప్రపంచ వృక్షానికి కారణమైన ప్రకృతి బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉందో, సర్వోత్కృష్టము, ప్రశస్తమైన బ్రహ్మము ఊర్ధ్వం, అనగా ఉన్నతంగా ఉండటం చేత, ప్రకృతి కూడా ఉన్నతం గానే ఉంది. కారణమైన ప్రకృతి ఊర్ధ్వంగా శోభిస్తున్నందున దాని కార్యమైన జగద్వృక్షము యొక్క శాఖలు క్రిందికి విస్తరించి ఉన్నాయి. అందుచేత మూలము ఊర్ధ్వం గాను, శాఖలు అధోముఖం గాను ఉన్నా యని చెప్పడం జరిగింది ***( ఊర్ధ్వమూలం అధః శాఖమ్ ).*** అంటే, నామరూపాత్మకంగా విస్తరించిన కార్యరూప జగత్తంతయు శాఖా విస్తరణమే అని అర్థము. దీనికి ఉన్నతంగా, ఊర్ధ్వంగా పరమాత్మ శోభిస్తున్నాడు అని భావము.

**ఆగమములే ఆకులు**

అశ్వత్థ మనే ఈ సంసార వృక్షానికి ఆగమములే ఆకులు ***( ఛందాంసి యస్య పర్ణాని ).*** 'ఛందాంసి' అంటే వేదములు.

ఛాదనం అంటే ఆచ్ఛాదనము అని అర్థము. ***ఛాదనాత్ ఛందాంసి*** - ఆచ్ఛాదించు లక్షణము, అంటే కప్పేసే స్వభావం కలవి కనుక అవి 'ఛందాంసి' అని పిలువ బడ్డాయి. అవే వేదాలు.

ఆకులు చెట్టును ఆచ్ఛాదించి దానిని రక్షిస్తూ ఉంటాయి. ప్రాణమును గ్రహించి వృక్షాన్ని పరిరక్షిస్తూ ఉంటాయి. చెట్టుకు ఆచ్ఛాదనంగా ఉంటాయి. బాటసారులకు ఛాయా స్థానీయా లవుతూ ఉంటాయి. నిలువ నీడ నిస్తూ ఉంటాయి.

వేదాలు కూడా సంసార వృక్షాన్ని, ఆకులు వృక్షాన్ని ఆచ్ఛాదించినట్లు ఆచ్ఛాదించి ఉంటాయి. చెట్టును ఆకులు రక్షించినట్లు, వేదోక్త కర్మకాండ ప్రవృత్తిని ప్రేరేపించి, ధర్మాధర్మాలు, తజ్జన్య ఫలాలను బోధిస్తూ సంసార వృక్షాన్ని పరిరక్షిస్తూ ఉంటుంది ***( వేదాః సంసార వృక్ష పరిరక్షణార్థాః ధర్మాధర్మ తద్ధేతు ఫల ప్రకాశ నార్థత్వాత్ ! ).***

సంసార వృక్షము లేదా విశ్వ వృక్షంగా తెలిసే ఈ మాయా వృక్షము యొక్క ప్రస్తావన ఉపనిషత్తుల

లోను, మహాభారత పురాణాల లోను అనేక చోట్ల ఉంది. ***ఊర్ధ్వమూలో అవాక్ శాఖః ఏషోఽ శ్వత్థః సనాతనః -*** ఊర్ధ్వమూలత్వము, అధశ్శాఖత్వముగా వర్ణింప బడిన ఈ సంసార మనే అశ్వత్థ వృక్షము సనాతన మైనది అన్నది కఠోపనిషత్తు *(6 - 1).* ఉత్కృష్టమైన బ్రహ్మము నుండి సంసార వృక్షము ఉద్భవించినా, బ్రహ్మము దీనికి అతీతం గానే, ఉన్నతం గానే భాసిస్తున్నాడు అన్నది శ్వేతాశ్వతరోపనిషత్తు *(6 - 6).* మహాభారతము అశ్వమేధ పర్వంలో ***అవ్యక్తమూలప్రభవః -*** అంటూ విశ్వ వృక్షాన్ని అద్భుతంగా వర్ణించింది. వర్ణనలో వైచిత్ర్యము వివిధముగా గోచరించినా, కేంద్ర విషయం మాత్రం అంతటా ఒకే విధంగా ఉంది.

కఠోపనిషత్తులో ***అవాక్శాఖ*** అంటే భగవద్గీత ***అధశ్శాఖం*** అని; ఉపనిషత్తు ***సనాతనః*** అంటే, భగవద్గీత ***అవ్యయం*** అని, కేవలం పద మార్పిడులే గాని అర్థ భేదం ఎక్కడా లేదు.

మహాభారతం ***ఆజీవ్యః సర్వభూతానాం బ్రహ్మవృక్షః సనాతనః -*** సమస్త భూతములకు 'ఆజీవ్యం' అంటే ఆధారమైన ఈ బ్రహ్మవృక్షము సనాతన మైనది అని శోభాయమానంగా ప్రవచించింది. అశ్వత్థమును బ్రహ్మ వృక్షంగా అభివర్ణించడము విశిష్టంగా ఉంది. సంసార వృక్ష మనే అశ్వత్థమునకు బ్రహ్మమే అధిష్ఠానంగా ఉన్నందున విశ్వవృక్షాన్ని బ్రహ్మవృక్షంగా వర్ణించాడు వ్యాసుడు. బ్రహ్మవృక్షము కనుక బ్రహ్మవనం లోనే ఉంది అని ఇందులో అద్భుతమైన అంతర్భావము ఉంది. ఈ విషయాన్ని తరువాత వివరిస్తాను.

సంసార వృక్షము నామరూపాలతో ఉంది. నామరూపాలు కలవి ఏవైనా ఆద్యంతాలు కలిగే ఉంటాయి. ఆద్యంతాలు కలవి ఏవైనా కాలగతిలో అగుపించి అదృశ్య మవుతూ ఉంటాయి. ఇలాంటి సంసార వృక్షానికి ఆజీవ్యమైన వాడు బ్రహ్మమే అయినా, ఉన్నతుడైన బ్రహ్మము వృక్షాని కంటే, కాలాని కంటే, రూపాల కంటే అతీతమైన వాడు అని శ్వేతాశ్వతరోపనిషత్తు. అందంగా, అద్భుతంగా పరబ్రహ్మమును అధిష్ఠానంగా పొంది ఆవిర్భవించిన ఈ విశ్వ వృక్షము యొక్క స్వభావ స్వరూపాలు ఎలాంటివో సంక్షిప్తంగా తెలుసుకుందాం.

## వృక్ష స్వభావ స్వరూపాలు

సంసారమును వృక్షంతో పోల్చడము లోనే దాని అనిత్యత్వాన్ని తెలియచేసి నట్లైంది. ఎంత కాలమున్నా ఏదో ఒకనాడు ముక్క లయ్యేదే ***(వృక్షశ్చ వ్రశ్చనాత్).*** ఇకపోతే అందులో అన్నీ అనర్థాలే. జననమరణాలు, జరాశోకాలనే అనర్థాలతో నిండి ఉంటుంది ***(జన్మ మరణ శోకాద్యనేక అనర్థాత్మకః).*** క్షణక్షణానికి మారుతూ ఉంటుంది. ఇది ఇలా ఉంటుంది అని నిర్ణయించే లోగా ఎప్పుడు ఏది ఊడి పడుతుందో, ఎప్పుడు ఏది పాడవుతుందో, ఏది ఎప్పుడు ఎలా ఉంటుందో అర్థం కాకుండా ఉంటుంది ***(ప్రతి క్షణం అన్యథా స్వభావః).***

ఉన్నట్లే ఉంటుంది. ఆశలు రేపుతుంది. అంతలోనే లేదనిపించి నిరాశను దించుతుంది. నీళ్ళను చూపెట్టి, తీరా దగ్గరకు వెళ్ళే సరికి నీళ్ళు లేవనే సత్యాన్ని చూపెట్టి కన్నీరు పెట్టించే ఎండమావి లాగా మాయను ప్రదర్శిస్తుంది. గగనంలో గోచరించే గంధర్వ నగరం లాగా ఒక క్షణంలో శోభనాకృతిలో కనిపించి, సమీపించే లోగా, ఆకాశాన మేఘాలు విచ్ఛిన్నమై గంధర్వ నగరం అదృశ్య మైనట్లే, కళ్ళ ముందే అగోచర మవుతూ ఉంటుంది ***(మాయా మరీ చ్యుదక గంధర్వ నగరాదివత్ దృష్ట నష్ట స్వరూపత్వాత్).***

ఎన్ని మాయలు ప్రదర్శించినా అంతిమ దశలో చెట్టు కూలినట్లు కూలి పోయేదే ***(అవసానే చ వృక్షవత్ అభావాత్మకః).*** చివరలో ఎలాగూ చెదలు పట్టి పోయేదే, పోనీ ఉన్నంత వరకైనా సారభూతంగా ఉంటుందా? అదీ లేదు. అరటి బోదె వలె సారహీనమే; నిస్సారమే ***(కదళీ స్తంభవత్ నిస్సారః).***

అశ్వత్థము అంటే రావిచెట్టు అని ముందే తెలుసుకున్నాము కదా! రావి ఆకులు నిరంతరము చలిస్తూనే ఉంటాయి. అలాగే అశ్వత్థ మైనందుకు ఈ సంసార వృక్షము కూడా కామ కర్మ వాయువుల కారణంగా





నిరంతరము చలిస్తూ ఉంటుంది. కంపన స్వభావంతో ఉంటుంది ***(ఏష సంసార వృక్షో అశ్వత్థో, అశ్వత్థవత్ కామ కర్మ వాతేరిత నిత్య ప్రచలిత స్వభావః).*** ఇవీ సంక్షిప్తంగా సంసార వృక్షము యొక్క స్వభావ స్వరూపాలు.

ఇక ప్రయోజనా లంటారా? ఏమున్నాయి? అశ్వత్థమై పోయె! రావిచెట్టులో పూలు పూయవు. పండ్లు ఉండవు. అంటే జ్ఞాన సుగంధం ఉండదు. మోక్షఫలం దొరకదు. ఇక ఆకు లంటారా? అనుక్షణం అల్లాడుతూ ఉంటాయే గాని అర్థవంతాలు కావు. చలనశీలాలే గాని ఉపయుక్తాలు కావు.

అందరి గూళ్ళు ఈ చెట్టు లోనే. వన్నెచిన్నెలతో చిందు లేసేది ఇక్కడే. వన్నెలాడి చిన్న బోయేదీ ఇక్కడే. అంద మేదో, ఆనంద మెక్కడో, ఎందుకనో మానవులకు అర్థం కావడం లేదు. అనిత్యాలే నిత్యాలుగా శోభించి బ్రతుకుల్ని బుగ్గిపాలు చేస్తున్నాయని ఒక కీర్తనలో త్యాగరాజస్వామి గానం చేశాడు.

*ఎందుకో బాగ తెలియదు*
*అందగాడ! శ్రీరామ! ఈ తను వస్థిరమని*
*ఈ కలిమానవులకు ॥ ఎందుకో ॥*

అని మోహాన్ని మాయం చేసే పనిలో భాగంగా మోహన రాగానికి ఆదితాళాన్ని జత చేసి కీర్తించాడు.

## అవ్యయము

ఈ అశ్వత్థ వృక్షము **అవ్యయము**. 'అవ్యయము' అంటే నశించనిది అని అర్థము. మరి, వృక్షము అన్నప్పుడే నశిస్తుంది అని అర్థం కదా! ఇంతవరకు అశ్వత్థ శబ్దార్థాన్ని మనం అలాగే గ్రహించాము. కాని, ఒక్కసారిగా నశించే స్వభావం గల దానిని అవ్యయం అనడం ఎలా పొసగుతుంది? అనే సందేహం కలుగుతుంది.

ఇక్కడ 'అవ్యయము' అంటే మాయామయము అని అర్థము. అంతేగాని నిత్యమని కాదు. నిత్యమైనది కాక పోయినా, ఆ చెట్టులో నివసించే జీవులకు అది నిత్యము గానే కనిపిస్తోంది. అనిపిస్తోంది. అదే ప్రవాహ నిత్యత్వము అంటే. ఎప్పుడూ ఉన్నట్లే ఉంటుంది. ఎప్పటి నుండి ఉందో అర్థం కాకుండా ఉంటుంది ***(అనాది కాల ప్రవృత్తత్వాత్).*** ప్రవాహము ఏదైనా అలాగే ఉంటుంది.

నదీ ప్రవాహాన్ని తీసుకోండి. నదీ జలాలు ముందుకు పోతూనే ఉంటాయి. నదిలో ఒక కాలు పెట్టినపుడు ఉన్న జలం రెండవ కాలు పెట్టే టప్పటికి ఉండదు. పూర్వ క్షణంలో ఉన్న జలం ముందుకు సాగిపోగా, ఉత్తర క్షణంలో పై నుండి వస్తున్న జల ప్రవాహము దానిని పూరిస్తూ ఉంటుంది. వాస్తవానికి నిరంతరము నదీ జలము మారుతూ ఉండినా, మనకు మాత్రం నది పూర్ణశోభ తోనే గోచరిస్తూ ఉంటుంది. అదే ప్రవాహ నిత్యత్వము.

ఈ ప్రపంచం కూడా ప్రవాహ నిత్యత్వముతో కనిపిస్తూ ఉంది. పోయే వాళ్ళు పోతూ ఉన్నారు. వచ్చే వాళ్ళు వస్తూ ఉన్నారు. పుట్టే వాళ్ళు ఒక వైపు పుడుతున్నారు. గిట్టే వాళ్ళు మరొక వైపు గిడుతున్నారు. ఒక వైపు ఖాళీ అవుతూ ఉంటే, మరొక వైపు భర్తీ అవుతూ ఉంది. పూచేవి పూస్తూ ఉన్నాయి. వాడేవి వాడుతూ ఉన్నాయి. వాలేవి వాలుతూ ఉన్నాయి. రాలేవి రాలుతూ ఉన్నాయి. ప్రాణవాయువు సదా చలిస్తూనే ఉంది. అయినా ప్రాణవాయువు అందక కొందరు నిష్క్రమిస్తూనే ఉన్నారు. కనుక ఈ సంసార వృక్షము అవ్యయము ***(అయం సంసార వృక్షః అవ్యయః).***

వృక్షము శాఖోపశాఖలుగా విస్తరించినా, ఆకులతో, పువ్వులతో కళకళ లాడినా, ఈ విచిత్ర శోభ అంతా ఒకప్పుడు బీజంలో నిక్షిప్తమై ఉన్నదే. బీజములో లేనిది చెట్టులో ఎలా వస్తుంది? ప్రస్తుతం మహావృక్షముగా తెలిసేది పూర్వం బీజంలో అవ్యక్తంగా ఒదిగి ఉన్నట్లు, ఈ సంసార వృక్షము అనే ప్రపంచం కూడా సృష్టికి

పూర్వము ఊర్ధ్వమూలమైన బీజంలో అవ్యక్తంగా ఉన్నదే. అదే జగద్బీజము. ఊర్ధ్వంగా ఉండే కారణం ***( బీజ స్యాన్తరి వాంకురో జగదిదం ప్రాక్ నిర్వికల్పం ).***

బీజంలో అవ్యక్తంగా ఉన్నదే వృక్షరూపంలో వ్యక్త మైనట్లు, ప్రళయ కాలంలో జగద్బీజము నందు అవ్యక్తంగా ఉన్న విశ్వమే సృష్టి కార్యంగా వ్యక్త మవుతూ ఉంది. ఇలా అవ్యక్తము నుండి జగత్తు వ్యక్తం కావడమే సృష్టి. ఈ విధమైన సృష్టి ప్రళయాలు చక్ర వలయాలుగా సాగుతూనే ఉంటాయి. ఎన్ని ప్రళయాలు వచ్చాయో, ఎన్ని సృష్టులు ఆరంభ మయ్యాయో, ఇది ఎప్పటి నుండి సాగుతూ ఉందో ఎవరికి తెలుసు? అందుకే దీనిని అనాది అన్నారు.

అనాది అంటే ఆది లేనిది, ఆది లేని దానికి అంత ముండదు, అందుకే ఈ సంసార వృక్షము అవ్యయ మేమో! అని కూడా భావించే వారున్నారు. ఇక్కడ అనాది అంటే ఆది లేనిది అని కాదు. ఆది ఎక్కడో తెలియనిది అని అర్థము. ఎక్కడ ఆరంభమో, ఎక్కడ అంతమో అర్థం కాదు అని భావము. అనాదిగా అనంత దేహాది నామ రూపాలకు ఆశ్రయంగా ఉంది కనుక, విశ్వవృక్షము అవ్యయము ***( అనాద్య నన్త దేహాది సంతానాశ్రయః సుప్రసిద్ధం )*** అని ప్రసిద్ధి.

ఈ విశ్వవృక్షానికి ఆది ఎక్కడో అర్థం కాదు. అంత మెక్కడో అంతు పట్టదు. ఆద్యంతాలు అర్థం కానపుడు, దేనిని మధ్యమంగా గుర్తించాలి? ఎంత అర్థం చేసుకుంటున్నా అనంతం గానే మిగిలి ఉంది. అనంత రూపాలతో నిరంతరం మార్పు చెందుతూ ఉంది. అన్నీ కళ్ళ ముందే ఉన్నాయి. కార్యాలన్నీ కనేందుకే ఉన్నాయి. వినేందుకే ఉన్నాయి. కనిపిస్తూ, వినిపిస్తున్న కార్యాల యొక్క కారణాల లోకి తొంగి చూస్తే మనస్సు మొద్దుబారి పోతోంది. అంతా విచిత్రమే. అన్నీ రహస్యాలే. ఏదీ పూర్ణంగా అర్థం కాదు. ఎవరికీ ఎప్పుడూ అర్థం కాలేదు. ఎందుకని? ఏం చెప్పను? జరిగే వాటికి సంబంధించిన కార్యాలు, వాటికి సంబంధించిన జ్ఞానము, వీటిని తెలుసుకోవాలని ప్రయత్నించే వాడు, అందరూ ఈ చెట్టు లోనే కాపురం ఉంటున్నారు. అందరి గూళ్ళు ఇందు లోనే ఉన్నాయి. మనం ఎక్కడున్నా, ఎలా ఉన్నా, ఏది తెలుసుకున్నా, అంతా వ్యావహారికమే గాని ఏదీ పారమార్థికం కాదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ప్రపంచము మిథ్య. సత్యరూపుడైన పరమేశ్వరుని ఆశ్రయించుకొని మనుగడ సాగించే మిథ్యా జగత్తు. మాయా ప్రపంచము. స్వప్నతుల్యము. మాయలో దూరి మాయను ఎలా అర్థం చేసుకోవాలి? కల గనే వాడికి ఇది కల అని తెలిస్తే, ఇక కల ఎక్కడుంది? నిజమే. అది తెలియదు. తెలిసి రాదు. అందుకనే జగత్తు మిథ్యే అయినా అవ్యయం అని చెప్పబడింది. తెలిసిన వారికి మిథ్య. తెలియని వారికి అవ్యయము, అనంతము. జ్ఞానము లేని వారికి ఏది అశ్వత్థ వృక్షమో, భ్రాంతిమయమో, జ్ఞానము కల వారికి అది బ్రహ్మవృక్షము.

**బ్రహ్మ వృక్షము**

సంసార వృక్షానికి బ్రహ్మము అధిష్ఠానం కాబట్టి, బ్రహ్మము చేత అధిష్ఠితమైన అశ్వత్థమునకు బ్రహ్మ వృక్షము అనే పేరు కూడా ఉంది. ఏ జాతి చెట్లు ఆ వనంలో ఉంటాయి. మామిడి తోట అన్నప్పుడు ఆ తోటలో మామిడి చెట్లే ప్రధానంగా ఉంటాయి. కొబ్బరి తోట అంటే కొబ్బరి చెట్లు, మల్లెతోట అంటే మల్లె చెట్లు ఉంటాయని అర్థము. అలాగే ఈ సంసార వృక్షాన్ని బ్రహ్మవృక్షము అన్నప్పుడు అది ఉండే వనము బ్రహ్మవనము అవుతుంది. ఇది చాలా ఆసక్తిదాయక మైన విషయము. అది కూడా చెప్పుకుందాం.

వృక్షానికి సారభూత మైనది బీజమే అని అర్థం చేసుకున్నాం కదా! బ్రహ్మమే మాయ ద్వారా సంసరిస్తూ ఉంది కనుక సంసార వృక్షము ఏర్పడింది. అయినా, సంసారముతో బ్రహ్మమునకు సంసర్గము లేదు. బ్రహ్మము





సాక్షి స్వరూపము ***(బ్రహ్మ సాక్షివత్ ఆచరతి)***. కనుక సంసారము యొక్క గుణ దోషాలు బ్రహ్మమును అంటవు. బ్రహ్మము అసంగము.

ఇంతవరకు మనం అర్థం చేసుకున్న దానిని బట్టి అశ్వత్థము అని చెప్పబడిన సంసార వృక్షము అనర్థ దాయకము, వ్యామోహ నిలయము, శోకమయము. అంతవరకు బాగానే ఉంది. మరి, అలాంటి దానిని తెలుసుకున్న వాడు వేదవిదుడు అవుతున్నాడు అని చెప్పడమే మ్రింగుడు పడని విషయంగా కనిపిస్తుంది ***(యస్తం వేద స వేదవిత్)***. ఫరవాలేదు. అదీ తెలుసుకుందాం.

**బ్రహ్మవనము**

బీజంలో ఏ రసం ఉంటుందో, వృక్షంలో అదే రసం ఉంటుంది. వేపచెట్టు చేదు గానే ఉంటుంది. తిక్త రసంతో నిండి ఉంటుంది. నింబ బీజము తిక్త రస పూర్ణంగా ఉంది కనుక, నింబ వృక్షము కూడా తిక్తరసం తోనే నిండి ఉంటుంది. నింబఫలము లోని రసం బింబఫలంలో ఉండదు. బింబఫలం లోని రసం నింబఫలంలో ఉండదు.

మరి, అశ్వత్థ మనే సంసార వృక్షమునకు బ్రహ్మము బీజరూపంగా ఊర్ధ్వ మూలమై ఉండే టప్పుడు, జ్ఞానైక రస రూపుడైన బ్రహ్మము నుండి ఉత్పన్నమైన విశ్వ వృక్షము కూడా జ్ఞానానంద స్వరూపం గానే ఉండాలి కదూ? అవును. అందుచేతనే **సర్వం ఖల్విదం బ్రహ్మ** - ఈ జగత్తు అంతయూ బ్రహ్మమే. **బ్రహ్మై వేదం విశ్వ మితి** - ఈ విశ్వము సమస్తము బ్రహ్మమే. **వాసుదేవ స్సర్వమితి** - ఈ సమస్త ప్రపంచము వాసుదేవ స్వరూపమే అని జ్ఞానులు తెలుసు కుంటున్నారు. కనుకనే, ఊర్ధ్వమూలము, అధశ్శాఖలు, వేదపర్ణాలు కలిగి అవ్యయంగా శోభిస్తున్న అశ్వత్థమును ఎవడు తెలుసుకుంటాడో, వాడే వేదవేత్త ***(వేదార్థవిత్ ఇత్యర్థః)*** అంటున్నాడు. అశ్వత్థ మును అర్థం చేసుకున్న వాడు అశ్వత్థ నారాయణుని అర్థం చేసుకున్న వాడే అవుతున్నాడు. ఎందుకో తెలుసా? అశ్వత్థ మనే విశ్వవృక్షంలో ఉన్నదంతా అశ్వత్థ నారాయణుడే. అందుకే విశ్వము బ్రహ్మవృక్ష మైతే, బ్రహ్మవృక్ష మైన అశ్వత్థమునకు ఆధారమైన, ఆశ్రయమైన బ్రహ్మము బ్రహ్మవనంగా ప్రసిద్ధ మైంది. సర్వ వేదములు బ్రహ్మమునే ప్రతిపాదిస్తున్నాయి కనుక వేదవిదుడు బ్రహ్మవిదుడే అగుచున్నాడు ***( సర్వే వేదా యత్పద మామ నన్తి)*** అన్నది వేదము.

'వనం' అంటే వననీయము, భజనీయము అని అర్థము. భగవంతుడు ఉపాసించ దగిన వాడు. భజనీయ మైన వాడు కనుక, బ్రహ్మము ***(తత్)*** వననీయుడు ***(వనం)*** అన్నది కేనోపనిషత్తు. పరమాత్మ 'తద్వనం' అనే నామంతో ప్రసిద్ధుడు. కనుక బ్రహ్మము 'తద్వనం' అని తెలిసి ఉపాసించాలి అన్నది కేనోపనిషత్తు ***( తత్ హ 'తద్వనం' నామ, తద్వనం ఇతి ఉపాసితవ్యం )***. ప్రతి ప్రాణి లోను అంతరాత్మ రూపంగా ప్రతిష్ఠింపబడి ఉన్న కారణంగా బ్రహ్మము వననీయము లేదా భజనీయము అని ఈ మంత్రంపై శ్రీ శంకరాచార్యస్వామి వ్యాఖ్యానించారు.

ప్రాణులన్నీ ప్రపంచం లోనే ఉన్నాయి. ప్రాణు లన్నిటిలో ఉన్న ప్రత్యగాత్మ పరమాత్మే అయినప్పుడు, ప్రపంచములో ఉన్నదంతా పరమాత్మే కదా! సంసార వృక్షంలో నిండి నిబిడీకృత మైనది బీజరూపుడు, సారభూతుడు అయిన పరమాత్మే కదా! కనుకనే ఈ సంసార వృక్షమును తెలుసుకున్న వాడు వేదవిదు డవుతున్నాడు. బ్రహ్మవిదుడు అవుతున్నాడు. ఒక వైపు సంసార వృక్షము అనిత్యము కనుక అశ్వత్థము అని అంటూ, మరొక వైపు అవ్యయము మరియు బ్రహ్మవృక్షము కనుక భజనీయము అని చెప్పడం పరస్పర విరుద్ధం కాదా? అనే సంశయం స్ఫురించే ప్రమాదం లేక పోలేదు.

**సత్యమిథ్యలు**

బ్రహ్మ మొక్కటే సత్యం. ప్రపంచమునకు బ్రహ్మమే అభిన్న నిమిత్త ఉపాదాన కారణము. కార్యమైన ప్రపంచము కారణమైన బ్రహ్మము కన్నా భిన్నం కాదు. కార్యమైన కుండ కారణమైన మట్టే అయినట్లు, కార్య మైన ప్రపంచము కారణమైన పరమాత్మే. కానీ, కుండ మట్టే అయినా, మట్టి కుండ కానట్లు, మిథ్య యైన ప్రపంచము సత్యమైన పరమాత్మే అయినా, సద్రూపమైన పరమాత్మ మిథ్యా ప్రపంచము కాదు. మిథ్య కూడా బ్రహ్మమే. కాని, బ్రహ్మము మిథ్య కాదు. కనుక ప్రపంచమును ప్రపంచముగా గ్రహించే వాడు వేదవేత్త కాలేడు. ఎందుకంటే, ప్రపంచము ప్రపంచముగా మిథ్య. ప్రపంచం పరమాత్మగా సత్యం. కనుక, ప్రపంచ మును ప్రపంచముగా కాకుండా పరమాత్మగా గ్రహించే వాడే వేదవేత్త. అతడే బ్రహ్మవేత్త. సర్వం బ్రహ్మమయంగా దర్శించి అద్వైతానుభూతిలో ఓల లాడేవాడు.

సత్యమును దర్శించే వారికి ఈ అశ్వత్థ మనే సంసార వృక్షము బ్రహ్మవృక్షమే. కనుక అవ్యయము; భజనీయము.

అలా కాకుండా మిథ్యా దృష్టితో ప్రపంచమును ప్రపంచముగా చూచే వారికి ఈ విశ్వవృక్షము అశ్వత్థమే. ఛేదించ దగినదే. భేదించ దగినదే ***(ఛిత్వా చ భిత్వా చ)***. కనుక మాయా మోహితులైన వారికి ఈ ప్రపంచము అశ్వత్థ వనము; భ్రాంతిమయము. మహిమ తెలిసిన వారికి ఈ జగత్తు బ్రహ్మవనము; బ్రహ్మమయము. ఈ విషయాన్ని బ్రహ్మసూత్రాలు విస్పష్టం చేశాయి.

***పరాభి ధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధ విపర్యయౌ,*** *( బ్ర.సూ. 3 - 2 - 5 )*

అవిద్య చేత కప్పబడిన జీవ స్వరూపం ***( తిరోహితమ్ )*** పరమాత్మను ధ్యానించడం చేత ***( పరాభి ధ్యానాత్ )*** వ్యక్త మవుతుంది. కనుక జీవునికి ***( అస్య )*** బంధమోక్షాలు ***( బంధ విపర్యయౌ )*** పరమాత్మ వలననే కలుగు తున్నాయి కదా ***( తతో హి )*** అనేది సూత్రార్థం. అంటే, పరమాత్మ స్వరూపం తెలియక పోతే బంధము; తెలిస్తే మోక్షము. అంతే.

*ఈ సంసార వృక్షానికే మరొక విధంగా, అంటే అన్యంగా లేదా విశేషంగా అవయవ కల్పన చేసి చెబుతున్నాడు.*

**అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణ ప్రవృద్ధా విషయప్రవాలాః ।**
**అధశ్చ మూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥** 2

***అధః-చ-ఊర్ధ్వం-ప్రసృతాః-తస్య-శాఖాః-గుణప్రవృద్ధాః-విషయప్రవాలాః***
***అధః-చ-మూలాని-అనుసంతతాని-కర్మానుబంధీని-మనుష్యలోకే***

| | | | |
|---|---|---|---|
| తస్య | = దాని యొక్క | ప్రసృతాః | = వ్యాపించి ఉన్నాయి |
| శాఖాః | = కొమ్మలు | మూలాని | = మొదళ్ళు |
| గుణప్రవృద్ధాః | = గుణములచే వృద్ధి పొందాయి | కర్మానుబంధీని | = కర్మ సంబంధము కలవి |
| విషయ ప్రవాలాః | = విషయములే చిగుళ్ళు | మనుష్యలోకే | = మానవ లోకములో |
| అధః చ | = క్రిందికి | అధః చ | = క్రిందికి |
| ఊర్ధ్వం | = మీదికి | అనుసంతతాని | = విస్తరించి ఉన్నాయి |





**అర్జునా! సంసార వృక్షము యొక్క కొమ్మలు క్రిందికి, పైకి వ్యాపించి ఉన్నాయి. అవి గుణముల చేత వృద్ధి చెందాయి. విషయాలే వాటికి చిగుళ్ళు . మానవ లోకంలో కర్మ సంబంధాన్ని కలిగించే మొదళ్ళు క్రిందికి అల్లుకొని పోయాయి.**

**వ్యాఖ్య**

ఊర్ధ్వమూలత్వాది రూపంలో ప్రథమ శ్లోకంలో వర్ణింప బడిన సంసార వృక్షానికి అన్యమైన అవయవ కల్పనతో అదే వృక్షాన్ని వర్ణిస్తున్నాడు. పూర్వ శ్లోకం కన్నా ఇది భిన్న మైనది.

**శాఖా విస్తరణము**

ఈ సంసార వృక్షము యొక్క శాఖలు ***( తస్య శాఖాః )*** క్రిందికి పైకి ***( అధః చ ఊర్ధ్వమ్ )*** విస్తారంగా వ్యాపించి ఉన్నాయి ***( ప్రసృతాః )***.

పూర్వ శ్లోకంలో ఊర్ధ్వం అంటే ఉత్కృష్టమైన పరబ్రహ్మము అని అర్థం చేసుకున్నాం కనుక, దానిని నిత్యంగా ***( నిత్యత్వాత్ )***, సర్వకారణంగా ***( కారణత్వాత్ )*** శ్రేష్ఠ మైనదిగా ***( మహత్త్వాత్ )*** అర్థం చేసుకున్నాం.

అలాగే 'అధః' అంటే క్రిందికి కొమ్మలు కలిగిన సంసార వృక్షంగా, అనిత్య మైనదిగా ***( అశ్వత్థః )***, క్షణాల్లో నశించేదిగా ***( క్షణ ప్రధ్వంసినమ్ )*** చెప్పుకున్నాం. కనుక అవ్యక్త మాయా శక్తిమత్వముతో శోభించే బ్రహ్మమును కారణముగా అర్థం చేసుకుంటే, చతుర్ముఖ బ్రహ్మ మొదలుకొని సమస్త సృష్టి కార్యము సంసార వృక్షము లోనే ఉందని అర్థము.

ప్రస్తుత శ్లోకంలో అదే సంసార వృక్షానికి సంబంధించిన భిన్నమైన అవయవ కల్పన చెప్పబడుతూ ఉంది. ఈ విధమైన అవయవ కల్పనలో మానవులు మొదలుకొని స్థావరాంతం వరకు, అంటే వృక్ష లతాదుల వరకు 'అధ' శబ్దార్థము. అలాగే మానవులు మొదలుకొని జగత్కర్త యైన బ్రహ్మదేవుని సత్యలోకం వరకు 'ఊర్ధ్వ' శబ్దార్థము. ఇలా విస్తరించిన ప్రాణులు ఆచరించిన కర్మోపాసనల యొక్క ఫలములే ఈ సంసార వృక్షానికి శాఖలై, అటు ఊర్ధ్వం గాను, ఇటు అధోమార్గం లోను అంతట అపారంగా విస్తరించి ఉన్నాయి. ఈ విధమైన ఉపాసనా కర్మల ఫలాలే 'శాఖా' శబ్దార్థము.

***అవశ్యం అనుభోక్తవ్యం ఫలం కర్మ శుభాశుభమ్ -*** ప్రాణులు ఆచరించే శుభాశుభ కర్మల యొక్క ఫలాలను వారు తప్పించుకో లేరు. కర్మను ఆచరించిన వారందరూ ఫలమును అనుభవించ వలసిన వారే. ఆచరింప బడిన కర్మ అనుభవించిన తరువాతే నశిస్తుంది ***( నా భుక్తం క్షీయతే కర్మ )***.

ఉపాధులు కూడా కర్మఫలాలే. ఎవరికి ఏ విధమైన దేహం ప్రాప్తించినా, అది మానవ దేహమైనా, దేవతా శరీర మైనా, పశుపక్ష్యాదుల ఉపాధులైనా, ఆయా ఉపాధులు సంక్రమించ డానికి అనుగుణమైన కర్మలు వారు ఆచరించే ఉంటారు. ఎవరు ఏయే కర్మలు చేశారు? ఏ విధమైన కర్మలను ఆచరించడం వలన ఆ ఉపాధులు సంక్రమించాయి? అనేది వారికి తెలియక పోవచ్చు. తెలియనంత మాత్రాన చేసిన కర్మలు ఆవిరై పోవు. అలా జరిగే టట్లైతే కర్మఫలాలు ఎలా ప్రాప్తించాయి? కర్మఫలంగా దేహా లెలా సంక్రమించాయి? కనుక, ఉపాధుల రూపాలలో కర్మఫలాలే కనిపిస్తున్నాయి.

***శుభై రాప్నోతి దేవత్వం నిషిద్ధైః నారకీం తనుమ్ ।***
***ఉభాభ్యాం పుణ్య పాపాభ్యాం మనుష్యత్వం లభతే నరః ॥***

పుణ్యఫలంగా జీవులు దేవతా శరీరాలను ధరిస్తారు. పాపఫలంగా నరకంలో వసించే దేహాలను పొందుతారు. పుణ్యపాపాల రెండిటి మిశ్రమ ఫలంగా మానవ శరీరాన్ని ధరిస్తారు.

కేవలం పుణ్యఫల విశేషంగా దేవతా శరీరాలు ప్రాప్తిస్తే, కేవలం పాపఫల విశేషంగా నీచ జన్మలు సంక్రమిస్తే, పుణ్యపాప కర్మల మిశ్రమ ఫలంగా మానవ శరీరాలు సంప్రాప్తిస్తాయి.

**మానవ జన్మ దుర్లభము**

జన్మ అంటేనే శరీరమును ధరించుట అని అర్థము. ధరించే శరీరము ఏదైనను, దేహ సంబంధము కలిగి ఉన్నప్పుడే అది జన్మ అవుతుంది ***( శరీర సంబంధస్య ఏవ జన్మ శబ్దార్థత్వాత్ ).*** దేహములను ధరించుట కర్మఫల మైనపుడు, సురనర పశ్వాది దేహాలన్నీ కర్మఫలాలే అని అర్థమై పోయింది. అయినా, ఈ విధంగా శరీరాలను పొంది జన్మించే జీవులలో మానవ జన్మయే ఉత్కృష్ట మని చెప్పబడింది ***( జనన శీలానాం ప్రాణినాం నరజన్మ మానుష్యకం దుర్లభం ఇతి ! ).***

కేవలం పాపకర్మ ఫలితంగా ప్రాప్తించే నీచజన్మల కన్నా, పుణ్యపాప కర్మల మిశ్రమ ఫలంగా ప్రాప్తించే మానవ జన్మ ఉత్తమ మైంది అంటే అర్థం చేసుకోగలం. కాని, కేవలం పుణ్యకర్మ ఫలంగా ప్రాప్తించే దేవతా శరీరాలు ఉన్నాయి. అవి కూడా కర్మఫలంగా ప్రాప్తించిన ఉపాధులే కదా! మరి, దేవతా శరీరాల కన్నా కూడా మానవ దేహాలను పొందడం దుర్లభము అనే దానిని ఎలా అర్థం చేసుకోవాలి? అనే శంక ఎవరి కైనా కలుగుతుంది. ఎందుకంటే, మానవుల కన్నా దేవతలు శ్రేష్ఠులు అనేది సామాన్యంగా సర్వులకు తెలిసిన విషయం. అలాంటప్పుడు నరజన్మ ఒక్కటే ఎలా దుర్లభము? అదీ తెలుసుకుందాం ***( కిల నరజన్మ దుర్లభ మితి వక్తుం శక్యం ).***

నరజన్మ దుర్లభం అన్నప్పుడు, అక్కడ జన్మ వైశిష్ట్యము, ఏ కర్మఫలంగా ఉపాధి సంభవించింది అని గతానికి సంబంధించిన కర్మ విశేషాన్ని బట్టి నిర్ణయించింది కాదు. ఏ ఉత్కృష్టమైన స్థితిని భవిష్యత్తులో సాధించే అవకాశ ముంది అని భావి ప్రగతికి ప్రాధాన్యత నిచ్చి నిర్ణయించింది. అందుచేతనే ఉపాధులలో మానవ శరీరము, లేదా నరజన్మ దుర్లభం అని చెప్పడం జరిగింది. అలా కాకపోయి నట్లైతే, కేవలం పుణ్యఫల విశేషంగా ప్రాప్తించిన దేవతా శరీరమే ఉత్కృష్ట మని, దేవ జన్మయే దుర్లభ మని చెప్పవలసి ఉండేది.

ఉపాధులు కలిగిన జీవులు ఎవరెవరు ఏదేది పొంది ఉన్నారు అనేది అప్రధానమైన విషయం. పొందదగిన వాటిలో ఉత్కృష్ట మైనది మోక్షమే కనుక, మోక్షప్రాప్తికి ఏది అనుకూలమైన ఉపాధి అని విచారించినపుడు, ఆ అవకాశము మానవ ఉపాధిని పొందిన నరజన్మకే ఉంది కనుక, దేహధారులై జన్మ నెత్తిన వారిలో నరజన్మ నెత్తిన మానవులే దుర్లభమైన జన్మను పొందిన వారుగా చెప్పబడ్డారు.

మోక్షప్రాప్తి మానవులకే సాధ్యం. కేవలం పాపకర్మల ఫలంగా ప్రాప్తించిన నీచజన్మ లెత్తిన జీవులకు మోక్ష కాంక్ష ఉండే అవకాశమే లేదు. కేవలం పుణ్యకర్మల ఫలంగా ప్రాప్తించిన దేవతా శరీరాలను ధరించిన స్వర్గలోక వాసులకు మోక్షవాంఛ ఉండినా, అది తీరే అవకాశము లేదు.

పుణ్యఫలంగా దేవతా శరీరాలు ప్రాప్తించాయి కనుక అవి పుణ్యక్షయ మయ్యే వరకు స్వర్గాది భోగాలను అనుభవించే కార్యాలలో నిమగ్నమై ఉంటాయే గాని, సుఖ భోగాలను త్యజించి, వైరాగ్యంతో తత్త్వ విచారం చేసే స్థితిలో ఉండవు. పుణ్య ఫలంగా సంక్రమించిన స్వర్గాది లోకాల లోని భోగాలను అనుభవించిన తరువాత, పుణ్యం నశిస్తుంది కనుక అవి తిరిగి మానవ లోకంలో జన్మించడం జరుగుతుంది. కనుక, దేవతా శరీరాలు పుణ్యఫల విశేషాలు కనుక శ్రేష్ఠ మైనవే అయినా, దేవతలలో మోక్షేచ్ఛ జనించే అవకాశం లేదు. పుణ్యపాప





కర్మల ఫలితంగా ప్రాప్తించిన మానవజన్మను పొందిన వారికే మోక్ష కాంక్ష కలిగే అవకాశ ముంది. ఈ కారణంగా నరజన్మ దుర్లభ మని చెప్ప బడింది.

**నరజన్మ అందమైన కూడలి**

స్వర్గంలో కేవలం సుఖమే ఉంటుంది. సుఖానుభూతి మాత్రమే కలుగుతుంది. నరకంలో కేవలం దుఃఖమే ఉంటుంది. దుఃఖానుభూతి మాత్రమే కలుగుతుంది. స్వర్గవాసులు సుఖాలలో పడి దొర్లుతూ ఉంటారు కనుక వారికి మోక్ష భావనే ఉండదు. నరకవాసులు దుఃఖమగ్నులై ఉంటారు కనుక, దుఃఖ నివృత్తికి పరితపిస్తూ ఉంటారే గాని ఆత్మానాత్మ విచారం చేసే స్థితిలో ఉండరు.

మానవ లోకంలో ***( మనుష్య లోకే )*** మనుష్యులు మిశ్రమ కర్మఫలంగా సుఖదుఃఖాలు రెండిటిని అనుభవిస్తూ ఉంటారు. సుఖాలు అప్పుడప్పుడూ కలిగినా, అవి అల్పసుఖాలుగా, స్వల్ప సుఖాలుగా, దుఃఖాలయానికి తలుపులు తెరిచే సుఖాలుగా ఉంటాయి ***( సుఖ మల్పం బహు క్లేశః ).*** ఈ విధమైన అనిత్య సుఖాలలో పడి అల్లాడుతూ అసంతృప్తితో ఆవేదన చెందే మనిషి ఏది సుఖము, ఏది అసుఖము, ఏది నిత్యసుఖము? అనే విచారంలో పడే అవకాశము ఉంది. విచారము మొదలైంది అంటే, ఆ తరువాత ఆ ప్రయాణము శ్రేయో మార్గంలో ఉంటుందే గాని ప్రేయో మార్గంలో ఉండదు. స్వర్గ సుఖాలను అనుభవించే దేవతలకు సుఖ భోగాలకు సంబంధించిన స్పృహ ఉంటుందే గాని, వైరాగ్య భావన కలగదు. అంతా విలాసమయమే గాని విరాగము మొలకెత్తే అవకాశమే లేదు.

మానవ లోకంలో సుఖాలు అనిత్యాలుగా తెలుస్తూ ఉంటాయి. దుఃఖాలు సుఖ శూన్యాలుగా అర్థ మవుతూ ఉంటాయి. అటు సుఖాలలో రమించ లేక, ఇటు దుఃఖాలలో గమించ లేక, రెండిటి నుండి విరమించి, విరక్తితో విచారమును కొనసాగించే అవకాశము మానవునికే ఉంది. అందుకే మానవ జన్మ దుర్లభము.

మానవ లోకంలో కర్మాధికారమే కదా ప్రసిద్ధము ***( మనుష్య లోకే విశేషతః అత్ర హి మనుష్యాణాం కర్మాధికారః ప్రసిద్ధః ).*** కర్మాధికారం గల మానవుడు సత్కర్మానుష్ఠానము, ఈశ్వర భక్తి కొనసాగించి చిత్తశుద్ధిని, చిత్త నైశ్చల్యాన్ని పొంది, మోక్ష మార్గంలో విచారం చేసి, జ్ఞానప్రాప్తి ద్వారా జీవన్ముక్తుడై తరించి పోవచ్చు.

లేదా, ప్రాపంచిక విషయ వాసనా సుడిలో పడి, అనిత్య సుఖానుభవానికి అకృత్యాలను ఆచరించి, బ్రతుకును అన్యాయం చేసుకొని, అతి హేయమైన నీచ జన్మలలో పడి పోవచ్చు.

అలా కాకుండా, అనేక పుణ్య కార్యాలను ఆచరించి - లౌకిక మైన ఇష్టాపూర్తములు గాని, లేదా యజ్ఞ యాగాది విశిష్ట కర్మలను గాని విశేషంగా ఆచరించి, పుణ్యమును ఆర్జించి, పుణ్యఫల విశేషంగా సురాది లోకాలను పొంది సుఖించ వచ్చు. దేని కైనా - ముముక్షువుగా మారి మోక్ష సామ్రాజ్యాన్ని అధిష్ఠించాలి అనుకున్నా, పుణ్యకర్మల నాచరించి స్వర్గాది లోకాలను చేరా లనుకున్నా, నీచ మార్గంలో చరించి నికృష్ట యోనులలో పడి దురదృష్టకర మైన బ్రతుకును అనుభవించా లనుకున్నా - అన్ని మార్గాలకు అందమైన కూడలిగా మానవజన్మ ఉంది. అందుకే నరజన్మ దుర్లభ మైంది.

**విస్తరించిన సంసార వృక్షము**

మానవ జన్మ సర్వులకు కూడలి అనే భావనను ఔదల దాల్చి, ప్రస్తుత శ్లోకంలో సంసార వృక్ష అవయవ కల్పనను ఊర్ధ్వ అధో శబ్దార్థాలతో వర్ణించడం జరిగింది. ఊర్ధ్వమును, అధో భాగమును రెండిటిని మానవ స్థాయి నుండే గ్రహించి నిర్ణయించడం స్పష్టంగా కనిపిస్తోంది.

మానవులు మొదలుకొని స్థావరాదులైన వృక్ష లతాదుల వరకు క్రిందికి ***( అధః ).*** అలాగే మానవులు

మొదలుకొని హిరణ్యగర్భుడు వసించే బ్రహ్మలోకము వరకు పైకి (**ఊర్ధ్వం**) , ఈ సంసార వృక్షము యొక్క శాఖలు అపారంగా విస్తరించి ఉన్నాయి అని చెప్పడం జరిగింది. అంటే, కర్మఫలాలు వృక్ష శాఖ ల్లాగా సర్వత్ర వ్యాపించి ఉన్నాయి అని అర్థం (***యథా కర్మ యథా శ్రుతం జ్ఞాన కర్మ ఫలాని తస్య వృక్షస్య శాఖాః ప్రసృతాః ప్రగతాః***).

దేవతా జన్మలు, అంటే సుర లోకము నుండి బ్రహ్మ లోకము వరకు ఊర్ధ్వ లోకాలలో వసిస్తున్న దేవత లందరూ వారి వారి పుణ్యఫల విశేషంగా ఆయా లోకాలలో పైకి ప్రాకిన చెట్టుకొమ్మల లాగా వ్యాపించి ఉన్నారు అని అర్థం.

అలాగే జంతువులు, పశుపక్ష్యాదులు, స్థావర జంగమాలతో సహ సమస్త జీవులు క్రిందికి వ్యాపించిన కొమ్మలు, ఊడలు లాంటి వారని అర్థము. మధ్యలో మానవలోక ముంది. ఇలా పైన, క్రింద, మధ్యన వ్యాపించి ఉన్న జీవు లందరూ, కర్మానుసారంగా, శాస్త్రోక్త విధి ననుసరించి, ఫలానుభవానికి ఆయా ప్రదేశాలలో విస్తరించి ఉన్న శాఖలుగా తెలుస్తున్నారు.

పిండి కొద్ది రొట్టె - తిండి కొద్ది దేహం అనే సామెత ఉండనే ఉంది కదా! వృక్షములో కొమ్మలు పెరుగుతూ ఉండటం మనం చూస్తాం. సాధారణ వృక్ష జాతిలో కొమ్మలు ఎరువుతో, జలాలతో వృద్ధి చెందు తాయి. మరి, కర్మఫలాల రూపంలో ఇంతవరకు మనం చూచిన సంసార వృక్ష శాఖలు ఎలా వృద్ధి చెందుతాయి? కొమ్మలు వృద్ధి చెందడము, విస్తరించడము అనేది చిగుళ్ళ మీద ఆధారపడి ఉంటుంది. మరి, ఈ సంసార వృక్షానికి చిగుళ్ళు ఏమిటి? అవి వేటి చేత వృద్ధి చెందుతాయి? సంసార వృక్షం గుణాల చేత వృద్ధి చెందుతుంది (***గుణ ప్రవృద్ధాః***). శబ్దాది ఇంద్రియ విషయాలే వాటికి చిగుళ్ళు (***విషయ ప్రవాలాః***).

## పెరిగే కొమ్మలు - పూచే చిగుళ్ళు

గుణాలు ప్రకృతి సంభవాలు. ప్రకృతి సత్త్వ రజ స్తమో గుణాత్మకము. త్రిగుణాలే క్షేత్ర స్థాయిలో వ్యాపించి ఉన్నాయి. కనుక ఊర్ధ్వంగా దేవ శరీరాలలో ప్రసరించి యున్న కర్మఫలా లనే శాఖల యందు గాని, ***అధః ప్రసృతాః*** - క్రిందికి, పశ్వాది శరీరాలు మొదలుకొని స్థావరముల వరకు విస్తరించి యున్న కర్మఫలా లనే శాఖల యందు గాని గుణాలే వ్యాపించి ఉన్నాయి. కుండకు ఉపాదానమైన మట్టి, కుండ నంతా వ్యాపించి ఉన్నట్లు, కర్మఫలా లనే శాఖలకు ఉపాదాన కారణ మైన సత్త్వ రజ స్తమో గుణాల చేత శాఖలు వృద్ధి చెందుతాయి. అందుకే అవి గుణ ప్రవృద్ధాలు (***గుణ ప్రవృద్ధాః - గుణైః సత్త్వ రజ స్తమోభిః ప్రవృద్ధాః స్థూలీకృతాః ఉపాదాన భూతైః***). ఏ విధంగా అయితే చెట్టుకొమ్మలు జలాల చేత వృద్ధి చెందుతూ ఉంటాయో, అలాగే గుణాల వల్ల కర్మలు వృద్ధి చెందుతూ ఉంటే, వృద్ధి చెందే కర్మల ఫలితంగా జన్మలు విస్తరిస్తూ ఉంటాయి. అంటే, గుణ వికారాలైన కామక్రోధ లోభాదుల చేత, వాటి కార్యాలైన పుణ్యపాపాల వలన సంసార వృక్ష శాఖలు విస్తరిస్తూ పోతాయి. అదే గుణ ప్రవృద్ధము. శాఖా విస్తారమునకు సహకరించేవి చిగుళ్ళు (***ప్రవాలాః***).

గుణాల చేత వృద్ధి చెందే శాఖలకు విషయాలే చిగుళ్ళు (***విషయ ప్రవాలాః - విషయాః శబ్దాదయః ప్రవాలాః***). గుణాల చేత వృద్ధి చెందే కర్మఫలా లనే శాఖలకు శబ్దాది విషయాలే చిగుళ్ళు. ఇక్కడ ఉపాధులే కర్మల వలన కలిగిన ఫలాలు. అంటే, శరీరాది ఫలాలే ఇక్కడ శాఖలుగా చెప్పబడ్డాయి.

తరువులు పెరుగుతూ ఉంటాయి. శాఖలు విస్తరిస్తూ ఉంటాయి. విస్తరించే శాఖలు లేదా కొమ్మలు క్రొత్త చిగుళ్ళు తొడుగుతూ ఉంటాయి. చిగుళ్ళు కొమ్మలలో చేవను పెంచుతాయి. లివను దించుతాయి. చిగుళ్ళు వేసినంత కాలము కొమ్మలు ఎండిపోవు. పచ్చగా కనిపిస్తూ ఉంటాయి.





అలాగే కర్మఫలాలైన తనువు లనే కొమ్మలు విషయా లనే చిగుళ్ళతో ప్రకాశిస్తూ ఉంటాయి. ప్రవర్తిస్తూ ఉంటాయి. ఉప శాఖలను పెడుతూ విస్తరిస్తూ ఉంటాయి. రెమ్మలతో కొమ్మలు వ్యాపించ డానికి చిగుళ్ళే ప్రధాన కారణము.

కర్మల వలన ఏర్పడిన దేహాది ఫలా లనే కొమ్మలు, విషయా లనే చిగుళ్ళ వల్ల నూతన దేహాదులను పొందుతూ జన్మలలో వ్యాపిస్తూ ఉంటాయి. సంసార వృక్షానికి ప్రాణం పోస్తూ జన్మజన్మలకు నడిపిస్తూ ఉంటాయి. ఇదే జననమరణ సంసృతి, లేదా సంసారము.

తరువులు బ్రతకాలి అంటే జలమే ప్రధానము. అలాగే తనువులు కొనసాగాలి అంటే కర్మే ప్రధానము. సంసార వృక్షానికి కర్మే ప్రధానము. మనిషి దేహము ద్వారా కర్మలు ఆచరిస్తాడు. ఈ కర్మ ప్రభావము చేత పాప పుణ్యాలు సంభవిస్తాయి. ఈ పుణ్య పాప కర్మానుభవానికి నూతన దేహాలను ధరించడం జరుగుతుంది. అవే నూతన జన్మలు. ఆ జన్మలలో కర్మఫలాలను అనుభవించడమే గాక, నూతనంగా మరి కొన్ని కర్మలు చేయడం జరుగుతూ ఉంటుంది.

ఈ విధంగా కర్మ - కర్మఫలము - జన్మ; మళ్ళీ కర్మ - కర్మఫలము - జన్మ; ఈ విధంగా జననమరణ చక్రము తిరుగుతూ ఉంటుంది. ఇదే సంసార చక్రము. నిరంతరం అశాంతి గాలుల్ని వీచే సంసార వృక్షము.

చిగుళ్ళు వేస్తూ ఉంటే కొమ్మలు విస్తరిస్తూ ఉంటాయి. విషయా లనే చిగుళ్ళ వల్ల కర్మలు, కర్మఫలాలు, జన్మలు, జన్మదుఃఖాలు విస్తరిస్తూ పోతాయి. ఈ జన్మలో ప్రాప్తమైన కర్మఫలాలు తరువాత జన్మకు బీజ మౌతాయి. తరువాత జన్మలో విషయ సంబంధంతో ఆచరించబడే కర్మలు మరో జన్మకు కారణ మౌతూ ఉంటాయి. ఈ విధంగా సంసార వృక్షము విస్తరిస్తూ పోతుంది.

## అవాంతర మూలాలు - కర్మబంధాలు

సంసార వృక్షానికి (***అశ్వత్థం***) కారణ మైనది, మూల మైనది ఊర్ధ్వంగా ఉన్నదని; అదే మాయా యుక్త మైన బ్రహ్మమని; అదే సంసారానికి ఉపాదాన కారణ మని మొదటి శ్లోకం లోనే గ్రహించాము. ఇక ప్రస్తుతం అధ్యయనం చేస్తున్న ఈ రెండవ శ్లోకంలో కర్మఫలానుభవము వలన ఏర్పడిన రాగద్వేషాదులే ధర్మాధర్మ ప్రవృత్తికి కారణా లని తెలుసుకుంటున్నాము. ఇవే అధోమూలాలు. బ్రహ్మము ఊర్ధ్వమూలం కాగా ధర్మాధర్మ ప్రవృత్తి హేతువు లైన రాగద్వేషాలు అధోమూలాలు. వీటిని కర్మానుబంధులు అంటారు. ఇవి బంధహేతువులు. జీవులను బంధిస్తాయి. ఇవే మానవ లోకంలో కర్మానుబంధులుగా ఉంటూ విస్తరిస్తూ పోతాయి (***కర్మానుబంధీని మూలాని అధః మనుష్య లోకే అనుసంత తాని***).

రాగద్వేష, అభిమాన, అహంకార వాసనలే ఈ అధోమూలాలు. క్రింది వైపుకు (***అధః***) విస్తరించిన మూలాలు. ఊడలు. కర్మానుబంధులు. పుణ్యాపాప కర్మలను ప్రేరేపించేవి కనుక ఇవి కర్మమూలాలు. కర్మానుబంధులు, లేక కర్మమూలాలు. అంటే, కర్మలను అనుబంధంగా కలిగిన మూలాలు అని అర్థం. ముందుగా వాసనలు మూలాలుగా ఉంటాయి. ఆ తరువాత కర్మలు వచ్చి వాటిని చేరుతాయి. అందుచేత అవి కర్మానుబంధులు.

ముక్తి నిచ్చే మూలం పైన ఉంది (***ఊర్ధ్వ మూలమ్***). బంధించే మూలాలు క్రింద వ్యాపించి ఉన్నాయి (***అధశ్చ మూలాని***). మానవ లోకంలో కర్మానుబంధులుగా ఉన్నాయి (***అధశ్చ మూలాని కర్మానుబంధీని మనుష్య లోకే అను సంతతాని***). ఇవి అంతటా అల్లుకొని ఉన్నాయి (***అను సంతతాని అనుప్రవిష్టాని***). అన్ని వైపుల ప్రగతికి ప్రతిబంధకాలుగా ఉన్నాయి. వీటిని ఛేదిస్తే ఊర్ధ్వంగా పయనించి మోక్షరూపుడైన బ్రహ్మమును చేరవచ్చు.

అలా కాకుండా విషయా లనే చిగుళ్ళను వృద్ధి చేసుకుంటూ పోతే బ్రతుకు కర్మ సుడిగుండంలో చిక్కుకు పోతుంది. అల్లుకొని పోతున్న కర్మానుబంధు లైన మూలాలలో చిక్కి అన్యాయమై పోవడమా? లేక వాటిని ఛేదించి శ్రేయోమార్గంలో పయనించి మోక్ష సౌధాన్ని చేరి పోవడమా? అనేది ఎవరికి వారు నిర్ణయించు కోవాలి.

*సంసారము దుఃఖాత్మకము, అనర్థ దాయకము కనుక దాని నుండి విముక్తిని పొందాలి. మరి విముక్తిని పొందేది ఎలా? (**కథం విముక్తిః ?**). తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

న రూప మస్యేహ త థోపలభ్యతే నాన్తో న చాది ర్న చ సమ్ప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢ మూలం అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా ॥ 3

***న-రూపం-అస్య-ఇహ-తథా-ఉపలభ్యతే-న-అంతః-న-చ-ఆదిః-న-చ-సంప్రతిష్ఠా***
***అశ్వత్థం-ఏనం-సువిరూఢ మూలం-అసంగశస్త్రేణ-దృఢేన-ఛిత్వా***

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ లోకము నందు | సంప్రతిష్ఠా న చ | = స్థితి కూడా తెలియడం లేదు |
| అస్య | = ఈ వృక్షము యొక్క | సువిరూఢ మూలం | = పాతుకొన్న వేళ్ళు గల |
| రూపం | = స్వరూపము | ఏనం | = ఈ |
| న ఉపలభ్యతే | = తెలియడం లేదు | అశ్వత్థం | = అశ్వత్థమును |
| తథా | = అలాగే | దృఢేన | = దృఢమైన |
| ఆదిః న | = ఆది కూడా తెలియడం లేదు | అసంగ శస్త్రేణ | = అసంగ మనే శస్త్రము చేత |
| అంతః చ న | = అంతము కూడా తెలియడము లేదు | ఛిత్వా | = ఛేదించి |

**అర్జునా! సంసార వృక్షము యొక్క స్వరూపము ఈ ప్రపంచంలో తెలియడం లేదు. మొద లెక్కడో, నడుమ యేదో, అంత మెక్కడో అసలే తెలియడం లేదు. వేళ్ళు బాగా పాతుకు పోయిన ఈ సంసార వృక్షాన్ని దృఢమైన అసంగ శస్త్రము చేత ఖండించాలి.**

**వ్యాఖ్య**

మొదటి రెండు శ్లోకాలలో సంసార వృక్షము మహాద్భుతంగా వర్ణించ బడింది. కొమ్మలతో, ఆకులతో, చిగుళ్ళతో, ఊర్ధ్వమూల అధశ్శాఖలతో అత్యంత రమణీయంగా రూపకాలంకార వర్ణనతో శోభాయమానంగా నేత్రాలకు విందు చేసి, మనస్సును మైమరపించిన అశ్వత్థమును అవలోకించాలని ఎవరైనా అభిలషిస్తారు. దానిని వాస్తవ రూపంలో మనచే దర్శింప చేసే ప్రయత్నం ఈ మూడవ శ్లోకంలో జరుగుతూ ఉంది.

### చెప్పడానికే ఉంది - చూడటానికి లేదు

అర్జునా! ఇంతవరకు ఏ సంసార వృక్షమును గూర్చి వర్ణించడం జరిగిందో (***యస్తు వర్ణితః సంసార వృక్షః***), దాని రూపము (***అస్య రూపమ్***) ఈ ప్రపంచంలో ఎక్కడా కనిపించదు (***తథా న ఉపలభ్యతే***) అంటూ విస్మయాన్ని కలిగించే వాక్యాన్ని వినిపించాడు వాసుదేవుడు. తాను ఏ విధమైన సంసార వృక్షాన్ని వర్ణించి చెప్పడం జరిగిందో, ఆ విధమైన వృక్ష మేదీ వాస్తవానికి కనిపించడం లేదు అంటున్నాడు. అంటే, దాని అర్థ మేమిటి? అలాంటి వృక్షం అసలు ఉందా, లేదా? ఎవరైనా ఉన్న దానిని వర్ణిస్తారు గాని, లేని దానిని వర్ణిస్తారా? వర్ణించడం జరిగింది కనుక ఉందనే అనుకోవాలి. లేని దైతే ఎలా వర్ణిస్తారు, ఎందుకు వర్ణిస్తారు? వర్ణించ బడింది కనుక ఉన్నదనే విశ్వయించుకుందా మంటే, ఏదైతే వర్ణించ బడిందో అది గోచరించడం లేదని, ఇంకెవరో కాదు, వర్ణించిన వాడే చెబుతున్నాడు. ఇదెక్కడి గందరగోళం? ఇంతకీ, అది ఉన్నదా, లేనిదా?





ఏమో! అదీ చెప్పలేము. ఉందను కుంటే ఉంది. లేదనుకుంటే లేదు. కొందరికి ఉన్నది లేనట్లు తెలుస్తుంది. కొందరికి లేనిది ఉన్నట్లు తెలుస్తుంది. కొందరికి ఉన్నది ఉన్నట్లు తెలియదు. కొందరికి ఉన్నది ఉన్నట్లు తెలుస్తుంది. కనుక ఉండటము, లేక పోవటము అనేది చూచే వాడి మీద ఆధారపడి ఉంటుంది.

ఇంతకీ శ్రీకృష్ణుడు ఉన్న దానిని వీక్షించి వర్ణించాడా, లేక లేని దానిని ఊహించి ప్రవచించాడా? కనిపించిన దానినే వినిపించాడు. ఈ విషయంలో సందేహం లేదు. అదే వాస్తవ మైతే, చూచిన దానిని చెప్పి, చెప్పిన దానిని చూడటం సాధ్యం కాదు అని పలకడ మేమిటి? ఏముంది అక్కడ అంతగా ప్రశ్నలతో గుంజుకోవడానికి? ఉన్నట్లు కనిపించింది వాస్తవమే. లేనిది కూడా వాస్తవమే. కనిపించి నంత మాత్రాన ఉండాలని ఎక్కడుంది? లేని వాటిని ఎన్నిటిని మనం ఉన్నట్లు చూడటం లేదు. అదెలా? ఉన్న వాటిని లేనివిగా చూచినట్లే!

నిద్రలో స్వప్న ప్రపంచాన్ని చూచింది మనం కాదా? చూచిన స్వప్నాన్ని వర్ణించడం దోషమా? అలాగని విన్నవాడు ఊరుకోలేక చూడాలని ఉత్సాహపడి ఊదర పెడితే, నేను వర్ణించి చెప్పింది లేదయ్యా, కనిపించ దయ్యా అని చెప్పడం నేరమా? అలాగే అది కనిపించదు; కారణం, దానికి రూపం లేదు (***న రూపం అస్య***) అంటున్నాడు.

సంసార వృక్షము అంటే విశ్వవృక్షమే కదా! సంసారానికి రూపం లేదు అంటే, ప్రపంచానికి రూపం లేనట్లే కదా! అవును. ప్రపంచానికి రూపం లేదు. ప్రపంచము యొక్క రూపము ఇలా ఉంటుంది అని చెప్పిన వాళ్ళు లేరు. విచారించ నంత వరకే, ఏదో ఒక రూపం మనస్సులో మెదుల్తూ ఉంటుంది. విచారం ప్రారంభించ గానే ఏ రూపమూ లేదని అర్థమై పోతుంది. రూపం లేని దానికి నామం మాత్రం ఎలా ఉంటుంది? నామరూపా లున్నంత వరకే ప్రపంచానికి రూపం ఉంటుంది. అది కూడా నామ మాత్రమే (***వాచారంభణో వికారో నామధేయం***).

### కనిపిస్తుంది - కనుమరు గవుతుంది

సంసార వృక్షము కనిపిస్తుంది. తిరిగి చూచే సరికి కనుమరు గవుతుంది. కనిపిస్తుంది కనుక లేదని చెప్పలేము. కనుమరు గవుతూ ఉంది కనుక ఉందనీ అన లేము. ఉన్నది కనుక సత్యము అని చెప్పడానికి అది ఎప్పుడూ ఉండేది కాదు. పోనీ లేదని నిర్ణయిద్దా మంటే కళ్ళకు కనిపిస్తూ ఉంది. కనుక అసత్య మని చెప్పలేము. అసత్యము కాని దానిని, సత్యము కాలేని దానిని ఏమని నిర్వచించాలి? అనిర్వచనీయ మని చెప్పాలి. అదే మిథ్య. నిర్వచించ డానికి వీలు లేనిది. అదే మాయ. లేకనే ఉన్నట్లు తెలిసేది. కనిపించి కనుమరు గయ్యే స్వభావం కలది. స్వప్న సమానంగా (***స్వప్న***), మృగతృష్ణ లోని జలంతో సమానంగా (***మరీచ్యుదక***), మాయా నిర్మితమైన గంధర్వ నగరంతో సమానంగా (***మాయా గంధర్వ నగర సమత్వాత్***) కనిపించి వెంటనే నశించే స్వరూపం కలది (***దృష్ట నష్ట స్వరూపః***).

కల గనే వాడికి కల ఉంది. ఎంత వరకు? కల గన్నంత వరకు. మేలుకున్న క్షణాన కల లేనిదే. ఎవరికి లేనిది? కల గన్న వాడికి కూడా లేనిదే.

ఎండమావిలో నీరు ఉన్నట్లు కనిపిస్తుంది. వాస్తవానికి అక్కడ నీరు ఎప్పుడూ లేదు. చూచే టప్పుడు కూడా లేదు. వేసవి కాలంలో ఇసుక మైదానాలలో సూర్యకిరణాలు ప్రతిఫలించి నపుడు భ్రాంతి చేత చలనాలు కనిపించి, అవి జల చలనా లైనట్లు అనిపిస్తుంది. అదే ఎండమావి. మృగతృష్ణ. అలాంటి జలాలను పానం చేయాలని మృగాలు భావిస్తాయే గాని వివేకం గల మానవులు భావించరు. ఎండమావులలో దప్పిక తీరు తుందనే ఆశ మృగాలకే ఉంటుంది. అందుకే ఎండమావికి మృగతృష్ణ అనే పేరు వచ్చింది (***మృగాణాం తృష్ణా***

***అస్యా మితి మృగతృష్ణా).*** మృగతృష్ణలో నీరు కనిపించ దానికి అందులో నీరు ఉండటం కారణం కాదు, చూచే వానిలో జ్ఞానం లేక పోవడం కారణము. అదే అజ్ఞానము. అజ్ఞానంలో అస్తిత్వాన్ని కలిగి ఉంది కనుక ఎండమావికి రూపం లేదు. ఉండినా దృష్ట నష్ట స్వరూపంతో ఉంటుంది.

గగనంలో గంధర్వ నగరం లేదు. కల్పించుకొని చూచే వారికి ఉన్నట్లు కనిపిస్తుంది. మేఘాలలో కల్పించ బడిన ఊహాపోహాలే గంధర్వ నగరము. మేఘాల లోనే మతంగాలు. మబ్బుల లోనే మందిరాలు. గాలి వీచ గానే మతంగాలు పతంగాలై ఎగిరి పోతాయి. మందిరాలు మబ్బు తునకలై మాయ మౌతాయి. కల్పనలు కలకాలం ఉంటాయా? క్షణంలో ఉన్నట్లు అనిపిస్తాయి. మరు క్షణంలో లేనట్లు తెలుస్తాయి. దృష్ట నష్ట స్వరూపాలుగా తేలి పోతాయి.

స్వప్నం మనస్సులో వ్యక్తమై కనిపించింది. ఎండమావి వ్యక్తం కాకనే ఉన్నట్లు అనిపించింది. గంధర్వ నగరమును మనస్సు కల్పించుకుంది. ఇవన్నీ అందరి మనస్సులలో లేవు. కల్పించుకున్న మనస్సుల లోనే దృష్ట నష్ట స్వరూపంగా ఉన్నాయి. ప్రపంచానికి ఒక రూపం లేదు. అందుకే ఎవరి ప్రపంచం వారిది.

**ఆనవాలు అగుపించవు**

దృష్ట నష్ట స్వభావం కలిగిన సంసార వృక్షానికి అంత మెక్కడో అర్థం కాదు. స్థితి ఏమిటో తెలిసి రాదు. అలాగే ఆది కూడా అవగతం కాదు ***(న అన్తః పర్యన్తః నిష్ఠా సమాప్తి ర్వా విద్యతే తథా న చ ఆదిః).***

సంసార వృక్షము అనేది ఉంటే కదా ఆదిని నిర్ణయించడానికి, లేదా అంతాన్ని నిర్ధారించడానికి. లేని వారికి అది ఎలాగూ లేదు. ఉన్నది అనే వారికి కూడా ఒక విధంగా లేదు. దేనిని బట్టి నిర్ణయించాలి? దేనిని ఆధారం చేసుకొని నిర్ధారించాలి?

గోదావరి నాసిక్‌లో ప్రారంభమై బంగాళాఖాతంలో లయిస్తూ ఉంది కనుక నాసిక్‌ను ఆదిగా, సాగరాన్ని సమాప్తంగా చెప్పుకుంటున్నాం. ఆద్యంతాలు అర్థ మవుతూ ఉన్నాయి కనుక నడుమను కూడా ఊహించ గలుగుతున్నాం. అది భగవతికి నిలయమైన బాసర క్షేత్రం కావచ్చు. లేదా భగవంతుడు కొలువై ఉన్న భద్రాచలం కావచ్చు. మరి, సంసార వృక్షాన్ని అలా నిర్ణయించే అవకాశ ముందా? ఈ ప్రదేశం నుండి ప్రారంభమైంది, ఈ కాలంలో మొదలైంది అని ఎవరైనా చెప్పగలరా? చెప్పడానికి ఆ విధంగా ఈ విశ్వ వృక్షము ఎవరి కైనా అర్థమైందా? లేదు. ఇప్పటికి ఏ ఒక్కరూ తెలుసుకో లేదు ***(ఇతః ఆరభ్య అయం ప్రవృత్తః ఇతి న కేనచిత్ గమ్యతే).***

గోదావరి జలాలకు ఆద్యంతాలు చెప్పగల రేమో గాని ఎండమావుల లోని జలాలకు ఆద్యంతా లెక్కడో ఎవరు చెప్పగలరు? ఆద్యంతాలు అర్థం కానపుడు నడుమ ఎక్కడంటే ఏం చెప్పగలం? ***(న చ సంప్రతిష్ఠా స్థితిః, మధ్యమ్ అస్య న కేనచిత్ ఉపలభ్యతే).***

మనం ప్రయాణం చేసే టప్పుడు 'ధన్యవాదాలు - మా రాష్ట్రం ఇక్కడ సమాప్తం' అనే బోర్డు కనిపిస్తుంది. అక్కడే మరొక బోర్డు కూడా అగుపిస్తుంది. 'ఆహ్వానము - ఇక్కడ నుండే మా రాష్ట్రం ఆరంభం' అని. ఇలా ఒక దేశానికి, ఒక ప్రదేశానికి ఆది మధ్యాంతాలు తెలుస్తూ ఉంటాయి. కాని స్వప్న ప్రపంచం, లేదా స్వప్న ప్రదేశానికి ఆద్యంతాలు ఎక్కడ అని ప్రశ్నిస్తే సమాధానం ఎవరు చెప్పగలరు? చెప్పడానికి ఎవరికి అర్థ మైందని? ఆద్యంతాలు లేవు కనుక అర్థం కావు. ఆద్యంతాలు ఎప్పుడైతే లేవో, మధ్యమ స్థితి కూడా లేదు. ***ఆదా వన్తే చ యన్నాస్తి వర్త మానేపి తత్తథా!*** ఆరంభము నందు లేనిది, అంతము నందు ఉండనిది, మధ్యలో ఉన్నట్లు





కనిపించినా, అది ఉన్నది కాదు, లేనిదే. కల్పితాలు ఎప్పుడూ అలాగే ఉంటాయి. ఆరోపాలు అలాగే అర్థ మవుతాయి.

మసక చీకటిలో దారిలో పడి ఉన్న త్రాడులో పామును ఆరోపించి చూడటం జరిగింది. భయ భ్రాంతు లకు లోను కావడం జరిగింది. వెలుగులో చూస్తే అక్కడ పాము అనేది లేనే లేదని తెలిసింది. మరి, ఉన్నట్లు అగుపించింది కదా! నిజమే. అలా అగుపించి నపుడు కూడా అక్కడ పాము లేదు. లేకనే ఉన్నట్లు అగుపించింది. పామును త్రాడులో ఆరోపించక ముందు అక్కడ పాము లేదు. త్రాడును తెలుసుకున్న తరువాత కూడా పాము లేదు. ఆద్యంతాలలో అగుపించని పాము, మధ్యలో అగుపించింది అంటే, ఆ ఆరోప సర్పము అవలోకించే సమయంలో కూడా లేనిదే. లేని దానికి ఆద్యంతాలు ఎక్కడున్నా యని చెప్పాలి? అదే విచిత్రమైన సంసార వృక్షము యొక్క స్థితి.

ఈ ప్రపంచము చిత్ర విచిత్రంగా గోచరిస్తూ ఉంటుంది. ఒకరికి కనిపించినట్లు మరొకరికి కనిపించదు. ఆరోపమే కనుక ఎవరు ఎలా ఆరోపించుకుంటే అలా అగుపిస్తుంది. పోనీ, అగుపించిన దానికి ఆరంభము అర్థ మవుతుందా అని ప్రశ్నించుకుంటే, అర్థ మవుతుందనే అనిపిస్తుంది. తీరా విచారిస్తే, ఆదిగా ఏదైతే అర్థ మయిందో దానికి మరొక ఆది ఉన్నట్లు తెలుస్తుంది. ఆది అంటే కారణము.

పండును పరీక్షిస్తే, కాయే పండు అయ్యింది అని అర్థ మవుతుంది. కాయకు పువ్వు కారణము. పువ్వుకు రెమ్మ కారణము. రెమ్మకు కొమ్మ ఆధారము. కొమ్మకు కాండము ఆధారము. ఇంతకీ చెట్టుకు ఏది కారణము? బీజము కారణము. ఆ బీజానికి ఏది కారణము? మరొక చెట్టు కారణము. ఇలా ఎంతైనా చెప్పుకుంటూ పోవచ్చు. ఎన్నైనా చెప్పుకోవచ్చు. సోదె ఎంత చెప్పుకున్నా అది మాత్రం అర్థం కాదు. ఉంటే కదా అర్థం కావడానికి! లేని దానికి అంత మెక్కడో చెప్పే దెలా? అనంతాలుగా అనిపించే ఆకాశానికీ, అబ్ధికీ ఆద్యంతా లున్నాయేమో గాని ఈ ఆరోప అశ్వత్థానికి ఆదీ లేదు, అంతమూ అర్థం కాదు. ఇదొక పారం లేని పారావారము. దుస్తరము. ఈ సంసార వృక్షము దురుచ్ఛేదము.

**ఆది ఎక్కడో తెలిసి రాదు**
**అంత మెప్పుడో తెలియదు**
**నడుమ అన్నీ మరపులే**
**క్షణ క్షణానికి మార్పులే**
**ఏది ఉండునో ఏది ఊడునో**
**తెలియని జగతి శోకమయం**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అంటూ మాయా వృక్షాన్ని ముట్టుకో వద్దని గుట్టు విప్పింది రామజోగి చిట్కా *(రా.జో.చి. - 6).*

తన కంటూ అస్తిత్వము లేక పోయినా, పని కట్టుకొని మనిషిని ముప్పుతిప్పలు పెట్టే ఈ మాయా సంసార చెట్టు నీడలో ఇంకా ఎన్నాళ్ళు ఈ కాపురం? లేని దానిని ఉన్నదని భ్రమించి ఆశ్రయించాం. లేదని తెలిసిన తరువాత ఇంకా దానిని పట్టుకొని వ్రేలాడట మెందుకు? లేని దానిని లేనట్లే వదిలేస్తే, ఉన్నదానితో కలిసి ఊరేగ వచ్చు.

చెప్పుకోవడాని కైతే బాగానే ఉంది. ఉన్నదో, లేదో అన్నది ప్రక్కన పెడితే, పట్టుకున్న దానిని విడిచి

పెట్టడం చెప్పుకున్నంత సులభంగా లేదు. ఎందుకని? అది బాగా పాతుకు 'పోయింది. దాని మొదళ్ళు చాలా దృఢంగా ఉన్నాయి ( **సువిరూఢ మూలం** ). ఆ మాయా వృక్షము భయంకరంగా చలిస్తూ ఉంది. బలమైన గాలులు వీస్తూ ఉంది. దారుణంగా వీస్తున్న బలమైన గాలుల్ని తట్టుకొని నిలిచే శక్తి ఎగిరే మేఘానికి ఉంటుందా? సంసార వృక్షం సృష్టించే వికృత బీభత్సాన్ని తట్టుకొని నిలిచే శక్తి జననమరణ చక్రంలో పడి తిరిగే జీవులకు ఉంటుందా? అవి ఆపితే ఆగే గాలులు కావు. వారించ డానికి, నివారించ డానికి సాధ్యము కాని వికృత వాతవారాశి. మరి మార్గ మేమిటి? తరుణోపాయ మేమిటి? శక్తి చాలని చోట యుక్తిని ఉపయోగించాలి. శ్రుతి వాక్యాన్ని అనుసరించాలి. వృక్షాన్ని కూల్చేసే ప్రయత్నం చెయ్యాలి. అంతే. మరి, అది దురుచ్ఛేదము అన్నారు కదా! దానిని కూల్చే దెలా? అదే యుక్తి. ఉన్న దానిని అయితే, శ్రమించి కూల్చే ప్రయత్నం చెయ్యాలి. లేని దానిని కూల్చే దేముంటుంది, కర్మ ద్వారా రాల్చే దేముంటుంది? లేని దానిని లేదని తెలుసుకొని సాక్షిగా ఉండటమే. ఇదే అసంగము. అసంగ శస్త్రం తోనే మాయా వృక్షము మాయ మవుతుంది. అదే చెబుతున్నాడు.

రూపం లేకపోయినా, ఆది మధ్యాంతాలు ఎక్కడో తెలియక పోయినా, సుస్థిరత లేని ఈ ప్రపంచ వృక్షము ( **ఏనం అశ్వత్థం** ) యొక్క వేళ్ళు బలంగా పాతుకొని పోయాయి ( **సువిరూఢ మూలమ్ సుష్ఠు విరూఢాని మూలాని యస్య** ). కారణం, ఈ వృక్షము చాలా ప్రాచీన మైనది. అనేక జన్మల సంస్కారము చేత బాగా బలపడింది. అలాగని అధైర్య పడ నవసరం లేదు. భీతి చెంద వలసిన పని లేదు. చెట్టు దృఢమైంది అయినపుడు ఆయుధము బలమైంది అయితే సరిపోతుంది. అలాంటి ఆయుధముతో ఈ అశ్వత్థమును **(ఏనం అశ్వత్థం)** ఖండించ వచ్చు అంటున్నాడు. ఈ సందర్భములో మళ్ళీ **ఏనం అశ్వత్థం** అని అశ్వత్థ శబ్ద ప్రయోగము చేయడం అంతర్భావ సూచకము. ప్రపంచ వృక్షము ప్రాచీన మైనదే అయినా అది అశ్వత్థము అని మరచి పోవద్దు అని తెలియ చేయడమే; ధైర్యం చెప్పడమే.

శతాబ్దాలుగా ఒక గదిలో చీకటి ఉండినా, తలుపులు తెరిచి దీపం వెలిగించ గానే అంధకారం అదృశ్య మవుతుందా, లేదా? ఇదీ అంతే. కారణం, ఇది అశ్వత్థము. **శ్వోపి స్థాతుం అనర్హః అశ్వత్థః** - రేపు ఖచ్చితంగా ఉంటుంది అని చెప్పడానికి అర్హత లేనిది అశ్వత్థము. కనుక రేపు ఉంటుందో ఉండదో చెప్పడానికి అవకాశం లేని అనర్థదాయక మైన అశ్వత్థాన్ని నేడే అంతం చేసే ప్రయత్నం చేయ మంటున్నాడు. **శ్వః కార్యం అద్య కర్తవ్యం** - రేపు అంటే భవిష్యత్తులో ఎలాగూ జరిగేదే కనుక దానిని నేడే చేయ మంటున్నాడు. అనాదిగా అంటి పెట్టుకొని అనర్థాన్ని సృష్టిస్తున్న ఈ అశ్వత్థ వృక్షాన్ని అసంగ శస్త్రము చేత ఖండించ మంటున్నాడు.

## సంసార వృక్ష ఖండనము

భక్తి కల వాడే ముక్తికి అర్హు డవుతాడు. ప్రపంచముపై ఎవరికి విరక్తి, లేదా వైరాగ్యము కలుగుతుందో, వారికే పరమేశ్వరుని విషయంలో భక్తి కుదురుతుంది. కనుక, అనిత్యమైన, అనర్థ దాయకమైన ప్రపంచముపై విరక్తి జనించడానికే సంసారానికి వృక్ష రూపాన్ని కల్పించి వర్ణించడం జరుగుతూ ఉందని ప్రస్తుత అధ్యాయం ప్రారంభ శ్లోక వ్యాఖ్యానం లోనే చెప్పుకున్నాం. ఆ కార్యం ఇక్కడ చక్కగా ముగిసింది. సంసార వృక్ష రూపాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాం. కనుక, అశ్వత్థ మనే ఈ సంసార వృక్షాన్ని ఖండించడమే మన ముందున్న కర్తవ్యము. అదెలాగో కూడా భగవంతుడే చెబుతున్నాడు.

అర్జునా! వేళ్ళు బాగా పాతుకు పోయిన ఈ సంసార వృక్షాన్ని ( **సువిరూఢ మూలం ఏనం అశ్వత్థం** ) దృఢమైన అసంగ శస్త్రము చేత ( ***అసంగ శస్త్రేణ దృఢేన*** ) ఖండించు ( **ఛిత్వా** ) అంటున్నాడు.

అసంగ శస్త్రము అనేది ఒక ప్రత్యేకమైన ఆయుధము కాదు. అసంగమే శస్త్రము. అసంగము అంటే





సంగరాహిత్యము. ***సంగతే విషయేషు అనేన ఇతి సంగః వైషయికో రాగః తదభావో విరాగః అసంగః*** - విషయాలతో కూడి ఉండటము సంగము. అంటే విషయముల యందు రాగము. అట్టి రాగము లేక పోవడము విరాగము. అదే అసంగము. విషయాలలో ఉన్న దోషాన్ని దర్శించడం చేత కలిగే వైరాగ్యము అసంగత్వమునకు దారి తీస్తుంది. ఆహారంలో విషం కలిసి ఉందని తెలిసిన తరువాత అట్టి ఆహారాన్ని ఎవరైనా భుజిస్తారా? ఇదీ అంతే. సంసార వృక్షం లోని దోషాలను దర్శించడం వల్ల ఏర్పడే వైరాగ్యము సంసారానికి అంటకుండా ఉండేలా చేస్తుంది. అదే అసంగము. ఇది విషయ త్యాగము వలన, సంగత్యాగము వలన ప్రాప్తించే ఫలం. కనుకనే, విషయ త్యాగము, సంగత్యాగమును భక్తికి ముఖ్య సాధనములుగా అభివర్ణించాడు నారదమహర్షి ( ***సూ॥ తత్తు విషయ త్యాగాత్ సంగత్యాగాచ్చ :*** *నారద భక్తి సూత్రములు - 35* ). శబ్దాది విషయాల నుండి విడిపడటము విషయ త్యాగ మైతే, వ్యక్తులతో కల్పించుకున్న సంబంధాల నుండి విడి పడటము సంగత్యాగము. అదే అసంగము. మరి, ఏ వ్యక్తుల నుండి విడి పడటము అసంగ మవుతుంది? దీనికి సమాధానము ప్రస్తుత శ్లోకంపై ఆచార్యుల వారు అందించిన భాష్యం లోని నిర్వచనమును చూద్దాం. అసంగ శస్త్రము అంటే, పుత్ర, విత్త లోకైషణాదుల యందు వైరాగ్యమే అసంగము. వాటికి దూరంగా ఉండటమే అసంగము. అదే అసంగ శస్త్రము ( ***అసంగః పుత్ర విత్త లోకైషణాదిభ్యః వ్యుత్థానం*** ).

ఈ విధంగా అసంగ బుద్ధి ఏర్పడిన వారికే పరమేశ్వరుని యందు భక్తి కలుగుతుంది. భగవంతుని భక్తి అఖండంగా సాగించిన వారే మోక్షాన్ని పొందుతారు. ఈ విషయాన్ని భాగవతం యథాతథం ప్రవచించింది.

**పూని మోక్షార్థి యగు వాడు దీనిఁ దీవ్ర భక్తి యోగంబు చేత విరక్తి బొంది** - 'ముముక్షువు అంటే మోక్షాపేక్ష కలవాడు. విషయసుఖాల యందు అసంగుడై, అఖండమైన భక్తి యోగాన్ని అనుష్ఠించాలి' అని ఆంధ్రమహా భాగవతం - తృతీయ స్కంధములో భగవానుడైన కపిలుడు తన తల్లి దేవహూతికి జ్ఞానోపదేశం చేశాడు.

సంగత్వములో ప్రధాన మైంది మమకారము. దానికి ఆధారమైంది అహంకారము. అసంగత్వము అనేది మమకార త్యాగముతో ఆరంభం కావాలి. మమకారాన్ని ఎలా త్యాగం చెయ్యాలి? మమకారం అనేది వస్తువు కాదు, తీసి దూరంగా పారవేయటానికి. అది అభిమానము. వివేకము లేక పోవడం చేత ప్రాప్తించిన అభిమానమే మమకారము. కనుక అది వివేక విచారాదుల వల్లనే దూర మవుతుంది. ఆచార్యుల వారు నిర్దేశించినట్లు, మమకార త్యాగము పుత్రదారాదుల నుండే ఆరంభం కావాలి. తన తరువాత తనకు అత్యంత ప్రియంగా అనిపించే వారు, నిత్య సాంగత్యము చేత మమకారాన్ని పోషించే వారు భార్యాపుత్రాదులే కనుక, అసంగ మనేది వారి నుండే ప్రారంభం కావాలి. పుత్రదారాదుల యందు అసంగత్వము అంటే కుటుంబానికి దూరం కావడం అని కాదు. కుటుంబము నందు మమకారము లేకుండా ఉండటము. మోహం లేకుండా కలిసి ఉండటము. వివేకంతో, విచారంతో జీవించడము. వివేకము కలిగి విచారం చేయ గలిగితే, పుత్రదారాదుల యందు మమకారము క్షీణిస్తూ ఉంటుంది. ఒక దశలో లేకుండా పోతుంది.

పుత్రు డెవరు? భార్య ఎవరు? ఈ ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించడమే విచారము. వీరిపై మమకారము ఎక్కడ నుండి ఆవిర్భవించిందో, ఆ మూలం వైపుకు పోవడమే విచారము. ఈ విధమైన విచారము యొక్క ఫలితంగా భార్యాపుత్రాదుల యందు మనకున్న మమకారము అధ్యాస జనితమే అని తేలి పోతుంది. కేవలం ఆరోపమే నని అర్థ మవుతుంది.

పెళ్ళి కాక ముందు భార్య ఎవరో తెలియదు. పుట్టక ముందు కుమారు డెవరో తెలియదు. ఒక కాలంలో పెళ్ళి పీటల మీద భార్య చేరువైంది. ఆ తరువాత పుత్రుడు కలిగాడు. వీరంతా కాలంలో మనకు

తోడయ్యారు. మమకారం పెంచుకోవడం వల్ల ప్రియ మయ్యారు (*ప్రియం భవతి*). కాలంలో తోడైన వారందరూ కాలంలో దూర మవుతారు. లేదా మనమైనా వారికి దూర మవుతాము.

దూరమైన క్షణాన ప్రియత్వానికి అర్థ మేమిటి? భార్యాపుత్రులు కలవక ముందు వారు మనకు ప్రియులు కారు. అంటే, వాళ్ళు రాక ముందు మనలో ప్రియత్వం లేదా? ఉండింది. ఎవరి మీద ఉండింది? మన మీదే ఉండింది. మన మీదే మనకు ప్రియత్వం ఉండింది. వాళ్ళు దూరమైన తరువాత మనలో మనకు ప్రియత్వం ఉంటుంది. ఎవరి మీద ఉంటుంది? మన మీదే ఉంటుంది.

కనుక పెళ్ళి కాక ముందు మనమే మనకు ప్రియమైన వాళ్ళం. భార్యాపుత్రులు కలిగిన తరువాత వాళ్ళు మనకు ప్రియంగా కనిపించారు. అనిపించారు. ఇదే మమకారము. వాళ్ళు దూరమైన తరువాత మళ్ళీ మనమే మనకు ప్రియంగా ఉంటాము.

ఇది విచారంలో తేల వలసిన విషయం. ప్రియ వస్తువు, ప్రియ విషయం ఏది? అని ఆలోచిస్తే, ఎవరికి వారే ప్రియం. ఇది సత్యజ్ఞానం. విచార జనిత వివేకము. తనకు తాను ప్రియం కావడం చేత, తనతో సంబంధాన్ని కలిగిన వారు ప్రియంగా అనిపించారు. వారిలో ప్రధానమైన వారు భార్యాపిల్లలు. వాస్తవానికి తానే తనకు ప్రియం. భార్యాపుత్రుల యందు ఉండేది ఆరోపిత ప్రియత్వమే కాని సత్యమైన ప్రియత్వము కాదు. ఈ సత్యాన్నే బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య మహర్షి దివ్యంగా భాషించాడు.

***న వా అరె జాయాయై కామాయ జాయా ప్రియం భవతి ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి! న వా అరె పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్తి ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి! న వా అరె విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి!***

భార్య ప్రియంగా ఉంది అంటే భార్య మీద ప్రియత్వము ఉందని కాదు. తన స్వప్రయోజనార్థమే భార్య ప్రియంగా కనిపిస్తూ ఉంది. పుత్రునిపై ఉన్న ప్రియత్వము పుత్రునికి సంబంధించింది కాదు; తనకు సంబంధించింది. విత్తంపై ఉన్న ప్రియత్వము విత్తాన్ని అంటిపెట్టుకొని లేదు. విత్తము తనకు ఉపకరించడం చేత, తనపై తనకు ప్రియత్వము ఉండటం కారణంగా విత్తము ప్రియంగా కనిపిస్తోంది.

ఎవరికి ఏవి ఉపకరిస్తే వాటిపై వారికి ప్రియత్వము జనిస్తూ ఉంటుంది. అవే నిరుపయోగంగా, బ్రతుకులో కంటకంగా మారి నపుడు, ప్రియత్వాలు భార మౌతాయి. ప్రియమైన వాళ్ళు దూర మవుతారు. అవి భార్యాభర్తల మధ్య విడాకులు కావచ్చు. తండ్రికొడుకుల మధ్య తెగతెంపులు కావచ్చు.

ఇప్పుడు ఆలోచించండి! ఏది ప్రియత్వము? ఎక్కడి మమకారము? ఎవరికి ఎవరు? విచారించే వివేకమే గనుక మనిషికి ఉంటే మమకారం క్షణంలో మాయ మవుతుంది. ఎవరూ ఎవరికి ప్రియులు కారని, ఎవరు ఎవరికీ బంధువులు కారని, సంబంధాలన్నీ కల్పితాలే నని తేలి పోతుంది (*విచార్యమాణే న కస్యాపి కశ్చిత్ బంధుః*). ఇక ఆ తరువాత మమకారం ఎక్కడుంటుంది? అదే అసంగము.

స్వప్నంలో కలిసి కాపురం సాగించిన భార్యాపుత్రులు మేలుకున్న తరువాత ఉంటారా? మాయా కాపురం - మాయా దారాసుతులు అని సరిపెట్టు కుంటాం. కల లోని కాపురాలు ఎలాంటివో అర్థమైతే, ఇల లోని కాపురాలు కూడా అలాంటివే అని అర్థ మవుతుంది. ఏవైనా సంసారాలే. అన్నీ మాయా మయాలే. మిథ్యారూపాలే. అసలు సంసారం అంటేనే గొప్ప విచిత్రము. అదొక పెద్ద మాయ (*సంసారస్య వైచిత్ర్యం నామ*). ఈ విధమైన సత్యావగాహనలో సంసారము మిథ్య అని అర్థ మవుతుంది కనుక, అసంగత్వం దానంతట అదే బుద్ధిలో స్థిరపడి పోతుంది. ఈ అసంగ శస్త్రము చేత అనర్థ దాయకమైన సంసార వృక్షాన్ని ఖండించాలి. దృఢమైన





అసంగ శస్త్రము చేత సంసార వః మాయా వృక్షాన్ని కూకటి వ్రేళ్ళతో సహా పెకలించి వేయాలి (*అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా సంసార వృక్షం స బీజం ఉద్ధృత్య*).

**అదంతా ఇందుకా?**

ఇప్పుడు చెప్పండి. ఏది సంసార వృక్షము? ఇప్పుడది ఏమై పోయింది? అసలు ఒకప్పుడు ఉండిందా? ఉంటే ఎక్కడ ఉండింది? చెప్పనా! అజ్ఞానంలో ఉండింది. ఎవరి అజ్ఞానంలో? ఎవరిలో అజ్ఞానం ఉంటే వారి లోనే ఉండింది. అజ్ఞానం తొలగితే సంసార వృక్షం ఉంటుందా? ఉండదు. మిథ్యా వృక్షానికి స్వతంత్ర మనుగడ ఎలా ఉంటుంది? మిథ్య మిథ్యగా తెలియనంత వరకే, మాయ మాయగా అర్థం కానంత వరకే సంసార వృక్షము కళకళ లాడుతూ ఉంటుంది. తనను ఆశ్రయించిన వారిని తన ఛాయలో ఆడిస్తూనే ఉంటుంది. అర్థం చేసుకున్న వారికి మాయగా మిగిలి పోతుంది. ఎండమావిగా తెలిసి పోతుంది. వాళ్ళను ఇక ఆడించ లేక తానే ఆగి పోతుంది. అదృశ్యమై పోతుంది. అసంగ శస్త్రము చేత సంసార వృక్షాన్ని ఖండించడ మంటే ఇదే. అజ్ఞానాన్ని అంతం చేయడమే సంసార వృక్షాన్ని సమూలంగా ఖండించడము. లేకనే ఉన్నట్లు అనిపించి అనర్థాన్ని సృష్టించిన మాయామయ మైన సంసార వృక్షమును స్థూలంగా ఖండించింది ఏమీ లేదు. అశ్వత్థ మనే సంసార వృక్షము లేనిదే అని గ్రహించడమే మిథ్యావృక్ష ఖండనము.

మరి, ప్రస్తుత అధ్యాయంలో ఇంతవరకు సంసార వృక్షాన్ని వర్ణించుకుంటూ వచ్చింది దానిని నిర్మూలించడాని కేనా! లేనిదే అని తెలుసుకోవడాని కేనా! లేకుండా పోయేదే అని అర్థం చేసుకోవడాని కేనా! ఇందుకేనా అదంతా? అవును. ఇదొక లీల. రామలీల కాదు; రావణలీల. రావణలీల దగ్ధమైతే, ఆ తరువాత రామలీల శోభాయమానంగా కళకళ లాడుతుంది.

**రావణలీల - మాయా గోల**

మన దేశంలో కొన్ని ప్రాంతాలలో శ్రీరామనవమి ఉత్సవాల సందర్భములో 'రావణ లీల' అనే ఒక ఆట ఆడతారు. ఎత్తైన రావణాసురుని విగ్రహాన్ని తయారు చేస్తారు. ఆ ప్రదర్శనను తిలకించడానికి జనులు తండోప తండాలుగా వస్తుంటారు.

**ఆఖ్యాయిక**

ఒక చోట రావణలీల క్రీడ జరుగుతూ ఉంది. ఆ వైపే వస్తున్న ఒక సాధువు ఆ క్రీడను పట్టించుకో కుండా, రావణ రూపాన్ని చూడనైనా చూడకుండా తన దారిన తాను పోతూ ఉన్నాడు. ఆ సాధువును ఒక యువకుడు గమనించి, దగ్గరకు వెళ్ళి 'స్వామీ! రావణలీల ఆట అద్భుతంగా సాగుతూ ఉంది. జన మంతా తిలకిస్తున్నారు. మీరా వైపు దృష్టిని కూడా సారించకుండా మీ దారిన మీరు పోతున్నారే!' అన్నాడు.

సాధువు నవ్వి, 'తగలబడే దానిని తిలకించి పులకించే దేముంది, నాయనా!' అంటూ తన దారిన తాను వెళ్ళి పోయాడు.

యువకుడికి అర్థం కాలేదు. ఈ లోగా రావణ విగ్రహానికి అమర్చిన పెద్ద వత్తికి కార్యకర్తలు నిప్పు అంటించారు. అంతే. రావణ విగ్రహం క్షణాల్లో పైకి దూసుకు పోయి పేలి పోయింది. జను లందరూ అరుపులతో, కేరింతలతో చప్పట్లు కొట్టారు. సాధువాక్యం యువకుడికి అప్పుడు అర్థమైంది. వేలాది సొమ్ము వెచ్చించి, రకరకాల హంగులతో రావణ విగ్రహాన్ని రూపొందించింది ఇలా తగలబెట్ట డానికే నన్న మాట! అంతే మరి. సంసార వృక్షాన్ని కూడా రూపకాలంకార వైభవముతో ముచ్చటగా మూడు శ్లోకాలలో ముకుందుడు వర్ణించింది

ఆ చెట్టెక్కి ఊగడానికి కాదు. దానిని అమాంతం పెకలించి వేయడానికి. అదే జరిగింది. అనర్థం అంతరించింది. కాని, అంతటితో సరిపోదు. బ్రతుకు అర్థవంతం కావాలి. ఆత్మవన్తం కావాలి.

*తరువాత శ్లోకంలో అదే విషయం.*

**తతః పదం త త్పరిమార్గితవ్యం యస్మి న్గతా న నివర్తన్తి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4**

***తతః-పదం-తత్-పరిమార్గితవ్యం-యస్మిన్-గతాః-న-నివర్తంతి-భూయః***
***తం-ఏవ-చ-ఆద్యం-పురుషం-ప్రపద్యే-యతః-ప్రవృత్తిః-ప్రసృతా-పురాణీ***

| | | | |
|---|---|---|---|
| తతః | = ఆ తరువాత | ప్రసృతా | = వ్యాప్త మైనదో |
| యస్మిన్ | = దేని యందు | ఆద్యం | = ఆద్యుడైన |
| గతాః | = చేరిన వారు | తం | = ఆ |
| భూయః | = మరల | పురుషం ఏవ చ | = పురుషుణ్ణే |
| న నివర్తంతి | = మరలి రారో | ప్రపద్యే | = శరణు పొందుతాను |
| యతః | = ఎవని వలన | తత్ | = ఆ |
| పురాణీ | = ప్రాచీన మైన | పదం | = స్థానము |
| ప్రవృత్తిః | = ప్రవృత్తి | పరిమార్గితవ్యం | = వెదక దగినది |

**అర్జునా! ఏ స్థానమును చేరిన వారు మళ్ళీ తిరిగి రారో, అనాది యైన ఈ సంసార ప్రవృత్తి ఎవరి నుండి విస్తరించిందో, అట్టి ఆది దేవుడైన పరమాత్మనే ఆశ్రయిస్తున్నాను అనే భావంతో భగవంతుణ్ణి అన్వేషించాలి.**

**వ్యాఖ్య**

### అసంగ శస్త్రము

అనర్థ దాయకము, దురుచ్ఛేదము అయిన సంసార వృక్షమును ఛేదించడ మనేది చెప్పుకున్నంత సులభ సాధ్యము కాదు. కారణం, దాని వేళ్ళు అంతటా పాతుకు పోయి ఉన్నాయి. విషయసంగము చేతనే ఈ వృక్షము శాఖోపశాఖలుగా విస్తరించింది కనుక, అసంగ బుద్ధి ఏర్పడ గానే అది వాడి పోతుంది. అలాగని దానిని విడిచి పెడితే, మళ్ళీ విషయాలనే చిగుళ్ళు (***విషయ ప్రవాలాః***) తొడిగి, కళకళ లాడుతుంది. కనుక దానిని మూలాలతో సహా పెకలించి వేయాలి.

సువిరూఢమైన మూలాన్ని నిర్మూలించడం సాధ్య మేనా? సాధ్యమే. కాని, సుసాధ్యం కాదు. సంసార వృక్షానికి సంబంధించిన అవగాహన పూర్ణంగా ఉంటేనే గాని, దాని మూలాన్ని పెకలించడం, లేదా పెల్లగించడం సాధ్య పడదు. దాని మూలాలను పెకలించడ మంటే మన మూలాలను పెకలించు కోవడమే అనేది ముందుగా మనకు అర్థం కావాలి. మన లోని అభిమానాన్ని, అహంకారాన్ని నిర్మూలించడమే. జన్మజన్మల నుండి పెనవేసు కొని వస్తున్న వాటిని పెల్లగించి దూరం చేసుకోవడమే. అందుకే సుసాధ్యం కాదు అంటున్నాడు.

దేనితో మనం సంబంధాన్ని కలిగి ఉన్నామో, దాని నుండి విడిపడాలి అంటే, దానికి సంబంధించిన అవగాహన మనకు పూర్ణంగా ఉండాలి. సంబంధాలు చాలా విచిత్రంగా ఉంటాయి. అవగాహన లోపించి నపుడే అభిస్నేహాలు తయా రవుతాయి. అభిస్నేహాలు ఎలాగూ ఫలించవు కనుక వియోగాలు ప్రాప్తిస్తాయి. సంయోగాలు,





వియోగాలు రెండిటి లోను అవగాహనా రాహిత్యమే ఉంటుంది. అందుచేతనే, ఒక దాని నుండి విడిపడిన మనిషి వెంటనే మరొక దానితో ముడిపడి పోతుంటాడు. ఒక వియోగము మరొక సంయోగానికి తలుపులు తెరుస్తూ ఉంటుంది. కనుక సంయోగ మైనా, వియోగ మైనా - అది ఏ సంబంధ మైనా, రెండిటికి సంబంధించిన పూర్ణావగాహన లేక పోవడం చేతనే ఒకటి చిగురిస్తే మరొకటి వాడి పోవడము, ఒకటి వాడిపోతే మరొకటి చిగురించడము జరుగుతూ ఉంటుంది. ఇలా సంసార వృక్షము జీవిస్తూనే ఉంటుంది.

అలా కాకుండా సంబంధాలలో - సంయోగానికి, వియోగానికి - రెండిటికీ సంబంధించిన అవగాహన పూర్ణంగా ఏర్పడి నపుడు, వివేక జనిత జ్ఞానము కలుగుతుంది. అట్టి జ్ఞానములో రెండు సంబంధాలూ ఒకేసారి పండుటాకు ల్లాగా రాలి పోతాయి. అదే అసంగము. అట్టి అసంగ శస్త్రము చేత సంసార వృక్షాన్ని సమూలంగా ఛేదించాలి (***అశ్వత్థ మేనం సువిరూఢ మూలమ్ అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా***).

### అసంగ స్వరూపము

అనిత్య విషయాల లోని అసంపూర్ణతను అర్థం చేసుకొని, అనర్థదాయక మైన అనిత్యాల నుండి విరమించడమే అసంగం కాదు. సాధక దశలో అది అసంగమే అయినా, సాధ్య దశలో అదే స్వరూపము. విషయి విషయాల లోనే గాక, వాటి మధ్య ఉండే సంబంధాలతో సహా సర్వములో, సమస్తములో ఏది పరివ్యాప్తమై ఉందో, అట్టి అద్వయ చైతన్య స్వరూప జ్ఞానమును పొంది, తన స్వరూపమే అసంగము అని తెలియడమే అసంగము యొక్క పారమార్థిక నిర్వచనము.

***అసంగోఽహం అసంగోఽహం అసంగోఽహం పునః పునః***
***సచ్చిదానంద రూపోఽహం అహ మేవాహ మవ్యయః ॥***

'నేను అసంగుణ్ణి. నేను అసంగుణ్ణి. నేను మళ్ళీ మళ్ళీ అసంగుణ్ణి. సచ్చిదానంద రూపుణ్ణి. అవ్యయుణ్ణి అయిన నేను నేనే' అని శ్రీ శంకరాచార్యస్వామి బ్రహ్మజ్ఞానావళీ మాలలో అసంగ స్వరూపాన్ని కీర్తించారు.

ఇదే నిజమైన అసంగము. అంటే నిద్రలో ఇష్టం లేని స్వప్నం నుండి విడిపడి, మగతలో మరొక ఇష్టమైన స్వప్నం లోకి దూరడము కాదిది. ఇదొక ప్రబుద్ధ దశ. నిద్ర నుండి మేలుకున్న స్థితి. ప్రియాప్రియ స్వప్నాలు రెండిటి నుండి విడిపడి స్వప్న ప్రపంచముతో తనకు ఏ విధమైన సంగత్వము లేదని గ్రహించి అసంగంగా శోభించే అద్వైత స్థితి.

అసంగ శస్త్రముతో అనిత్య సంబంధాలను ఖండించి, సంసార వృక్షాన్ని పెకలించిన తరువాత, అసంగ స్వరూపమును అన్వేషించి పొందే ప్రయత్నం చెయ్యాలి. ఖండించడ మంటే ఏమిటో పూర్వ శ్లోకంలో చూశాము. స్వరూపానుభూతికి చేయ వలసింది ఏమిటో ప్రస్తుత శ్లోకంలో చూస్తాము.

### తక్షణ కర్తవ్యం

***తతః*** అంటూ నాల్గవ శ్లోకాన్ని ఆరంభించాడు ఆదిదేవుడు. ***తతః*** అంటే 'ఆ తరువాత' అని అర్థము (***పశ్చాత్***). ఏ తరువాత? సంసార వృక్షాన్ని సమూలంగా పెకలించిన తరువాత ఏమి చేయాలి? (***కిం కర్తవ్యం?***). తత్పదమును చేరే ప్రయత్నం చేయాలి. 'పదం' అంటే స్థానము. 'తత్పదం' అంటే 'ఆ స్థానము' అని అర్థము.

ఆ స్థానము ఏది? సంసార వృక్షానికి ఏది మూలమై ఊర్ధ్వంగా ఉందో అదే తత్పదము. బీజ భూతమైన బ్రహ్మపదము. దానిని చేరాలి. అది ఎక్కడుంది? దానిని చేరే దెలా? దానిని అన్వేషించి తెలుసుకో మంటున్నాడు (***తత్ పరిమార్గితవ్యం***). పరిమార్గణము అంటే అన్వేషణము అని అర్థము.

ఈ అన్వేషణము ఎక్కడ జరగాలి? ఏ ప్రదేశంలో అన్వేషించాలి? ఏ ప్రదేశంలో అన్వేషించినా, ఆ ప్రదేశము మళ్ళీ సంసార వృక్షంలో ఉన్నదే. అక్కడే తిరుగుతూ దానికి ఆధారమైన ఉన్నత పదమును ఎలా చేరగలము? సృష్టి కార్యం లోనే తిరుగుతూ సృష్టి కారణాన్ని ఎలా దర్శించ గలము? కనుక 'తత్పదము' ఎక్కడుంది? అని 'ఇదం'లో తిరిగితే అది సిద్ధించదు. కనుక, 'ఇదం' వైపుగా ప్రయాణాన్ని ఆపాలి. అందుకే భగవంతుడు పరిమార్గణం అన్నాడు.

బ్రహ్మపదం అనేది అనంత మైనది. పూర్ణ మైనది. అలాంటి దానిని ప్రయత్నించి పొంద లేము. అది కర్మ సాధ్యం కాదు. కనుక దానిని తెలుసుకోవాలి. అది కర్తవ్యానికి సంబంధించింది కాదు; జ్ఞాతవ్యానికి సంబంధించింది. అందుకే అది మార్గంగా కాకుండా పరిమార్గణంగా వర్ణించ బడింది. పరిమార్గణము అనేది అన్వేషణము. కాకపోతే, ఆచారము ద్వారా కాదు, విచారము ద్వారా. అది కర్తవ్యము కాదు, జ్ఞాతవ్యము ***(పరిమార్గణమ్ అన్వేషణం, జ్ఞాతవ్యం ఇత్యర్థః )***. ఇదే శ్రుతి ప్రబోధము. శ్రుతి ప్రమాణము. పరమ పదమును, లేదా బ్రహ్మ పదమును అన్వేషించాలి. అన్వేషించాలి అంటే ఆచరణము కాకుండా విచారణ మార్గంలో అన్వేషించాలి అని వేద ప్రమాణము. ***సోఽ న్వేష్టవ్యః సవిజిజ్ఞాసి తవ్యః*** - దానిని అన్వేషించాలి అంటే, దానిని తెలుసుకోవాలి అన్నది శ్రుతి. ఇక్కడ జ్ఞాతవ్యమే కర్తవ్య మైంది. కర్మ జిజ్ఞాసగా మారింది. కర్మ మాయమై జిజ్ఞాస మార్గ మైంది. అదే పరిమార్గణము.

**జ్ఞాతవ్యమే కర్తవ్యము**

లేని దానిని పొందేందుకు ప్రయత్నం అవసరం. కర్మ అవసరం. కర్మ అంటే చేసేది. కనుక అది కర్తవ్యము. కాని, అనంతమైన బ్రహ్మమును పొందటానికి ఏ కర్మ చెయ్యాలి? ఏ కర్మ చేసినా దానికి ఆద్యంతాలు ఉంటాయి. ఆద్యంతాలు కలిగిన కర్మ యొక్క ఫలం కూడా ఆద్యంతాలు కలిగే ఉంటుంది. అంతమయ్యే కర్మ అనంతమైన ఫలితాన్ని ఎలా ఇస్తుంది? కనుక అనంత స్వరూపమైన బ్రహ్మపదము, లేదా మోక్షము అంతమయ్యే కర్మ యొక్క ఫలం కాలేదు. కర్మఫల మేదైనా నశించేదే కనుక, బ్రహ్మపదము కూడా కర్మఫలమే అయితే, బ్రహ్మపదము కూడా నశిస్తుంది. మోక్షము కూడా నశిస్తుంది అని అర్థము. ***కర్తవ్యేన సాధ్యశ్చేత్ మోక్షః అభ్యుపగమ్యతే అనిత్య ఏవస్యాత్*** - కర్తవ్యం చేత, అంటే కర్మ యొక్క ఫలంగా మోక్షము సాధింప బడితే, అట్టి మోక్షము కూడా అనిత్యమే అవుతుంది అని బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీ శంకరులు నిర్ణయించారు *( 1 - 1 - 4 )*.

బ్రహ్మము అనంతము. అనంతమైన బ్రహ్మపదము పూర్ణమై ఉంది. పూర్ణ మైనది నీకు దూరంగా ఎలా ఉంటుంది? పూర్ణానికి దూరంగా, అన్యంగా నీవు ఎలా ఉండ గలవు? బ్రహ్మపదము పూర్ణము, అనంతము కనుక, నీవు దాని కన్నా వేరుగా లేవు. నీవూ పూర్ణం లోనే ఉన్నావు. నీవే పూర్ణము. నీవే బ్రహ్మము. బ్రహ్మమే అయిన నీవు, బ్రహ్మమును ఎలా పొందుతావు?

'నేను బ్రహ్మము' అనే జ్ఞానము లేక పోవడం చేత మనిషి 'నేను జీవుణ్ణి'; పరిమితుణ్ణి అని భావిస్తున్నాడు. భావించి నంత మాత్రాన అనంత మైనది పరిమితం అవుతుందా? కాదు. పూర్ణం గానే ఉంటుంది. కనుక, ఇప్పుడు చేయ దగింది ఏమిటి? అజ్ఞానాన్ని నిర్మూలించడమే. అజ్ఞానం ఎలా నిర్మూలింప బడుతుంది? దానికి విరుద్ధ మైన జ్ఞానం చేతనే నిర్మూలింప బడుతుంది. మరో మార్గం లేదు. చీకటిని వెలుగు ఎలా పోగొడుతుందో, అవిద్యను విద్య అలా అంత మొందిస్తుంది ***( విద్యా ఽ విద్యాం నిహన్త్యేవ తేజ స్తిమిర సంఘవత్*** - శ్రీ శంకరుల ఆత్మబోధ ).





**శ్రుతి రేవ శరణం**

పూర్ణ బ్రహ్మము కర్తవ్య పరిధి లోనిది కాదని, కేవలం జ్ఞాతవ్యమే నని తేలి పోయింది. మరి, దానిని ఎలా తెలుసుకోవాలి? నీకు నీవుగా తెలుసుకొనే అవకాశమే లేదు. నేను పరిమితుణ్ణి, నశించే వాణ్ణి అని నిర్ధారణ చేసుకున్న వాడే నేను అనంతుణ్ణి, అవినాశిని అని ఎలా తెలుసుకో గలడు? కనుక, తనకు తానుగా తెలుసుకో లేని సత్యం తెలిసిన మరొకడు తెలిపి నపుడే తెలుస్తుంది. ఆ తెలిపే వాడే సద్గురువు. సద్గురువు ఎవరికి లభిస్తాడో వాడికే బ్రహ్మము పూర్ణము అనే జ్ఞానం కలుగుతుంది ***( ఆచార్యవాన్ పురుషో వేద )***. కనుక అట్టి జ్ఞానాన్ని పొందడానికి జిజ్ఞాసువు గురువును ఆశ్రయించాలి ***( తద్విజ్ఞానార్థం సః గురు మేవ అభిగచ్ఛేత్*** - ముండకోపనిషత్తు ). గురువు జ్ఞానాన్ని బోధిస్తాడు. నీవే బ్రహ్మము అని నీకు అర్థమయ్యే లాగా, నిన్ను నీవు దర్శించే లాగా ప్రామాణికంగా ప్రబోధిస్తాడు.

జ్ఞానమును 'ప్రమ' అంటారు. ప్రమాణం ఉన్నప్పుడే ప్రమ కలుగుతుంది. ఇక్కడ బ్రహ్మజ్ఞానము విషయంలో శాస్త్రమే ప్రమాణము. అదే శ్రుతి ప్రమాణము. వేద ప్రమాణము. వేదాంత వాక్య విచారము. దీనినే ప్రమాణ విచారము అంటారు. శాస్త్రమును ప్రమాణంగా గ్రహించి, నీవు బ్రహ్మము అయ్యే ఉన్నావు అనే జ్ఞానాన్ని గురువు ప్రసాదిస్తాడు. ఆ దివ్య ముహూర్తంలో అద్దంలో ముఖాన్ని చూసుకున్నట్లు, శాస్త్ర జ్ఞానంలో ముముక్షువు తనను తాను దర్శించు కుంటాడు. తానే ఆత్మ. ఆత్మయే బ్రహ్మము అనే అపరోక్ష జ్ఞానాన్ని పొందుతాడు ***( దర్పణే ముఖ దర్శనవత్ శాస్త్రే ఆత్మ దర్శనం )***. ఈ విధంగా బ్రహ్మపదం జ్ఞాతవ్యం. అందుకే ***పరిమార్గితవ్యం*** అన్నాడు. ***పరి*** అనే పదము ప్రమాణమైన శాస్త్రమును ప్రతిపాదించడానికి వాడ బడింది. ***పరిమార్గితవ్యం*** అంటే ప్రమాణ విచారం ద్వారా బ్రహ్మమును అన్వేషించాలి అని అర్థము. ఇది జ్ఞాన మార్గము. సూటి యైన రాజమార్గము.

కనుక విషయ త్యాగము, సంగత్యాగము జరిగి అసంగ బుద్ధి ఏర్పడిన తరువాత, నిశ్చలమైన, నిర్మల మైన బుద్ధితో శ్రవణం చెయ్యాలి. కనుకనే సంగత్యాగము తరువాతే శ్రవణం చెయ్యాలి అనే నియమాన్ని విధించింది శాస్త్రం ***( సన్న్యస్య శ్రవణం కుర్యాత్ )***. కనుక, మోక్షం జ్ఞాన రూపంలో ఉన్నందున, జ్ఞానము వల్లనే మోక్షము ప్రాప్తిస్తుంది. అదే బ్రహ్మపదము. ఆ బ్రహ్మపదము ఎలాంటిదో కూడా చెబుతున్నాడు.

**తత్పదము - పరమ పదము**

అన్వేషించి పొంద దగిన ఆ పద మేమిటో చెబుతున్నాడు ***( తత్పదం )***. సంసార వృక్షానికి మూలంగా ఏది ఊర్ధ్వ మని చెప్పబడిందో అదే పదము ***( తత్ పదమ్ )***. ఇక్కడ 'పదము' అంటే మోక్షము అని అర్థము. ***పద్యతే గమ్యతే ముముక్షుభిః ఇతి పదమ్*** - మోక్షమును కోరే ముముక్షువులు పొందేది పదము. దీనినే పరమపదము అంటారు. అంటే అంతకంటే ఉత్కృష్టమైన స్థానము లేదు అని అర్థం. కనుక అది పరమపదము ***( యస్మాత్ ఉత్కృష్టం నాస్తి తత్ పరమపదం )***. దేనిని చేరిన తరువాత మళ్ళీ తిరిగి రారో, అదే ***పదం*** శబ్దము చేత చెప్ప బడింది. అంటే, ఏ బ్రహ్మమును చేరిన తరువాత తిరిగి మళ్ళీ సంసార వృక్ష ఛాయ లోకి రారో, అదే బ్రహ్మ పదము ***( యస్మిన్ పదే గతాః ప్రవిష్టాః న నివర్తన్తే న ఆవర్తన్తే భూయః పునః సంసారాయ )***. అది తిరిగి రాని పోక. అదే పరమపదం.

అందుకనే మన సంస్కృతిలో మరణించిన వారిని పరమపదించారు అంటారు. అంటే, వాళ్ళు పరమ పదమును, లేదా మోక్షమును పొందారని అర్థము. వాళ్ళు మోక్షాన్ని పొందారో లేదో చెప్పే వారికి తెలుసా?

తెలియదు. కాకపోతే, వారు మోక్షాన్ని పొందాలి అనేది ఆకాంక్ష. మోక్షాన్ని పొందడమే అందరి జీవిత లక్ష్యం కావడం చేత అందరికీ లక్ష్య సిద్ధి ప్రాప్తించాలనే పవిత్ర ఆకాంక్ష. అంతే.

పదం, ధామం అనేవి వేదం లోని పవిత్రమైన పదాలు. పరమపదము, పరంధామము అనేవి జీవి గమ్యాన్ని నిర్దేశించే ప్రమాణ వచనాలు. 'పదం' అన్నా 'ధామం' అన్నా చోటు, లేదా స్థానము అని అర్థము. దానినే 'అయనం' అని కూడా అంటారు. 'పరాయణం' అనే పేరు పరమాత్మకు అలాగే వచ్చింది. 'పరం' అంటే ఉత్కృష్టమైన, 'అయనం' అంటే స్థానము అని అర్థము (***పరం ఉత్కృష్టం అయనం, స్థానం పునరావృత్తి శంకా రహితం ఇతి పరాయణమ్***). ప్రతి ఒక్కరు పొంద వలసిన ఉత్కృష్టమైన పదము పరాయణము. అదే బ్రహ్మపదము. అది సాధారణ గమ్యాల వంటిది కాదు. దేనిని పొందిన తరువాత తిరిగి రావడం అంటూ ఉండదో, మరొకటి పొందాలి అనే వాంఛ కలగదో, అదే పరాయణము. పరమాత్మ స్థానము. బ్రహ్మపదము. పరమపదము. ఏ స్థానమును, లేదా గమ్యమును చేరిన తరువాత తిరిగి రావడ మంటూ ఉండదో, అదే మోక్షపదము. భగవంతుడు ప్రస్తుత శ్లోకంలో అదే చెబుతున్నాడు.

## వెను దిరగని వెన్నుని నిలయము

పరబ్రహ్మ స్థానమే పరమ పదము. ఏ స్థానమును చేరిన తరువాత తిరిగి మళ్ళీ సంసారంలో ప్రవేశించడం జరగదో అదే పరమ పదము. దానినే విష్ణుదేవుని మందిరంగా వేదం అభివర్ణించింది (***తద్విష్ణోః పరమం పదం***).

ఇక్కడ ఒక్క విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి. ఒక స్థానమును చేరడము అంటే, సాధారణంగా ఒక ప్రదేశాన్ని ఒక కాలంలో చేరడము అని మనం అర్థం చేసుకుంటూ ఉంటాం. అందుకనే, పయనము, గమ్యము అనే మాటలు చెవిన పడగానే వెంటనే దేశకాలాదులు తల లెత్తుతాయి. కనుకనే, ఎక్కడికి పోయినా, ఎవరు పోయినా, తిరిగి రావడం అనేది సహజం గానే ఉంటుంది.

పిల్లలు బడికి పోతారు, తిరిగి ఇంటికి చేరుతారు. పెద్దలు కార్యాలయాలకు వెళ్తారు. వెళ్ళినట్లే తిరిగి ఇంటికి చేరుతారు. సంచి పట్టుకొని తిరుపతికి వెళ్తారు. దర్శనమైన తరువాత సంచిలో లడ్డు ప్రసాదం పెట్టుకొని తిరిగి ఇంటికి చేరుతారు. మరణించి కొందరు స్వర్గానికి పోతారు. పుణ్యం క్షీణించ గానే తిరిగి మళ్ళీ భూలోకానికి చేరుతారు. మెట్లెక్కిన వాళ్ళు మెట్లు దిగుతారు. చెట్లెక్కిన వాళ్ళు చెట్లు దిగుతారు. లోని కెళ్ళిన వాళ్ళు బయటి కొస్తారు. అన్నీ ఇలాగే ఉంటాయి. ఇలాంటి వ్యర్థ ప్రయాణాలు తెలియని, అనర్థ ప్రమాణాలు అందుకోలేని దివ్య ధామమే తత్పదము. వేదం చెప్పిన పరమ పదం. పరంధామం. పరాయణం. అది రాక తెలియని పోక. తిరుగు లేని, తిరిగి రాని పోక (***యస్మిన్ గతా న నివర్తన్తి***).

పరమేశ్వరుని ధామమే పరంధామము. పరబ్రహ్మ స్థానమే బ్రహ్మపదము. బ్రహ్మ మేమిటో అర్థమైతే, బ్రహ్మపదము అనేది ఎక్కడుందో తెలుస్తుంది.

సృష్టి పరమేశ్వరుని నుండి ఆవిర్భవించింది. సృష్టి కార్యానికి బ్రహ్మము అభిన్న నిమిత్త ఉపాదాన కారణం కావడం చేత, సృష్టి పరమాత్మ కన్నా అన్యంగా లేదు. ఉండ లేదు. సృష్టి రూపంలో పరమాత్మే ఉన్నాడు. సృష్టి ఎక్కడుందో సృష్టికర్త అక్కడే ఉన్నాడు. సృష్టి లేకపోయినా సృష్టికర్త పరబ్రహ్మముగా తన స్వరూపంలో తాను దివ్యంగా భాసిస్తూ ఉంటాడు. అదే ఆదిదేవుని అనంత వైభవం.

బ్రహ్మము అనంత మని ఇప్పటికే పదే పదే చెప్పుకున్నాం. అనంత మైనది ఒక ప్రదేశానికి పరిమితంగా ఉంటుందా? ఒక కాలానికి నియమితమై ఉంటుందా? అనంత మనేది అద్వయము. పూర్ణము. అలాంటిది లేని





చోటే లేదు. అది లేని కాలమే ఉండదు. దేశకాలాదులు దానిని ఆశ్రయించుకునే అగుపిస్తాయి. దేశకాలాదులు లేక పోయినా అది అద్వయ సత్తా స్వరూపంగా ఉంటుంది. అదే అనంతము, పూర్ణము. ఈ పూర్ణము ఎవడికి కలుగుతుందో వాడు తానే పూర్ణ మని తెలుసుకుంటాడు. తానే అనంత మనే అనుభూతిలో ఉంటాడు. ఈ జ్ఞానం లేక ముందు ఆ ప్రదేశాన్ని చేరాలనే ప్రయత్నంలో సాధకుడుగా అగుపించిన వాడు, జ్ఞానము ప్రాప్తించ గానే తాను చేరే ఉన్నాడని, దానిని పొందే ఉన్నాడని, సిద్ధు డయ్యే ఉన్నాడనే జ్ఞానంతో విరాజిల్లుతాడు. జ్ఞానము కలగనంత వరకు బ్రహ్మవిదుడుగా తెలిసిన వాడు జ్ఞానము లభించ గానే, తానే బ్రహ్మ మనే భావనలో ఉంటాడు. ***బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి*** - ఈ విధంగా బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానమును పొందిన వాడు బ్రహ్మమే అగు చున్నాడు. ***బ్రహ్మవి దాప్నోతి పరం*** - బ్రహ్మవిదుడు పరంధామమును పొందుతున్నాడు. బ్రహ్మపదమును పొందుతున్నాడు. తానే బ్రహ్మముగా శోభిస్తున్నాడు అన్నది తైత్తిరీయ శ్రుతి.

## ఆకాంక్ష - ఆశ్రయము

అట్టి పరబ్రహ్మమును ఆశ్రయించాలి. ఆదిదేవుడు (***ఆద్యం***), ఆదిపురుషుడు (***పురుషం***), అనాది అయిన సంసార వృక్షము ఏ దివ్యాత్ముని నుండి విస్తరించినదో (***యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ***) అట్టి పరమాత్మనే (***తం***) ఆశ్రయిస్తాను; శరణు పొందుతాను (***ప్రపద్యే***) అనే భావనతో పరమాత్మను అన్వేషించాలి (***పరిమార్గితవ్యం***) అంటున్నాడు.

జ్ఞానాన్ని పొందాలి అంటే జ్ఞానాన్నే ఆశ్రయించాలి. పరమాత్మను పొందాలంటే ఎవరినో, దేనినో ఆశ్రయిస్తే ఉపయోగం లేదు. పరమాత్మనే ఆశ్రయించాలి. అందుకు ఉన్నతమైన, ఉత్కృష్టమైన సాధన భక్తి. సదా పరమేశ్వరుని యందే ఆసక్తిని కలిగి అన్య మెరుగని భక్తి. అనన్య భక్తి (***సా పరానురక్తి రీశ్వరే*** - శాండిల్య భక్తి సూత్రము).

పద్నాల్గవ అధ్యాయాన్ని సమాప్తం చేస్తూ, ఎవడైతే భగవంతుని అచంచలమైన భక్తితో సేవిస్తాడో, వాడు త్రిగుణాలను అతిక్రమించి బ్రహ్మత్వానికి, లేదా మోక్షానికి అర్హుడగు చున్నాడు అని పరమేశ్వరుడు బోధించాడు (*14 వ అ - 26 వ శ్లో*).

బ్రహ్మత్వమును పొందడ మనేది సులభ సాధ్యమైన కార్యం కాదు. పరమేశ్వరుని అనుగ్రహం లేకుండా అది సాధ్యం కాదు. ఈశ్వర కృప లేకపోతే, తాత్త్విక ఆలోచనే రాదని అభిప్రాయ పడ్డాడు దత్తాత్రేయుడు (***ఈశ్వరానుగ్రహాత్ ఏవ పుంసాం అద్వైత వాసనా*** - *అవధూత గీత*).

ప్రపంచం మీద విరక్తి రానిదే పరమాత్మపై ఆసక్తి జనించదు. ఆసక్తి లేని వారికి భక్తి ఎలా కుదురు తుంది? అందుకనే సంసారంపై విరక్తి జనించడానికి, వైరాగ్యం అంకురించడానికి పదిహేనవ అధ్యాయం ప్రారంభం లోనే వృక్ష రూప కల్పన చేత సంసార వృక్షాన్ని వర్ణించడం జరిగింది. భగవత్తత్త్వం విషయంలో అధికారి కావాలంటే వైరాగ్యమే ప్రధాన కారణం కనుక, మొదటి మూడు శ్లోకాలలో వైరాగ్యానికి హేతువైన సంసార వృక్షాన్ని అసమానంగా వర్ణించాడు గీతాచార్యుడు (***వైరాగ్య హేతోః సంసార స్వరూపం వర్ణయతే***).

భక్తికి కారణమైన వైరాగ్యాన్ని సంపూర్ణంగా వివరించిన తరువాత, పరబ్రహ్మ మైన పురుషోత్తముని స్వరూప వైభవాన్ని వర్ణించేందుకు ఉపక్రమిస్తున్న సమయంలో పద్నాల్గవ అధ్యాయాంత శ్లోకద్వయాన్ని పది హేనవ అధ్యాయారంభ శ్లోక త్రయాన్ని దృష్టిలో ఉంచుకొని 'ప్రపద్యే' అనే శరణాగత సూచకమైన భక్తి భావ పదాన్ని భగవంతుడు భావగర్భితంగా ప్రయోగించాడు.

ఎవరు ఎంత బోధించినా, ఎవరికి ఎంత ప్రజ్ఞ ఉన్నా, మహిమాన్వితుడైన పరమాత్మను మాటల్లో మడత

పెట్టడం గాని, మనస్సు లోకి మరలించు కోవడం గాని సాధ్యం కాదు. అనంతుణ్ణి వశం చేసుకొనే టంతటి అనంత శక్తిమంతులం మనం కాము. శక్తి చాలని చోట, యుక్తి చేరని చోట భక్తి ఒక్కటే నిరంజనమై శోభిస్తుంది. అందుకే పరమాత్మను ఆశ్రయించాలి. ఆర్తితో సేవిస్తూ, అవగాహనను పెంపొందించుకొని, అద్వైత జ్ఞానాన్ని పొంది తరించాలి. సంసార మూలమై, ఊర్ధ్వంగా భాసిస్తున్న బ్రహ్మ పదమును బ్రహ్మ జ్ఞానము ద్వారా సొంతం చేసుకోవాలి.

మహాభక్తుడు కావడం చేతనే, ప్రహ్లాదునికి ***ఇందు గల దందు లేదని సందేహము వలదు, చక్రి సర్వోప గతుండు*** అనే అద్వైత జ్ఞానము కలిగింది. భక్తి లేకుండా జ్ఞానాన్ని పొందట మనేది గుఱ్ఱం ముందు బండి నుంచి, దానిలో పయనించి గమ్యం చేరే ప్రయత్నం లాంటిది.

వ్యాస భాగవతంలో అద్వైతానుభవ ప్రాప్తికి ప్రహ్లాదుడు వ్యక్తం చేసిన భావము ఎప్పుడూ నా బుద్ధిలో అఖండ దీపంలా వెలుగుతూ ఉంటుంది. అద్వైత మార్గానుయాయులకు భక్తేమిటి? అని ఎవరైనా వ్యాఖ్యానించి నపుడు ఈ శ్లోకము నా మనస్సులో అల లాగా కదులుతుంది.

**శ్లో॥ స యదానువృతః పుంసాం పశుబుద్ధి ర్విభిద్యతే,**
**అన్య ఏష తదాన్యోఽ హ మితి భేద గతా సతీ ॥**

ఎవరికి ఎప్పుడు భగవంతుడు అనుకూలంగా ఉంటాడో (***అనువృతః***), అప్పుడే అతడు వేరు - నేను వేరు అనే భేద బుద్ధి నశించి, అద్వైత భావన ఏర్పడుతుంది అన్నాడు ప్రహ్లాదుడు.

ప్రహ్లాదుడు భక్తిలో సామాన్యుడా? జ్ఞానంలో సామాన్యుడా? అనిర్వచనీయ మైన భక్తి ద్వారా శ్రీహరి ఓడ నెక్కిన పరమ భాగవతోత్తముడు, అఖండమైన అద్వైత జ్ఞానం చేత అద్వితీయ పరబ్రహ్మముగా శోభించిన ప్రహ్లాదుని పవిత్ర వాక్కుల కంటే ప్రమాణ మేముంది? భక్తి నావలో పయనించిన వారే జ్ఞాన గమ్యాన్ని చేరుతారు. ఈ సత్యాన్ని పోతనామాత్యుని ఆంధ్రభాగవతము అత్యద్భుతంగా, ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న శ్లోకానికి వ్యాఖ్యానమా అన్నట్లుగా ప్రవచించింది.

**శ్లో॥ సంసార జీమూత సంఘంబు విచ్చునే చక్రి దాస్య ప్రభంజనము లేక**
**తాపత్రయా భీల దావాగ్ను లాఱునే విష్ణుసేవామృత వృష్టి లేక**
**సర్వం కషాఘౌఘ జలరాసు లింకునే హరి మనీషా బడబాగ్ని లేక**
**ఘన విపద్గాఢాంధ కారంబు లడగునే పద్మాక్ష నుతి రవి ప్రభలు లేక**
**తే॥ నిరుపమా పునరావృత్తి నిష్కళంక ముక్తి నిధిఁ గానవచ్చునే ముఖ్యమైన**
**శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక తామరస గర్భునకు నైన దానవేంద్ర।**

తండ్రీ! దానవేశ్వరా! గొప్ప వాయు ప్రభంజనము లేకుండా కారుమబ్బుల గుంపులు ఎలా చెదరవో, చక్రధారి శ్రీమహావిష్ణువు సేవ లేకుండా సంసార మేఘాలు కూడా తొలగవు.

అరణ్యాలలో రగుల్కొన్న దావానలం వర్షాలు పడక పోతే ఎలా చల్లారదో, శ్రీహరి సేవామృత ధారలు వర్షించ కుండా తాపత్రయాలనే కార్చిచ్చు ఆరదు.

భయంకరంగా ప్రజ్వరిల్లిన బడబాగ్ని లేకుండా సాగర జలాలు ఇంకి పోవడం ఎలా జరగదో, విష్ణుసేవ అనే ప్రళయాగ్ని ప్రజ్వరిల్లనిదే పాప సముద్రాలు కూడా ఇంకిపోవు.

సూర్యకాంతి లేనిదే తిమిరాలు తొలగనట్లు, కేశవ కీర్తన మనే రవికిరణాలు ప్రసరించకుండా అలుముకున్న ఆపదలు అదృశ్యం కావు.





చివరగా, హరిభక్తి అనే జ్ఞానాంజనము లేకుండా నిర్మలమై, నిరుపమానమై, పునరావృత్తి లేని పదమును, పునర్జన్మ లేని మోక్ష ధామమును చేరడం (***యస్మిన్ గతా న నివర్తన్తి భూయః తత్ పదం***) బ్రహ్మదేవునికి కూడా సాధ్యం కాదు అని అనుభవామృతాన్ని వర్షింప చేశాడు భక్త ప్రహ్లాద కుమారుడు.

**ఆదిదేవుడే శరణ్యము**

అచంచల మైన భక్తి చేత ఏ దివ్యాత్ముని ఆశ్రయిస్తే, అతని అనుగ్రహం చేత బ్రహ్మపదము ప్రాప్తి స్తుందో, అతడు ఎలాంటి వాడో కూడా తెలియ చేస్తున్నాడు. అతడు ఆద్యపురుషుడు. పురాతనుడు (***ఆద్యం ఆదౌ భవం ఆద్యం***), అంటే ఆది నుండి ఉన్నవాడు అని అర్థము.

జగత్తుకు ఆద్యంతా లున్నాయి. నిజమే. ఆ విషయం తెలిసిం దెవరికి? జగత్తు లోని వారి కెవ్వరికీ తెలిసే అవకాశమే లేదు. జగత్తు విలీనం కాగానే, జగత్తు లోని సర్వ ప్రాణులు విలీన మవుతారు. తిరిగి అవ్యక్తం నుండి జగత్తు వ్యక్తమైన తరువాతే లయమైన జీవులు పునః జీవిస్తారు. కనుక జగత్తు యొక్క ఆద్యంతాలను జగత్తు లోని జీవులు చూడ లేరు ( మార్కండేయుని ప్రసక్తి అరుదైన విషయం. అది కూడా ఈశ్వరానుగ్రహం వల్లనే మార్కండేయ మహర్షి ప్రళయాన్ని దర్శించాడు) .

ఎవరికి ఆద్యంతాలు లేవో, జగత్తు యొక్క ఆద్యంతాలను ఎవడు సాక్షిగా వీక్షించాడో అతడికే సృష్టి యొక్క ఆద్యంతాలు తెలుసు. అంటే, జగత్తు యొక్క ఆరంభము లోనే తాను ఉన్నాడు. కనుక అతడు 'ఆద్యం'. ఆద్యపురుషుడు. ఆదినారాయణుడు. ***త్వమాది రన్తో జగతోఽ స్య మధ్యమ్*** - 'హే భగవాన్! ఈ జగత్తుకు (***అస్య జగతః***), నీవు (***త్వం***) ఆదివి (***ఆదిః***), అంతానివి (***అంతః***), మధ్య నున్న వాడివి కూడా (***మధ్యమ్***) అని వ్యాస భాగవతము.

ఆద్యుడైన భగవానుని పురుషుడు అంటున్నాడు (***పురుషం***). ఈ సందర్భములో 'పురుష' పద ప్రయోగము గంభీరమైన భావంతో కూడుకొని ఉంది. ఆద్యుడు అనే పదాన్ని దేనిని సూచించడానికి ప్రయోగించాడో, పురుష శబ్దమును కూడా అదే ఉద్దేశముతో ప్రయోగించాడు. అంతేకాదు. ఒకే అర్థాన్ని సూచిస్తూ రెండు పదాలను ప్రత్యేక స్పృహతో పలికాడు.

ఆద్యు డంటే ఆది యందు, సృష్ట్యాది యందు ఉన్న వాడని అర్థం చేసుకున్నాం. పురుష శబ్దానికి కూడా ఇక్కడ అదే అర్థం. ***పురా ఏవ ఆసీత్ ఇతి పురుషః***. ఏదీ లేక ముందు, ఏదీ రాక ముందు ఏకమై, అద్వితీయంగా ఎవడు భాసించాడో, అతడే పురుషుడు. కనుకనే ఆద్యుడు. కనుకనే అతని నుండే సంసార వృక్షము ఆవిర్భవించింది అని కూడా ప్రస్తుత శ్లోకం లోనే చెప్పడం జరిగింది (***యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ***). మరి, పురుష శబ్ద ప్రయోగం లోని వైశిష్ట్య మేమిటి?

ఎవరి నుండి సృష్టి ఆవిర్భవించిందో, ఎవరి ధామమును పొందితే తిరిగి సంసారంలో పడటం జరగదో, అట్టి ఆద్యుడు, పురుషుడు అయిన వాని ధామమును (***తత్ పదం***) అన్వేషించడానికి, లేదా తెలుసుకోవడానికి (***పరిమార్గణం***) అతడిని ఆశ్రయిస్తాను, లేదా ఆశ్రయించి పొందుతాను (***ప్రపద్యే***) అంటున్నాడు.

ఎక్కడ అన్వేషిస్తాడు? ఎలా తెలుసుకుంటాడు? పురుషుడుగా తెలుసుకుంటాడు. ***పురం శరీరమ్, తస్మిన్ శేతే ఇతి పురుషః*** - పురం అంటే శరీరము. శరీరములో శయనించి ఉన్నవాడు పురుషుడు. క్షేత్రజ్ఞుడు. కనుక, క్షేత్రంలో శయనించి ఉన్న పురుషుడే క్షీరసాగరంలో శయనించి ఉన్న పురుషోత్తముడు. జీవుడే దేవుడు అని తెలుసుకుంటాడు. జ్ఞాన చక్షువుతో సత్యాన్ని దర్శిస్తాడు. ***అయమాత్మా బ్రహ్మ*** - ఈ ఆత్మయే బ్రహ్మ అనే

మహావాక్యానుభూతిలో తన్మయు డవుతాడు. శ్లోక సారమైన కేంద్ర విషయాన్ని సుస్పష్టం చేయడానికే పురుష శబ్ద ప్రయోగం చేశాడు.

మరి, అట్టి దివ్య ధామమును ఎవరు చేరుతారు? చెబుతున్నాడు.

**నిర్మానమోహా జితసఙ్గదోషా: అధ్యాత్మనిత్యా వినివృత్త కామా: ।**
**ద్వన్ద్వై ర్విముక్తా: సుఖదుఃఖ సంజ్ఞై ర్గచ్ఛ న్త్యమూఢా: పద మవ్యయం తత్ ॥ 5**

*నిర్మానమోహాః-జితసంగదోషాః-అధ్యాత్మనిత్యాః-వినివృత్త కామాః*
*ద్వంద్వైః-విముక్తాః-సుఖదుఃఖ సంజ్ఞైః-గచ్ఛంతి-అమూఢాః-పదం-అవ్యయం-తత్*

| | | | |
|---|---|---|---|
| నిర్మానమోహాః | = అభిమానము, మోహము లేని వారు | విముక్తాః | = విముక్తులు |
| జితసంగదోషాః | = సంగత్వ దోషమును జయించిన వారు | అమూఢాః | = మోహం లేనివారు |
| అధ్యాత్మ నిత్యాః | = ఆత్మ చింతనాపరులు | అవ్యయం | = నశించని |
| వినివృత్త కామాః | = కామములు పూర్తిగా తొలగిన వారు | తత్ | = ఆ |
| సుఖదుఃఖసంజ్ఞైః | = సుఖదుఃఖ రూపాలైన | పదం | = పదమును |
| ద్వంద్వైః | = ద్వంద్వముల చేత | గచ్ఛంతి | = చేరుతారు |

**అర్జునా! మోహాభిమానాలు తొలగిన వారు, సంగత్వ దోషం లేని వారు, సదా ఆత్మ చింతనాపరులు, కోరికలు లేని వారు, సుఖదుఃఖ రూపాలైన ద్వంద్వాలను దాటిన వారు, మోహం లేని మహాత్ములు అవ్యయమైన మోక్షమును పొందుతారు.**

### వ్యాఖ్య

అచంచలమైన భక్తితో భగవంతుని సేవించిన వారు గుణాతీతులై బ్రహ్మత్వానికి అర్హు లవుతున్నారు. అట్టి వారు తీవ్ర వైరాగ్యవంతులై జ్ఞానమార్గంలో బ్రహ్మపదమును అన్వేషిస్తున్నారు. వారి సాధన ఏ అవాంతరాలు లేకుండా, ప్రతిబంధకాలు రాకుండా నదీ ప్రవాహం లాగా (***స్రోతసాసమం***) సాగాలి అంటే దానికి అవసరమైన అర్హతలను, లక్షణాలను ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు. ఈ సాధనాంతరాలను రెండవ అధ్యాయం లోను, పన్నెండవ అధ్యాయం లోను, పదమూడవ అధ్యాయం లోను సవిస్తరంగా వివరించాడు. వాటినే క్రోడీకరించి, ఒక్క శ్లోకంలో ఇక్కడ వివరిస్తున్నాడు. అదే ఈ అయిదవ శ్లోకము. బ్రహ్మపదమును పొందాలని ఆశించే వారికి ఉండ వలసిన ఐదు లక్షణాలను ఈ ఐదవ శ్లోకంలో వివరిస్తున్నాడు.

**నిర్మాన మోహులు**

మానము, మోహము తొలగిన వారు నిర్మానమోహులు. అంటే, మాన మోహాలు లేని వాళ్ళు. మానము అంటే అభిమానము. అహంకారానికి ప్రతిరూపము. మోహము అంటే అవివేకము, లేక విపర్యయము. అహంకార అవివేకాల నుండి విడిపడిన వారు నిర్మానమోహులు.

మిథ్యారూపము లైన దేహేంద్రియాల యందు 'నేను' అనే అభినివేశముతో కూడిన అహంభావనే మానము. తాను కాని దానిని తానుగా భావించి, దానిని తన గొప్పతనముగా సంభావించుకొని, తనను తాను గౌరవించుకొనే మానసిక స్థితి అభిమానము. అదే మానము (***ఆత్మానం మానయతీతి మానః***).





కొందరికి ఐశ్వర్యం ఉందనే అభిమానము. ఇది ధనాభిమానం. తన కులం గొప్పదని కొందరు పొంగిపోతూ ఉంటారు. ఇది కులాభిమానం. కొందరిలో దానధర్మాది ఔదార్యపు లక్షణాలు ఉంటాయి. అలాంటి వారు గుణాభిమానంతో ఊగిపోతూ ఉంటారు. కొందరిలో ప్రజ్ఞా విశేషము ఉంటుంది. అలాంటి వారు జ్ఞానాభిమానంతో ఆకాశాన్ని చూస్తూ ఉంటారు. కొందరు తాము అందంగా ఉన్నామని మురిసిపోతూ తమను తాము స్తుతించుకుంటూ ఉంటారు. ఇది రూపాభిమానం. మరొక విచిత్రమైన అభిమానం ఉంది. 'నాకు అభిమానం లేదు' అని భావించుకొని, కనిపించిన ప్రతి ఒక్కరికి పని కట్టుకొని చెబుతూ ఉండటం. వీటన్నిటి వెనుక అదృశ్యంగా అహంకారమే ఉంటుంది.

అభిమానం కల వారు వారిని వారు పూజించు కోవడమే గాక, ఇతరులు తమను గుర్తించాలని, గౌరవించాలని తహతహ లాడుతూ ఉంటారు (***మాన పూజాయామ్***). ఈ దౌర్భాగ్యపు చిత్తవృత్తినే వృత్తిగా పెట్టుకొని, ప్రవృత్తిగా మార్చుకొని పరితపిస్తూ శ్రమిస్తుంటారు. ఎలాగైనా ప్రజల దృష్టిలో తాము పడాలి. టెలివిజన్లలో, వార్తా పత్రికలలో, సభా వేదికల మీద ఇలాంటి వారి అభినయాలు, అర్థరహిత అభిభాషణలే మెండుగా కనిపిస్తుంటాయి. విచిత్రమైన ఈ పోకడల వెనుక ప్రజలు తమను గుర్తించాలని, గౌరవించాలనే నీచ గుణమే ఉంటుంది. దీనికి ఫలితం ఏమిటి? ప్రజలు గుర్తిస్తారు. కాని, గౌరవించరు. పైగా అవహేళనంతో, అనాదరంతో వీక్షిస్తుంటారు. అయినా, అభిమానం కల వారు అలాంటివేవి పట్టించుకోరు. అవసరమైతే ఇంకా విపరీతంగా విజృంభిస్తారు. పాడ్యమి పాడైనా విదియ విజయాన్ని అందించక పోతుందా అనే వల్లమాలిన ఆశతో బ్రతుకు తుంటారు.

వీరి దీనత్వం ఎంత దూరం పోతుందంటే, పూజార్హులైన వారి సన్నిధిలో కూడా తమను తాము పొగుడుకుంటూ గొప్పలు చెప్పుకొనే దుస్థితికి దిగజారుతుంది (***ప్రణతి యోగ్యేషు ఉన్నతి కథనం వా మానః***).

అభిమానం విషయంలో ప్రధానంగా మనం అర్థం చేసుకోవలసిన విషయం ఒకటుంది. ఎవరి కైతే తమపై తమకు గౌరవము ఉండదో, ఉండినా సందేహాస్పదంగా ఉంటుందో, అలాంటి వారే ఇతరుల నుండి గౌరవాలను ఆశిస్తారు. అదేమంటే, ఆత్మగౌరవం అంటారు. ఆత్మను తెలుసుకుంటే మనిషి గౌరవింప బడతాడు గాని, ఆత్మాభిమానం అనే మాయా ప్రదర్శనలకు గౌరవాలు లభిస్తాయా? లభించినా నిలుస్తాయా?

రాగాత్మకము, ఆశా రూపమైన ఈ అభిమానము రజోగుణ లక్షణము. ఇది జీవులను కర్మచక్రంలో పడేసి బంధిస్తుందే గాని సాధనలో ముందుకు సాగ నివ్వదు (***తన్ని బధ్నాతి కౌన్తేయ కర్మ సంగేన దేహినమ్ - 14 వ అ - 7 వ శ్లో***). రజోగుణ సంభవమైన ఈ అభిమానంలో పడి అలమటించే వారు ఆనందానికి దూరం కావడమే గాక బాధాపూరిత జీవితాల్ని కొనసాగిస్తూ ఉంటారు (***రజస స్తు ఫలం దుఃఖం***).

అభిమానము రజోగుణ విశేష మైతే, మోహము తమోగుణ విశేషము. అనాత్మ యందు ఆత్మబుద్ధికి కారణ మైంది మోహమే. అదే అవివేకము. వాస్తవంగా లేని సౌందర్యాన్ని, లేని వైభవాన్ని ఆరోపించి చూడటం మోహం. దీనినే శోభనాధ్యాస అంటారు. విపర్యయ జ్ఞాన మంటే ఇదే. ఈ విధమైన అవివేకము ఆత్మ పరిమార్గణంలో గొప్ప ప్రతిబంధకము అని ప్రత్యేకించి చెప్పాలా! అనాత్మను ఆత్మగా అవలోకించే వారు ఆత్మానుభూతిని ఎలా పొందగలరు? కనుక, బ్రహ్మపదమును చేరేందుకు ప్రయత్నించే ముముక్షువులు ముందుగా ఈ మానమోహాల నుండి నిర్గతులై నిర్మానమోహులు కావాలి (***మానశ్చ మోహశ్చ మాన మోహౌ, తౌ నిర్గతౌ యేభ్యః తే నిర్మాన మోహాః***).

## జితసంగ దోషులు

విషయాల యందలి ఆసక్తియే సంగము. సంగము అనేదే ఒక దోషము. దోషగుణము *(సంగ ఏవ దోషః సంగ దోషః)*. ఈ సంగదోషమును ఎవరైతే జయిస్తారో వారు జితసంగులు. జితసంగ దోషులు *(జితః సంగ దోషః యైః తే జిత సంగదోషాః)*.

సంగత్వానికి సంబంధించిన సంగతి చాలా విచిత్ర మైంది. మనకు దేనితో సంగత్వ ముందో, ఎవరితో సంగత్వ ముందో అర్థమే కాదు. అంటే, సంగత్వం లేదని కాదు. ఉన్నా, ఉన్నట్లు తెలియదు. ఉన్నప్పుడు ఉన్నట్లు అర్థం కానిది, దూర మైనపుడు మనస్సుకు దగ్గరై, ఊహించని రీతిల్లో మనస్సును దుమ్ము రేపుతుంది.

ఇలా బాధ పెట్టడానికే నన్ను అంటి పెట్టుకున్నాయా? ఇలా దుఃఖ పెట్టడానికే నాతో కలిసి జీవించారా? అనే ఆక్రందనలు ఏవి దూర మైనపుడు మన నుండి వినిపిస్తాయో, ఎవరు దగ్గర లేకపోతే మనస్సు ఆక్రోశిస్తుందో, వాటిపై, లేదా వారిపై మనకు అత్యాసక్తి ఉంది అని అర్థ మవుతుంది. అదే సంగము. మనస్సును కలతపెట్టే దోషము. ఈ సంగదోషాన్ని ఎవరు జయిస్తారో వాళ్ళే జితసంగ దోషులు.

సంగత్వాన్ని విడిచి పెట్టమని చెప్పకుండా జయించ మంటున్నాడు. జయము అనే మాట ఎప్పుడు విన పడుతుంది? పోరాటం ఉంటేనే. అపజయానికి అవకాశ మున్నప్పుడే. కనుక, విషయ సంగం గాని, కర్మసంగం గాని, మమత్వ సంగం గాని, కర్తృత్వ సంగం గాని సునాయాసంగా లోబడేవి కావు అనే ధ్వని 'జిత' పద ప్రయోగంలో వినిపిస్తూ ఉంది. అభ్యర్థితో ప్రత్యర్థి పోరాడినట్లు నిరంతరము మనల్ని ముంచే ప్రయత్నం లోనే సంగత్వం ఉంటుంది కనుక, ఎలాగైనా దానిని జయించి, సంగత్వము మీద విజయం సాధించిన వారే జితసంగ దోషులు. వారే బ్రహ్మపదము వైపు ప్రశాంతంగా పయనిస్తారు.

## అధ్యాత్మ నిత్యులు

అధ్యాత్మము అంటే ఆత్మజ్ఞానము. పరమాత్మ జ్ఞానము. అట్టి జ్ఞానము నందు నిత్యులు, నిరతులు, నిలుకడ కలిగిన వారు అధ్యాత్మ నిత్యులు. పరమాత్మ జ్ఞానానికి సంబంధించిన విషయాలను చింతించడం లోనే ఆసక్తి కలవారు. భగవ ద్విషయము నందే శ్రవణ నిష్ఠ కలవారు. శ్రవణ తత్పరులు. చింతనా తత్పరులు *(అధ్యాత్మ నిత్యాః పరమాత్మ స్వరూపాలోచన నిత్యాః తత్పరాః)*.

సంగత్వ దోషాన్ని జయించాలి అని మనం పూర్వ లక్షణంలో చెప్పుకున్న విషయం ఫలప్రదం కావా లంటే, సాధకులు అధ్యాత్మనిత్యులై ఉండాలి. పరమాత్మ చింతనా తత్పరులై ఉండాలి.

విషయాలను చింతించే మనస్సు విషయాల యందు సంగత్వమును కలిగి ఉంటుంది. ఏ మనస్సు పరమాత్మ చింతనములో ఉంటుందో, ఆ మనస్సు విషయ చింతనములో ఉండ లేదు. అన్య విషయ విస్మరణము జరుగుతుంది. సదా పరమాత్మ స్మరణమే కొనసాగుతూ ఉంటుంది.

*ఆ॥ విషయ సక్తులైన విబుధా హితుల తోడి, మనకి వలదు, ముక్తి మార్గ వాంఛ ;*
*నాది దేవు విష్ణు నాశ్రయింపుడు ముక్త సంగజనుల గూడి శైశవమున !*

'విషయాసక్తులై సంగత్వ బంధంలో తగుల్కొనిన అవివేకులతో స్నేహం మనకు మంచిది కాదు. బాల్యము నందే మోక్ష మార్గాన్ని ఎన్నుకొని, సత్పురుష సాంగత్యమును పొంది విష్ణుదేవుని ఆశ్రయించండి' అని ప్రహ్లాదుడు ఆంధ్ర భాగవతము - సప్తమ స్కంధంలో గురుకులంలో తోటి విద్యార్థులకు హితోపదేశం చేశాడు.





## వినివృత్త కాములు

నివృత్త కాములు అంటే కామములు, లేదా కోరికలు తొలగిన వారు. **వినివృత్త కామాః** అంటూ వి అనే ఉపసర్గ చేరడం చేత విశేషంగా కోరికలు తొలగిన వారు అని అర్థము *(**వినివృత్త కామాః విశేషేణ నిర్లేపేన నివృత్తాః కామాః యేషాం తే వినివృత్త కామాః యతయః**)*. వారే యతి పురుషులు.

వినివృత్త కాములు అంటే పూర్తిగా, శేషం లేకుండా కోరికలు తొలగిన వారు. అంటే, తొలగిన కోరికలు కలవారే గాని, కోరికలను తొలగించుకున్న వారు కారు. ఈ అంతరాన్ని సాధకులు జాగ్రత్తగా దర్శించాలి.

మనం కోరికలకు దూరం కావడం, కోరికలు మనకు దూరంగా పోవడం, రెండూ ఒకటి గానే కనిపిస్తాయి. కాని, ఆ రెండిటిలో ఎంతో వ్యత్యాస ముంది. నేడు ఏ కోరిక లైతే మనం కష్టపడి దూరం చేసుకున్నామో, అవి ఒకప్పుడు మనం ఇష్టపడి దగ్గర చేర్చుకున్నవే. ఒకప్పుడు ఇష్టపడిన వాటిని నేడు కష్టపడి దూరం చేసుకోగలమే గాని, ఇష్టాన్ని మనస్సు నుండి దూరం చేసుకోలేము. కోరికలు దూరమైనా, ఇష్టం మనస్సు లోనే తిష్ఠ వేసి ఉండటం వల్ల కోరికలు తిరిగి ఏ క్షణా న్నైనా విజృంభించ వచ్చు. అది ఎలాగో చెప్పేందుకే నేమో ప్రతి ఇంటిలో ఇంగువ కట్టిన గుడ్డ ఉంటుంది.

గుడ్డలో కట్టిన ఇంగువను పారేసినా, గుడ్డ మాత్రం కొంత కాలం వరకు ఇంగువ వాసనను వెదజల్లు తూనే ఉంటుంది. అలాగే కోరికల్ని మనం విడిచి పెట్టినా, అవి మనకు ఇష్టమైన కోరికలే కనుక, కోరికలు దూర మవుతాయే గాని ఇష్టం మాత్రం గుడ్డను అంటిపెట్టుకున్న ఇంగువ లాగా వాసనను విరజిమ్ముతూనే ఉంటుంది. కోరికలు దూర మౌతాయి. ఇష్టాన్ని వదిలేసి పోతాయి. ఈ ఇష్టం దేనికి సంబంధించింది అని ఆలోచించ గానే, 'అది నాది, నాది' అంటూ కోరికలు మళ్ళీ ప్రత్యక్ష మవుతాయి. కనుక కోరికల్ని మనం వదలడం కన్నా కోరికలు మనల్ని విడిచి వెళ్ళడమే శ్రేయము.

కోరికల్ని వదిలి పెట్టిన వారిని పరిశీలించండి. ఈ సత్యం సుస్పష్టంగా కనిపిస్తుంది. కోరికల్ని విడిచిన వాడు కనిపించిన ప్రతి వ్యక్తితో 'నేను అది మానేశాను - ఇది వదిలేశాను' అని చెబుతూనే ఉంటాడు. ఎంత వరకు చెబుతాడంటే, తిరిగి చేపట్టనంత వరకే. వదిలేశాను - వదిలేశాను అని నిరంతరం జపం చేసే వాడు దేనిని వదిలినట్లు? వదలడం గొప్ప కాదు. వదిలాను అనే భావనను వదలడం ముఖ్యం. బంధము భావన లోనే ఉంటుంది.

కనుక, కోరికల్ని వదలడం కాకుండా, కోరికల్ని దాటి పోవాలి. అవి మన నుండి అప్రయత్నంగా జారి పోవాలి. మనం వదిలినవి మనల్ని వదలవు. మనల్ని వదిలి పోయినవి మనల్ని మళ్ళీ పట్టుకోవు. విషయాలు ఎలా అనిత్యాలో, కోరికలు ఎంత దుఃఖ భూయిష్ఠాలో బుద్ధికి పడితే, ఆ తరువాత కోరికల్ని మనం విడిచిపెట్ట నవసరం లేదు. కోరికలే మనల్ని విడిచిపెట్టి వెళ్తాయి. ఇక్కడ కోరికలు దూరం కావడ మంటే, బంధహేతువు లైన కోరికలు దూరం కావడము అని అర్థం చేసుకోవాలి.

## ద్వంద్వ విముక్తులు

సుఖదుఃఖాలు అనేవి అందరి అనుభవంలో ఉన్నాయి. ఇది సుఖము, ఇది దుఃఖము అనే ఎరుక కలగ టానికి కారణ మైనవి ఏవో వాటిని సుఖదుఃఖ సంజ్ఞములు అంటారు. అవే ప్రియాప్రియాలు, శీతోష్ణాలు, శత్రుమిత్రులు, జయాపజయాలు, మానావమానాలు మొదలైనవి. అట్టి ద్వంద్వముల చేత విముక్తులైన వారు ద్వంద్వ విముక్తులు. అంటే, ప్రియాప్రియాలు సంభవించి నపుడు ఏ విధమైన రాగద్వేషాలు లేని వారు. బాహ్య

ప్రపంచంలో, లేదా జీవితంలో ఏయే మార్పులు జరుగుతున్నా చిత్తములో ఏ వికారమూ లేని వారు ***(ద్వంద్వైః ప్రియాప్రియాదిభిః విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞైః పరిత్యక్తాః)***.

మానమోహాలు లేనివారు, సంగ దోషమును జయించిన వారు, సదా పరమాత్మ స్మరణము నందే ఆసక్తి కలవారు, వైరాగ్యవంతులై సమస్త కోరికల నుండి విడిపడిన వారు, ద్వంద్వములనే గుణ దోషములు లేనివారు అమూఢులు. మూఢులు అంటే మోహము కల వారు. అమూఢులు అంటే మోహం లేని వారు. మోహం నుండి విడిపడిన వారు ***(మోహ వర్జితాః)***. అట్టి వారు అవ్యయపదము, అంటే పూర్వ శ్లోకంలో మనం చర్చించుకున్న నాశ మెరుగని బ్రహ్మపదమును, పరమపదమును, పరంధామమును చేరుతారు *(గచ్ఛన్తి పదమ్ అవ్యయమ్)*.

*ఆ బ్రహ్మపదము ఎలాంటిదో దాని స్వరూపాన్ని వర్ణిస్తున్నాడు.*

**న త ద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥** 6

***న-తత్-భాసయతే-సూర్యః-న-శశాంకః-న-పావకః***
***యత్-గత్వా-న-నివర్తంతే-తత్-ధామ-పరమం-మమ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | దేనిని | న భాసయతే | = | ప్రకాశింప చేయలేదు |
| గత్వా | = | పొంది | పావకః | = | అగ్ని |
| న నివర్తంతే | = | తిరిగి రారో | న భాసయతే | = | ప్రకాశింప చేయలేదు |
| తత్ | = | దానిని | తత్ | = | అది |
| సూర్యః | = | సూర్యుడు | మమ | = | నా యొక్క |
| న భాసయతే | = | ప్రకాశింప చేయలేదు | పరమం | = | ఉత్తమమైన |
| శశాంకః | = | చంద్రుడు | ధామ | = | స్థానము |

**అర్జునా! నా ధామము దివ్య మైనది. అక్కడ చేరితే తిరిగి రావడ మంటూ ఉండదు. ఆ పరంధామాన్ని సూర్యుడు ప్రకాశింప చేయలేడు. చంద్రుడు వెలిగించ లేడు. అగ్ని చూపలేదు.**

**వ్యాఖ్య**

అవ్యయ పదము, బ్రహ్మపదము, బ్రహ్మధామము, పరంధామము, పరమపదము అంటూ అనేక పర్యాయ పదముల ద్వారా ఏ దివ్యధామాన్ని ఇంతవరకు మనం చర్చించామో, ఆ ధామము, అంటే ఆ బ్రహ్మస్థానము యొక్క స్వరూపాన్ని వర్ణిస్తున్నాడు. అది పరమాత్మ స్థానము. సర్వ జీవుల ఏకైక గమ్యము.

**ధామ శబ్దార్థము**

ధామము అంటే చోటు, లేదా స్థానము అనే అర్థాన్ని మనం చెప్పుకున్నాం. ధామము అంటే ప్రకాశవంత మైనది అని కూడా అర్థము. జ్యోతిని ధామ మంటారు ***(ధామ జ్యోతిః)***. బ్రహ్మపదమును, లేదా పరమాత్మ పదమును పరంధామ మంటారు. అంటే పరమాత్మ ఉండే చోటు. 'ఆ ధామము లేదా స్థానము ***(తత్ ధామ)*** నా శ్రేష్ఠమైన పదము ***(పరమం మమ)***' అంటున్నాడు భగవంతుడు.

'తత్' అంటే అది అని అర్థము. 'ధామ' అంటే చోటు, లేదా ప్రకాశము అని అర్థము. 'తద్ధామ' అంటే 'ఆ స్థానము', లేదా 'ఆ ప్రకాశము' అని అర్థము. 'ఆ స్థానము నాది' అంటే స్థానము నా కన్నా వేరుగా ఉంది అని





అర్థము. 'నా ఇల్లు' అంటే నేను వేరు, నా ఇల్లు వేరు అని అర్థం. 'అది నా ఇల్లు' అంటే నా కన్నా వేరుగా, దూరంగా కనిపిస్తున్నది నా గృహము అని భావము.

'ఆ ధామము నా శ్రేష్ఠ ధామము ***(తత్ ధామ పరమం మమ)***' అనే వాక్యంలో తాను వేరు - ధామము వేరు అనే భావము ధ్వనిస్తోంది. దూరంగా ఉన్న ధామంతో తన సంబంధమును సూచించినట్లు అవుతుంది ***(తత్ ధామ ఇతి వ్యవహితేన ధామ్నా సంబంధః, సంబధ్యతే)***. తత్, ధామ అనే రెండు పదాలు కలిసి ఒకే అర్థాన్ని స్ఫురింప చేస్తున్నాయి. అది ***(తత్)*** ప్రకాశవంత మైనది ***(ధామ)***. 'రాహువు శిరస్సు' ***(రాహోః శిరః)*** అన్నప్పుడు, రాహువుకు తలతో పాటు ఇతర అంగాలు కూడా ఉన్నట్లు ధ్వనిస్తుంది. కాని, రాహువుకు శిరస్సే రూపం. కనుక 'రాహువు శిరస్సు' అన్నప్పుడు, రాహువు వేరు - రాహువు శిరస్సు వేరని అర్థం కాదు. అలాగే ఇక్కడ తత్ - ధామ అన్నప్పుడు గాని, మమ - ధామ అన్నప్పుడు గాని వేరుగా కనిపిస్తున్న ఆ రెండు పదాలు ఒక్కటే అని గ్రహించాలి. ఇక్కడ ధామ మనేది ప్రకాశవంత మైనది అనే అర్థంతో చెప్పబడిన పదం ***(ధామ తేజో రూప పదం)***.

సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. కాంతులకు నెలవైన వాడు. సర్వ ప్రకాశాలకు గని వంటి వాడు. అందుకని, సూర్యదేవుణ్ణి ధామనిధి అంటారు ***(ధామ నిధిః)***. గని అంటే చోటు అని అర్థం. బంగారు గని అంటే బంగారు ఉత్పత్తి స్థానము. బొగ్గు గని అంటే బొగ్గు లభించే స్థానము. ఇక్కడ ఒక్క విషయాన్ని గుర్తించాలి. బంగారు గని అన్నప్పుడు బంగారు వేరు, గని వేరు కనుక, ఆ గనిలో బంగారు లభిస్తూ ఉంది అని అర్థం చేసుకుంటాం. అలాగే బొగ్గు గని అన్నప్పుడు, ఆ గనిలో గని కన్నా వేరైన బొగ్గు అనే వస్తువు లభిస్తూ ఉంది అని అర్థం. మరి, సూర్యుణ్ణి 'ధామనిధి' - ప్రకాశమునకు గని యైన వాడు అన్నప్పుడు, సూర్యుడు వేరు, ప్రకాశము వేరు అని అర్థమా? గనిలో బంగారము ఉన్నట్లు సూర్యునిలో ప్రకాశము ఉందా? అదే వాస్తవ మైతే, గనిలో బంగారము లేని చోటు కూడా ఉంటుంది కదా! మరి సూర్యునిలో ప్రకాశం లేని చోటు ఉన్నట్లేనా? కాదు. గని - బంగారము, గని - బొగ్గు లాగా సూర్యుడు - సూర్యకాంతి వేరుగా లేవు. సూర్యుడే ప్రకాశము. ప్రకాశమే సూర్యుడు. అదే 'ధామనిధి' శబ్దార్థము. కనుక ఎక్కడ సూర్యు డుంటే అక్కడ ప్రకాశం ఉంటుంది. ఉండాలి. కాని, ఈ సత్యానికి భిన్నమైన రూపాన్ని ప్రస్తుత శ్లోకంలో మనం చూడ బోతున్నాం.

**పరంధామం**

అర్జునా! ఏ ధామమును చేరితే తిరిగి రారో *(యత్ ధామ వైష్ణవ పదం గత్వా ప్రాప్య, న నివర్తన్తే)*. ఆ ధామమే నా ఉత్కృష్టమైన స్థానము ***(తత్ ధామ పదం పరమం మమ విష్ణోః)***.

చేరడము అనేది ప్రయాణానికి సంబంధించిన విషయము. ప్రయాణించి ఒక చోట నుండి మరొక చోటికి చేరడము. అదే గంతవ్యం. పోవడ మంటూ జరిగితే తిరిగి రావడ మనేది ఉంటుంది. ఎగిరిన బంతి పైకి లేచినా, తిరిగి మళ్ళీ భూమిపై పడుతుంది *(పతనాన్తాః సముచ్ఛ్రయాః)*. గూడు విడిచి గువ్వ గగనంలో విహరించినా, మళ్ళీ తిరిగి వచ్చి గూడును చేరుతుంది. ఊరి కెళ్ళిన వారు తిరిగి ఇంటికి చేరుతారు. కాని వీటన్నిటికి భిన్నంగా, దేనిని చేరితే తిరిగి రావడ మంటూ ఉండదో అదే నా శ్రేష్ఠమైన ధామము అంటున్నాడు భగవంతుడు.

ఏ యాత్ర కెళ్ళినా తిరిగి రావలసిందే. కాశీ క్షేత్రానికి ఎవరైనా వెళ్తూ ఉంటే, కొందరు ఆత్మీయులు తోడుగా వెళ్ళి వాహన మెక్కించి వస్తారు. అది కాశీయాత్ర.

ఒక వ్యక్తి మరణిస్తే, ఆ వ్యక్తిని పాడెపై పడుకోబెట్టి, బంధుమిత్రాదులు శ్మశానం వరకు నడచి వెళ్ళి దహన క్రియలు చేసి వస్తారు. ఇది శవయాత్ర.

వారణాశికి వెళ్ళిన యాత్రికుడు కొంత కాలానికి తిరిగి వస్తాడు. మరి వల్లకాటికి చేరిన వాడు? తిరిగి రాడు అనుకుంటున్నారా? వాడూ వస్తాడు. కొంత కాలం తరువాత తిరిగి జన్మిస్తాడు. స్వర్గానికి వెళ్ళినా, పుణ్యమును అనుభవించిన తరువాత తిరిగి పుట్టక తప్పదు.

కనుక, ఏ యాత్రలైనా రాకపోకలతో ముడిపడే ఉంటాయి. రాక లేని పోక ఒకే యాత్రలో ఉంటుంది. దానినే ప్రస్తుతం భగవంతుడు చర్చిస్తున్నాడు. అదే బ్రహ్మపదము. పరమాత్మ స్థానము. పరంధామము. అక్కడికి చేరితే తిరిగి రావడ మంటూ ఉండదు. అదెలా? పోక ఉన్నప్పుడు రాక తప్పదు కదా! నిజమే. కాని ఇక్కడ పోవడ మనేది ఉంటే కదా? పోవడమే జరగదు. కనుక, తిరిగి రావడ మనే ప్రసక్తే ఉండదు. ఇదొక విచిత్రమైన యాత్ర. ప్రకాశము వైపు సాగే ప్రయాణము. ప్రయాణము కాని ప్రయాణము.

**పోయేది లేదు - వచ్చేది ఉండదు**

బ్రహ్మ మేమిటో, బ్రహ్మ స్వరూప మేమిటో మనం ఇప్పటికే సవిస్తరంగా చెప్పుకున్నాం. బ్రహ్మము సత్యము, బ్రహ్మము జ్ఞానము, బ్రహ్మము అనంతము ***(సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ).*** బ్రహ్మము అనంతము. అనంతము అంటే ఏమిటి? దేశ, కాల, వస్తు అపరిచ్ఛిన్నం, అనంతం. అట్టి అనంతమైన బ్రహ్మము చైతన్య స్వరూపము. కనుక, బ్రహ్మము, ఆత్మ వేరు కాదు. ఈ ఆత్మయే బ్రహ్మము ***(అయమాత్మా బ్రహ్మ).***

***ఆత్మా అస్తి -*** ఆత్మ ఉంది అనేది వాక్యము. ఏదైనా ఒకటి ఉంది ఈ ప్రపంచంలో అని మనం చెబితే, అది సాపేక్షికంగా ఉంది అని అర్థం. వ్యావహారికంగా ఉంది అని అర్థం. ఏది ఉండినా, అది ఒక ప్రదేశములో ఉంటుంది. అలాగే ఒక కాలంలో ఉంటుంది. ఒక ప్రదేశములో ఉంది అంటే మరొక ప్రదేశంలో లేదు అని అర్థం. అలా దేశ పరిచ్ఛేదానికి లోనైన దేదైనా పరిమిత మవుతుందే గాని అనంతం కాలేదు. అలాగే ఒక కాలంలో కలిగింది ఏదైనా కాల పరిచ్ఛేదంలో పడి మరొక కాలంలో లేకుండా పోతుంది. కనుక అది అంత మవుతుందే గాని అనంతం కాలేదు.

ఇక్కడ ఏదున్నా, అది అక్కడ లేనిదే. ఇక్కడ ఉండి అక్కడ లేనిది అంతటా ఉండేది ఎలా అవుతుంది? అందుకే అది అనంతం కాలేదు. ఇప్పుడున్నది, గతంలో లేనిది, భవిష్యత్తులో ఉండ బోనిది; అలాంటి దేదీ అనంతం కాలేదు.

***యదస్తి తత్ సత్యం -*** ఏది ఉందో అది సత్యము. కాని, ఏది ఉన్నా దేశ కాలాదులకు పరిమితమై ఉన్నందున, నశించే స్వభావము కలిగి ఉంది. నశించేది సత్య మెలా అవుతుంది? త్రికాలము లందు ఏదైతే ఉంటుందో, అది సత్యము ***(కాలత్రయేపి తిష్ఠతి యత్ తత్ సత్యం).*** ఈ దృశ్యమాన జగత్తులో ఏది ఉన్నా, అది ఉన్నదే గాని సత్యంగా ఉన్నది కాదు. ఏది అనంతంగా ఉందో అదే సత్యము. కనుక అనంతమైన సద్రూప చైతన్యము ఒకటి ఉండే టప్పుడు, దాని కన్నా అన్యంగా మరొకటి ఉండే అవకాశం లేదు. అప్పుడే అది అనంత మవుతుంది. అదే బ్రహ్మము. అదే పరంధామం.

ఇది అర్థమైతే, చెట్టు ఉంది, పువ్వు ఉంది, ఇల్లు ఉంది అని చెప్పినట్లు, బ్రహ్మము ఉంది అని చెప్పడానికి వీలు పడదు. 'బ్రహ్మము ఉన్నది' అనేది కాదు; 'ఉన్నదంతా బ్రహ్మమే' అనేది సత్యం. అదే అనంత స్వరూపము. అనంత సత్యము. దానికి అన్యంగా ఏది ఉన్నా అదంతా మిథ్య. నామరూపాత్మకము. నామరూపాలు కూడా అనంతమైన బ్రహ్మము కన్నా వేరుగా లేవు. కాని, నామరూపాలు లేకపోయినా అనంతమైన బ్రహ్మము నిరస్తం





కాదు. సమస్తం తాను గానే ఉంటుంది. అదే బ్రహ్మము. ఈ ఆత్మయే బ్రహ్మము ***(అయమాత్మా బ్రహ్మ)*** అని అర్థం చేసుకున్నాం కదా! మరి ఇప్పుడు నువ్వెవరు? అనంతమే. అనంతమైన నీవు లేని దెక్కడ? అనంతమైన నీవు అంతటా ఉన్నావు. అనంతం గానే ఉన్నావు. అనంతంలో అనంతం ప్రయాణం చేయగలదా? మరి ప్రయాణమే లేనపుడు గమ్యం ఎక్కడుంది? గమ్యమే లేనపుడు ఇక చేరే దేముంటుంది? చేరేది లేనపుడు తిరిగి వచ్చే దేముంటుంది? ఇప్పుడర్థ మైందని భావిస్తాను. ఏ ధామాన్ని చేరితే మళ్ళీ వెను దిరిగి రారో అదే నా ధామము అని భగవంతుడు ప్రవచించ డంలో అంతర్భావం ఇదే.

వారణాశికి వెళ్ళిన వాడు తిరిగి స్వగ్రామం చేరుతాడు. వల్లకాటికి చేరిన వాడు తిరిగి మరొక దేహంతో పుడుతాడు. బ్రహ్మమును చేరిన వాడు మాత్రం తిరిగి జన్మించడు. పునర్జన్మ లేని మోక్షమును పొందుతాడు. అదే బ్రహ్మపదము. పరంధామము.

నిద్రించిన వాడు స్వప్నంలో స్వప్న ప్రపంచాన్ని అనుభవిస్తాడు. అతడే మేల్కొనిన తరువాత తిరిగి స్వప్న ప్రపంచం లోకి ప్రవేశిస్తాడా? ప్రవేశించ వలసిన అవసర ముందా? ఏ కల నుండైతే తాను మేల్కొనడం జరిగిందో, ఆ కలలో మధ్యలో విడిచిపెట్టి వచ్చిన కార్యాన్ని తిరిగి కలలో ప్రవేశించి పూర్తి చేసి వచ్చే అవకాశ ముందా? కలలో అపరిష్కృతంగా ఉన్న సమస్యలను చక్కబరచు కోవడానికి మేలుకొన్న వాడు తిరిగి కలలో దూరే వీలుందా? నిద్ర నుండి ప్రబుద్ధమైన తరువాత, 'అయ్యో! చాలా మంది నుండి అప్పు తీసు కున్నాను. ఆ అప్పు లన్నీ తీర్చకుండానే మేలుకున్నానే' అని విచారిస్తాడా? తీర్చాలని ప్రయత్నిస్తాడా? ఆ పని ఎవ్వడూ చేయడు. ఎందుకని? మేలుకోవడం తోనే స్వప్నం లోని సమస్య లన్నీ పరిష్కరింప బడ్డాయి. అప్పు లన్నీ తీరి పోయాయి. కనుక సర్వ సమస్యలకు పరిష్కారం జ్ఞానమే. మేలుకుంటే చాలు. ఆ జ్ఞానంలో స్వప్నము లోని సర్వ సమస్యలు విలీనమై పోతాయి. బ్రహ్మపదమును పొందిన వాడు తిరిగి సంసారంలో ప్రవేశించడు. మేలుకున్న వాడు తిరిగి కలలో ప్రవేశించడం ఎలా జరగదో, పరంధామమును చేరిన వాడు తిరిగి జన్మించడం ఉండదు.

***అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటి శతార్జితమ్ ।***
***సంచితం విలయం యాతి ప్రబోధాత్ స్వప్న కర్మవత్ ॥***

'స్వప్నంలో చేసిన కర్మ లన్నీ మేలుకోగానే విలీనమై అదృశ్య మైనట్లు, వందల కోట్ల జన్మలలో ఆర్జించు కొనిన కర్మల యొక్క ఫలాలన్నీ 'నేనే బ్రహ్మము' అనే జ్ఞాన జాగరణో నశించి పోతాయి'.

ఎన్ని జన్మ లెత్తినా, ఆ జన్మలలో ఎన్ని కర్మ లాచరించినా, మేల్కొన గానే స్వప్న కార్యాలన్నీ అసత్య విషయాలుగా తేలినట్లు, 'నేనే బ్రహ్మము' ***(అహం బ్రహ్మేతి)*** అనే జ్ఞానము ప్రాప్తించ గానే, అనాదిగా అంటి పెట్టుకొని వస్తున్న సమస్త జన్మలు, కర్మలు సమూలంగా నశిస్తాయి.

ఒక వ్యక్తి స్వప్నంలో విభిన్నమైన కర్మలను ఆచరించ వచ్చు. అవి యజ్ఞయాగాది పుణ్యకర్మలు కావచ్చు. లేదా, భయంకరమైన హత్యలు కావచ్చు. మేలుకున్న తరువాత ఆ కర్మల యందు అతనికి స్పృహ ఉండదు. కారణం, వాటికి అతడు కర్త కాదని తెలుసు. స్వప్నం లోని కర్మాచరణమునకు మేలుకున్న తనకు ఏ విధమైన సంబంధము లేదు అనే జ్ఞానము అతని కుంది. స్వప్న కర్మల విషయంలో తాను అకర్త. మరి కర్త ఎవరు? అనే ప్రశ్న ఉదయించ వచ్చు. స్వప్నము మిథ్య. మిథ్యకు సంబంధించిన కర్మలకు కర్త మిథ్యాత్మ. మేలుకున్న తాను మిథ్యాత్మ కాదు. సత్యాత్మ. మిథ్యాత్మ కర్తగా ఆచరించిన కర్మలకు అకర్త యైన సత్యాత్మకు సంబంధము లేదు కనుక, మిథ్యాత్మ యొక్క కర్మలు సత్యాత్మను అంటవు. సత్యాత్మది బాధిత కర్తృత్వం.

ప్రబుద్ధ మైన వాడు తిరిగి స్వప్నం లోకి ప్రవేశించ లేనట్లు, ఏ దివ్య ధామము చేరిన వారు తిరిగి

సంసారములో ప్రవేశించరో ( *యద్గత్వా న నివర్తన్తే* ) ఆ పరంధామము తనదే నంటున్నాడు భగవంతుడు (*తద్ధామ పరమం మమ*). అది సూర్యచంద్రాగ్నులు ప్రకాశించ లేని దివ్య ధామము.

**పరంజ్యోతి - వెలుగులకు వెలుగు**

పరంధామము పరమాత్మ నిలయము. ధామము అంటే తేజోవంత మని అర్థం చేసుకున్నాం. అది ఎలాంటి తేజము అంటే, ఆ ధామమును సూర్యుడు ప్రకాశింప చేయలేడు ( *న భాసయతే సూర్యః ఆదిత్యః* ). అలాగే చంద్రుడు (*తథా న శశాంకః చన్ద్రః*), అగ్ని కూడా ( *న పావకః అగ్నిః అపి* ) ప్రకాశింప చేయలేరు.

సూర్యుడు ప్రపంచాన్నంతా ప్రకాశింప చేస్తాడు. సూర్యుని ప్రకాశము లోనే ప్రపంచము మన అనుభవానికి అందుతూ ఉంది. రూపము గల ద్రవ్య మంతా సూర్యుని చేతనే భాస్యము, అంటే ప్రకాశింప బడుతూ ఉంది. ప్రపంచము భాస్యము; సూర్యుడు భాసకుడు. ఇదే భాస్య భాసక సంబంధము.

సమస్త ప్రపంచాన్ని ప్రకాశింప చేసే శక్తి కల వాడైనా (*సర్వ అవభాసన శక్తి మత్వేఽపి సతి*) , ఆదిత్యుడు ఆదిదేవుని పరంధామమును ప్రకాశింప చేయలేడు (*తత్ పదం న భాసయతి*). ప్రపంచాన్ని వెలిగించే భానుడు పరమాత్మ ధామమును వెలిగించ లేక వెల వెల పోతున్నాడు.

పరంధామము, లేదా పరంజ్యోతి స్వప్రకాశ చైతన్యము కావడము చేత అది భాసకమే గాని భాస్యము కాదు. స్వయం భాసకమైన తనను ప్రకాశింప చేయడానికి మరొక భాసకము అవసరం లేదు. అంతే కాదు. ఈ పరంజ్యోతి ప్రకాశం వల్లనే సూర్యచంద్రాగ్నులు ప్రకాశిస్తున్నారు. అందుచేత పరమాత్మ ధామము వెలుగులకు వెలుగై పరంజ్యోతి అయింది. సూర్యుడు సూర్యుడుగా వెలుగులను విరజిమ్మడానికి, చంద్రుడు వెన్నెలను వెదజల్లడానికి, అగ్ని వేడిని, వెలుతురును ప్రసరించడానికి పరంజ్యోతియే ఆధారము. తమను ప్రకాశింప చేసే దానిని, ప్రకాశింప బడేవి తిరిగి ఎలా ప్రకాశింప చేస్తాయి? భాస్యాలు భాసకాన్ని ఎలా వెలిగింప చేస్తాయి? కనుక సమస్తమును ప్రకాశింప చేసే స్వయంజ్యోతి స్వరూప మైన పరంధామము వెలుగులకు వెలుగుగా స్తుతింప బడింది (*జ్యోతి ర్జ్యోతిః*).

మం॥ *న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం*
*నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః*
*తమేవ భాన్త మనుభాతి సర్వం*
*తస్య భాసా సర్వ మిదం విభాతి ॥*

'అక్కడ సూర్యుడు ప్రకాశించ లేడు. చంద్రతారకలు వెలగ లేవు. మెరుపులు కూడా మెరవ లేవు. ఇక అగ్ని విషయం వేరే చెప్పే దేముంది? అతని ప్రకాశాన్ని అనుసరిస్తూ సమస్తమూ ప్రకాశిస్తూ ఉంది. అతని ప్రకాశం వల్లనే ఈ సమస్తమూ ప్రకాశిస్తూ ఉంది' అన్నది ఉపనిషత్తు. ఇదొక అద్భుతమైన మంత్రము. ఈ మంత్రము కఠోపనిషత్తులో ( *5 - 15* ), ముండకోపనిషత్తులో ( *2 - 2 - 11* ), శ్వేతాశ్వతరోపనిషత్తులో *(6-14)* కూడా ఉంది. ఈ మూడు ఉపనిషత్తులపై శ్రీ శంకరాచార్యస్వామి భాష్యము ఉంది. ఈ మూడు ఉపనిషత్తులపై నేను సమగ్రంగా ప్రవచనములు కూడా చేశాను. *

ఆలయాలలో, పూజా మందిరాలలో హారతి వేళ పై మంత్రాన్ని ఉచ్చరిస్తూ మంగళహారతి సమర్పిస్తారు. పురాతన ఆలయాలను మనం సందర్శిస్తే, ఈనాటికీ కొన్ని గర్భాలయాలలో విద్యుద్దీపాలను ఉంచరు. గర్భ గుడిలో చిన్న దీప మొకటి అఖండంగా వెలుగుతూ ఉంటుంది. మనం దైవ దర్శనానికి నిలబడి ఉంటాము.



* పూజ్య స్వామీజీ కఠోపనిషత్ ప్రవచనములు (26 వి.సి.డి.లు), ముండకోపనిషత్ ప్రవచనములు (18 డి.వి.డి.లు), శ్వేతాశ్వతరోపనిషత్ ప్రవచనములు (36 వి.సి.డి.లు) ఆశ్రమంలో లభిస్తాయి.



గుడిలో దేవుడు ఉన్నా మనకు కనిపించడు. కనిపించడం లేదు కనుక, గర్భాలయంలో దేవుడు లేడని మనం వెను తిరిగి వెళతామా? దైవ దర్శనానికి నిరీక్షిస్తూ అక్కడే నిలబడి ఉంటాము.

పూజారి నీరాజనం ఇచ్చినపుడు ఆ కర్పూర కాంతిలో మనకు దైవ దర్శన మౌతుంది. ఈ విశ్వ మందిరంలో విశ్వనాథుడు ఉన్నా, ఉన్నాడని మనకు పరోక్షంగా తెలిసినా, విశ్వనాథుని దర్శనం మాత్రం మనకు కలగదు. ఆలయంలో పూజారి కర్పూర హారతి ఇచ్చినపుడు ఆ వెలుగు లోనే మనకు దైవ దర్శన మైనట్లు, గురువు శాస్త్రాన్ని బోధించి నపుడు, తద్వారా జనించిన జ్ఞాన వెలుగు లోనే మనకు దైవ దర్శనానుభూతి కలుగుతుంది. ఆ అనుభూతిలో సర్వం ఈశ్వరమయంగా, జ్యోతిర్మయంగా తెలుస్తుంది. ఆ పరంజ్యోతి ఒక్కటే జ్యోతులకు జ్యోతిగా, దానికి అన్యంగా భాసించే సూర్య చంద్ర నక్షత్రాగ్ను లన్నీ దానిని అనుసరించి ప్రకాశించేవిగా అనుభవానికి అందుతుంది. ఏది స్వప్రకాశమో అది భాతి. ఏది మరొక వెలుగుపై ఆధారపడి ప్రకాశిస్తుందో అది అనుభాతి. పరంజ్యోతి భాతి. సూర్యచంద్ర నక్షత్రాగ్నులు అనుభాతి ప్రకాశాలు.

దేవతార్చన సమయంలో ఈ మంత్రాన్ని పలుకుతూ నీరాజనం సమర్పిస్తారు. 'భగవాన్! సూర్యచంద్ర తారకలు ప్రకాశించ లేని దివ్య ధామం నీది. అలాంటి నీ సన్నిధిలో నేను వెలిగించే ఈ కర్పూరహారతి ఏ పాటిది? ఈ చిన్ని వెలుగు నా భక్తికి ప్రతీకము. నా హృదయానికి ప్రతిరూపము. కర్పూర కళిక చిన్నదే అయినా, నిన్ను దర్శించడానికి సరిపోతుంది. కర్పూరము నిన్ను దర్శింప చేయడమే గాక, నీ ఆరాధనలో శేషం లేకుండా తనను తాను నీకు అర్పించు కుంటుంది. భగవాన్! నీ దివ్యారాధనలో నా మనస్సును కూడా ఈ కర్పూరం లాగే ప్రకాశించి, పరిమళించి నీలో ఐక్యమై, నిర్విశేషంగా భాసించనీ!' ఈ భావం తోనే పూజా సమయాలలో **న తత్ర సూర్యో భాతి** మంత్రాన్ని భక్తితో పఠిస్తూ హారతిస్తారు. మహాభక్తుడు, సంత్ శిరోమణి భక్త నరసీమెహతా ఈ భావాన్నే ఔదల దాల్చి అందమైన కీర్తనను రచించారు. ఇది చాలా ప్రశస్త మైన కీర్తన.

*పల్లవి :* **దర్శన్ దో ఘన శ్యామ్ నాథ్ మోరె**
**అఖియా ప్యాసీరే !**

*అనుపల్లవి :* **మన్ మందిర్ కి జ్యోతి జగాదో**
**ఘట్ ఘట్ వాసీరే ॥ దర్శన్ ॥**

' హే పరంధామా! మేఘశ్యామా! నీ దివ్య దర్శనానికి నా కళ్ళు దప్పికతో ఎదురు చూస్తున్నాయి. సుందర మైన నీ ముఖారవిందాన్ని దర్శించే భాగ్యాన్ని నాకు అనుగ్రహించు.

సర్వ దేహాలలో ప్రకాశించే జ్యోతి స్వరూపా! నా మనో మందిరాన్ని నీ కాంతులతో నింపు!'

**పానీ పీకర్ ప్యాస్ బుఝావూం**
**నైనన్ కో కైసే సమ్‌ఝావూం**
**ఆంఖ్ మి చౌలీ ఛోడో అబ్‌తో**
**మన్ కె వాసీరే ॥ దర్శన్ ॥**

'భగవాన్! జలపానం చేస్తే దప్పిక తీరుతుంది. నేత్ర దాహాన్ని ఎలా తీర్చుకోనేది? భగవంతా! దాగుడు మూతలు ఆడింది చాలు. ఇకనైనా ఆట నాపి నా మదిలో ఉండిపో. నా హృదిలో నిండిపో'.

**దయాదీపం**

బ్రహ్మము అనంతము కనుక స్వతస్సిద్ధము. స్వతస్సిద్ధము కనుక స్వప్రకాశము. స్వప్రకాశ మైనందున బ్రహ్మము భాతి. సూర్యచంద్రాగ్నులు అనుభాతి రూపాలు. అవి ప్రకాశించడానికి బ్రహ్మమే కారణమై ఉంది.

కనుక బ్రహ్మమును అవి ప్రకాశింప చేయలేక పోతున్నాయి. పరమాత్మ అనుగ్రహంతో దినరాజు ప్రకాశిస్తున్నాడు. దివ్య వెలుగులతో ప్రచండంగా శోభిస్తున్నాడు. పరమాత్మ కృపతో నెలరాజు చల్లని వెన్నెలను ఆరబోస్తూ విశ్వాన్ని అలరిస్తున్నాడు. పరమాత్మ దయతో అగ్నిదేవుడు తాను పవిత్రుడై, ఇతరులను కూడా పవిత్రం చేస్తూ పావకు డయ్యాడు ***(పావకః పునాతీతి పూజ్ పవనే)***.

మరి, పరమాత్మ అనుగ్రహంతో సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు అంటే, వారి లోని ప్రకాశము వారిది కాదనే కదా అర్థము! ప్రకాశ స్వరూపులు కాని సూర్యచంద్రాగ్నులు పరమేశ్వరుని కృపతో ప్రకాశించే టప్పుడు, పరమేశ్వరుని అనుగ్రహానికి పాత్రుల మైతే, మనం కూడా తేజోమయం కాగలం అనేదే దాని అంతర్భావము.

అవును. పరమేశ్వరుని ఆశ్రయిస్తే, ఎవరైనా ఆయన అనుగ్రహానికి పాత్రులు కాగలరు. ఆయన కృపకు నోచుకున్న చంద్రుడే అందరిపై చల్లని వెన్నెలను కురిపించే టప్పుడు, ఇక పరమాత్మ అనుగ్రహాన్ని గూర్చి ముందు వెనుకలు ఆలోచించడ మెందుకు? దిగిన వారిని పక్షపాతము లేకుండా నది చల్ల బరచినట్లే, ఆశ్రయించిన వారి నందరిని దయామయుడైన భగవంతుడు తప్పక కరుణిస్తాడు.

***ద్వార్ దయాకా జబ్ తూ ఖోలే***
***పంచమ్ స్వర్ మే గూంగా బోలే***
***అంధా దేఖే లంగ్డా చల్ కర్***
***పహుంచే కాశీరే*** ॥ ***దర్శన్*** ॥

'పరమేశ్వరా! నీ అనుగ్రహ ప్రసాద ద్వారము తెరుచుకుంటే చాలు. మూగవాడు పంచమ స్వరంలో పాడుతాడు. గ్రుడ్డివాడు చూస్తాడు. కుంటివాడు నడిచి కాశికి చేరుతాడు'.

భక్తితో భగవంతుని ఆరాధించిన వాళ్ళు ఆ దివ్యాత్ముని కృపకు పాత్రులై సూర్యచంద్రుల వలె ప్రకాశిస్తారు. అగ్ని వలె పవిత్రు లవుతారు. కాని, పరమాత్మ జ్ఞానాన్ని పొందిన వారు సాక్షాత్తు పరమాత్మ స్వరూపులై భాసిస్తారు. స్వప్రకాశ స్వరూపులై స్వతస్సిద్ధంగా శోభిస్తారు.

**ఆత్మజ్యోతి – అఖండ జ్యోతి**

అనంతమైన బ్రహ్మపదము స్వప్రకాశ చైతన్యము అని అర్థం చేసుకున్నాం. మరి నీ వెవరు? నీవు ఆత్మవే. నే నెవరు? నేనూ ఆత్మనే. అతడూ ఆత్మే. ఆమె కూడా ఆత్మే. అందరిలో అస్తిత్వముగా శోభిస్తున్నది ఆత్మే. ఆత్మే సద్రూపము. సత్తా మాత్రము. కనుక సద్రూపంగా నేను సదా ఉన్నాను ***(సద్రూపేణ అహం సదా అస్మి)***. చిద్రూపంగా నేను సదా ప్రకాశిస్తున్నాను ***(చిద్రూపేణ అహం సదా భామి)***. అందరమూ అలాగే ఉన్నాము. ***అహమస్మి*** - నేను ఉన్నాను. ***త్వమసి*** - నీవు ఉన్నావు. ***తదస్తి*** - అది ఉంది. నేను, నువ్వు, అది - అన్నీ సద్రూపమే. చిద్రూపమే. అందరమూ ఆత్మ స్వరూపమే. ఈ ఆత్మే బ్రహ్మ ***(అయమాత్మా బ్రహ్మ)*** అని అర్థం చేసుకున్నాం కదా! మరి ఆత్మ బ్రహ్మమే అయినపుడు ఆత్మ భాతి అవుతుందా, అనుభాతి అవుతుందా? ఆత్మయే పరమాత్మ కనుక ఆత్మ భాతియే గాని సూర్యచంద్రాగ్నుల వలె అనుభాతి కాదు. అదే వాస్తవ మైతే, అనుభాతి రూపాలైన సూర్యచంద్ర నక్షత్రాగ్నులు భాతి యైన బ్రహ్మముపై ఆధారపడి ప్రకాశించినట్లే, భాతి యైన ఆత్మపై ఆధారపడి వెలుగుతున్నట్లే కదా! అవును. సత్యం అర్థమైతే అంతే. అయితే, సూర్యచంద్రాగ్నులకు ప్రకాశాన్ని ఇవ్వగలిగే శక్తిమంతుడనా నేను? అవును. జ్ఞానం కలిగితే, ఇందులో సంశయాలకు అవకాశమే లేదు. ఆత్మ ప్రకాశము, బ్రహ్మ ప్రకాశము వేరు కావు. అవి రెండుగా లేవు. అంతా అద్వయ ప్రకాశమే. అఖండ జ్యోతి స్వరూపమే.





***యేన ప్రకాశతే విశ్వం యత్రైవ ప్రవిలీయతే,***
***తద్బ్రహ్మ పరమం శాంతం తద్బ్రహ్మాస్మి పరం పదమ్*** ॥

'దేని చేత ఈ ప్రపంచ మంతా ప్రకాశిస్తూ ఉందో, ఈ సమస్తము దేని యందు లయించి పోతూ ఉందో, అట్టి బ్రహ్మము ఉత్కృష్ట మైనది. శాంత మైనది. అది పరమపదము ***(తద్ధామ పరమం మమ)***. అటువంటి బ్రహ్మమే నేను ***(తద్బ్రహ్మాస్మి)***' అని పంచబ్రహ్మోపనిషత్తు.

**స్వప్రకాశ చైతన్యము**

వెలుగులో ఉన్న వాటిని నీవు చూచి తెలుసుకుంటావు. చీకటిలో ఉన్న వాటిని తెలుసుకో గలవా? తెలుసుకో లేవు. చీకటిలో ఏవి ఉన్నవో, ఎక్కడున్నవో, నీకు తెలిసి రాదు. కాని, ఆ చీకట్లో దేనినీ చూడలేని నీవు ఉన్నావా, లేదా? చీకటిలో ఉన్న వాటి విషయంలో నీకు సందేహం ఉండవచ్చు. నీ ఉనికి విషయంలో నీకు సందేహం ఉందా? లేదు. అలాగే నా ఉనికి విషయంలో నాకూ సందేహం లేదు. నా కన్నా వేరుగా ఉన్న వాటిని తెలుసుకోవడానికి నాకు ప్రకాశం కావాలి. కాని, నన్ను నేను తెలుసుకోవడానికి ఏ ప్రకాశము అవసరం లేదు. ఎందుకని? నేనే ప్రకాశ స్వరూపము. నీవూ ప్రకాశ స్వరూపమే.

నే నెప్పుడైతే స్వప్రకాశంగా శోభిస్తున్నానో, మరొక దానిపై ఆధార పడకుండా ప్రకాశిస్తున్నానో, నేను భాతినే కాని అనుభాతిని కాను. భాతిని నే నైనపుడు, అన్యమైన ప్రకాశాలన్నీ అనుభాతి రూపాలే. ఈ విషయంలో అనుభాతి మూర్తులైన సూర్యచంద్ర నక్షత్రాగ్నులు విలక్షణంగా లేరు. వారు కూడా ఆత్మ ప్రకాశము మీదనే ఆధారపడి ప్రకాశిస్తున్నారు.

రాత్రి పూట గాఢాంధకారంలో ప్రపంచం మనకు కనిపించదు. సూర్యోదయం కాగానే సూర్యుని ప్రకాశంలో మనం ప్రపంచాన్ని చూస్తాము. ఒకవేళ నేను అంధుణ్ణి అయితే, ప్రపంచం ప్రకాశంలో ఉన్నా, అది ఎలా ఉందో నాకు తెలియదు. ఎందుకని? నేను చూడలేను కనుక.

దినకరుడు విశ్వాన్ని వెలుగులతో నింపినా, వెలుగులలో ఉన్న ఆ విశ్వాన్ని చూడటానికి నా కళ్ళల్లో వెలుగు ఉండాలి. కళ్ళల్లో వెలుగుంది. కనుకనే, బాహ్య ప్రపంచము ఆ వెలుగులో ప్రతిఫలిస్తూ ఉంది. వస్తువు కళ్ళల్లో ప్రతిఫలించ వచ్చు. అంతమాత్రాన కళ్ళు వస్తువును తెలుసుకో లేవు. చూచేందుకు కళ్ళు ఉన్నాయే గాని కళ్ళు అర్థం చేసుకోలేవు. అర్థం చేసుకునేది మనస్సు. మనస్సు భాతి. నేత్రాలు అనుభాతి. కనుక, మనస్సు కళ్ళను చూచి తెలుసుకోగలదే గాని తమను చూచే మనస్సును కళ్ళు చూడలేవు. మనస్సు వద్దకే వెళ్ళలేని నేత్రాలు ఆత్మను ఎలా సమీపిస్తాయి? ***(న తత్ర చక్షుర్గచ్ఛతి)***. నేత్రాది జ్ఞానేంద్రియాలు ఆత్మను ఎలా సమీపించ లేవో, వాక్కు మొదలైన కర్మేంద్రియాలు కూడా ఆత్మను సమీపించ లేవు ***(న వాక్ గచ్ఛతి)***.

మనస్సు జ్ఞానేంద్రియాల ద్వారా విషయ ప్రపంచాన్ని తెలుసుకుంటూ ఉంది. అట్టి మనస్సును ఆత్మ ప్రకాశింప చేస్తూ ఉంది. తనను ప్రకాశింప చేసే ఆత్మను మనస్సు ప్రకాశింప చేయలేదు. మనస్సు ఆత్మను చేరలేదు. కనుక తెలుసుకోలేదు. కనుక మనస్సు అనుభాతి. ఆత్మ భాతి ***(యన్మనసా న మనుతే)***. మనస్సు మొదలుకొని బాహ్యము లోని విషయ ప్రపంచమే గాక, దానిని ప్రకాశింప చేసే సూర్యచంద్రుల వరకు అన్నీ అనుభాతి రూపాలే. ఆత్మ ఒక్కటే భాతి. అక్కడ ఆత్మ పురుషుడు స్వతస్సిద్ధంగా, స్వప్రకాశంగా భాసిస్తూ ఉన్నాడు ***(అత్ర అయం పురుషః స్వయం జ్యోతిః)***. అదే స్వప్రకాశ చైతన్యము. స్వరూప చైతన్యము. ఆత్మ చైతన్యము. చైతన్యము అద్వితీయము కనుక అదే బ్రహ్మ చైతన్యము. బ్రహ్మపదము. పరమపదము. పరంధామము. ఆ చైతన్య ప్రకాశంపై ఆధారపడి సమస్తమూ ప్రకాశిస్తూ ఉంది ***(తస్య భాసా సర్వ మిదం విభాతి)***.

కనుక అనుభాతి రూపాలుగా ప్రకాశిస్తున్న సర్వ తేజస్సులకు చైతన్య జ్యోతి, లేదా పరంజ్యోతి సాక్షియై ఉంది.

**సాక్షీ చైతన్యము**

దీపాన్ని నీవు వెలిగించావు. దీపం విషయంలో నువ్వు సాక్షివి. ఎందుకని? దీపం వెలగక ముందు నువ్వు ఉన్నావు. దీపం ఆరిన తరువాత కూడా నీవు ఉంటావు.

బస్సు స్టాప్ వద్ద నువ్వు నిలబడి ఉన్నావు. నేను నీ వద్దకు వచ్చి ఫలానా బస్సు వచ్చిందా? అని అడుగుతాను. వచ్చి వెళ్ళింది అని నువ్వు చెబుతావు. అలా వచ్చి వెళ్ళిన బస్సు విషయంలో నువ్వు సాక్షివి. ఎందుకని? బస్సు రాక ముందు నువ్వు ఉన్నావు. బస్సు వెళ్ళిన తరువాత కూడా నీవు ఉన్నావు.

మనస్సులో వృత్తులు, లేదా సంకల్పాలు కదులుతూ ఉంటాయి. ఒక సంకల్పం మరొక సంకల్పం కాదు. కాని, ఒక సంకల్పం తరువాతే మనస్సులో మరొక సంకల్పము కదుల్తుంది. బస్సులు అనేకము నడుస్తూ ఉన్నా, ఒక దాని తరువాతే మరొకటి వచ్చినట్లు, ఒక సంకల్పం తరువాతే మరొక సంకల్పం వస్తూ ఉంటుంది. అలాగే పోతూ ఉంటుంది. చైతన్యము ఉంటేనే సంకల్పాలు నడుస్తాయి. సంకల్పాలు నడుస్తూ ఉంటే చైతన్యము ఉంటుంది. సంకల్పాలు లేనపుడు చైతన్యము స్వయంగా భాసిస్తూ ఉంటుంది. సంకల్పాలకు ఆద్యంతాలు ఉన్నాయి. వృత్తుల ఆద్యంతాలలో అనంతమైన ఆత్మ చైతన్యము సాక్షీ మాత్రంగా ఉంది. వృత్తులు ఉన్నప్పుడు వృత్తులను ప్రకాశింప చేస్తూ ఉంది. వృత్తులు లేని దశలో వృత్తి రహిత చైతన్యంగా శోభిస్తూ ఉంది. అదే ప్రత్యగాత్మ. బుద్ధి వృత్తులకు సాక్షిగా భాసిస్తున్న అట్టి ప్రత్యగాత్మ నేనే అని తెలుసుకోమన్నది అధ్యాత్మోపనిషత్ ***( జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తి సాక్షిణమ్ సోహ మితి ).*** మరి, ప్రత్యగాత్మ పరమాత్మ కన్నా భిన్నమా? కాదు. ప్రత్యగాత్మే పరమాత్మ.

పరమాత్మ సదనంలో సూర్యచంద్రాగ్నులు ప్రకాశించలేక పోయారు. ఆత్మే పరమాత్మ కనుక ఆత్మ సన్నిధిలో కూడా ప్రకాశించ లేరు.

కన్ను చూస్తుంది. కంటికి సూర్యుడు అధిష్ఠాన దేవత. వాక్కు పలుకుతుంది. వాచకానికి అగ్ని అధిష్ఠాన దేవత. మనస్సు ఆలోచిస్తుంది. మనస్సుకు చంద్రుడు అధిష్ఠాన దేవత. సూర్యచంద్రాగ్నులు పరమాత్మ సన్నిధిలో ఎలా ప్రకాశించ లేరో అలాగే వాక్, చక్షువు, మనస్సు ఆత్మ సన్నిధిలో ప్రకాశించ లేవు. అనుభాతి రూపాలు కనుక ఆత్మను సమీపించ లేక, పొందలేక వెను దిరుగుతాయి ***( యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ -*** *తైత్తిరీయోపనిషత్ ).*

సూర్యచంద్రాగ్నులు, ఇంద్రియ మనస్సులు పరంధామమును చేరలేక వెనుదిరుగు తున్నాయి. కాని, నువ్వు అలా కాదు. ఆ దివ్యధామాన్ని చేర గలవు. అంతే కాదు. అక్కడికి చేరిన తరువాత తిరిగి రావు. సంసారంలో తిరిగి ప్రవేశించవు ***( యద్గత్వా న నివర్తన్తే ).*** ఎందుకని? నీవు అనంతాత్మవు కనుక. పూర్ణాత్మవు కనుక. నీవే బ్రహ్మము కనుక. నీవు తిరిగి రావు. కారణం, నీవు తరలి పోలేదు. నువ్వెక్కడ లేవని పోవాలి? ఏది లేదని, ఏది కాదని తిరిగి రావాలి? నీవే అనంతాత్మవు. ఆనందాత్మవు. 'నేను - నేను' అనే స్ఫురణ ఎక్కడైతే కదులుతూ ఉందో, ఆ హృదయ పద్మములో సాక్షాత్తు ఆత్మ రూపంలో భాసిస్తున్న బ్రహ్మము నీవే ***( హృదయ కుహర మధ్యే కేవల బ్రహ్మ మాత్రం అహం అహం ఇతి, సాక్షాత్ ఆత్మరూపేణ భాతి -*** *శ్రీ రమణ మహర్షి ).*

ఇది తెలియనంత వరకు ప్రయత్నాలే సాగుతూ ఉంటాయి. కర్మలే కొనసాగుతూ ఉంటాయి. ఎంత కాలం ఇలా ప్రయత్నాలు సాగుతూ ఉంటాయో, అంత కాలం మనం మనకు అంతగా దూరం అవుతూ ఉంటాము. పరమాత్మకు సుదూరంగా పోతూ ఉంటాము. జన్మల్ని తోసుకుంటూ పోతూ ఉంటాము. యుగాలను ఛేదించుకుంటూ పోతూ ఉంటాము. ఇలా ఇప్పటికే ఎంత దూరం వచ్చేశామో! గుండె గుడి లోనే గోవిందుని పెట్టుకొని, అన్వేషణలో ఎంత అలసి పోతున్నామో! ఉన్నది తెలిసే దెప్పుడో, ఉన్న దానితో కలిసే దెప్పుడో? అదే ప్రశ్నిస్తున్నాడు భక్త నరసీ మెహతా.



**మందిర్ మందిర్ మూరత్ తేరీ**
**ఫిర్ భీ న దేఖూం సూరత్ తేరీ**
**యుగ బీతే న ఆయె మిలన్ కీ**
**పూరన్ మాసీరే** **॥ దర్శన్ ॥**

'ప్రభూ! ప్రతి గుడిలో నీ రూప ముంది. ప్రతి గుండెలో నీ స్వరూప ముంది. అయినా, నీ దర్శనం లేకనే, యుగాలు దొర్లి పోయాయి. ఎందుకనో, నిన్ను కలుసుకొనే పున్నమి ఇంకా విరబూయ లేదు'.

వస్తువు లేనిది కాదు. ఉన్నట్లు తెలియనిది. తెలిపితే తెలిసేది. తెలిపే గురుదేవుడు లభిస్తే బ్రతుకు పున్నమి అవుతుంది. అంతవరకు అమావాస్య చీకటిలా పడి ఉంటుంది.

*ప్రత్యగాత్మే పరమాత్మ అని అర్థం చేసుకున్నాం. కనుక జీవు లందరూ ఈశ్వర స్వరూపమే. ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాడు.*

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనః షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7

***మమ-ఏవ-అంశః-జీవలోకే-జీవభూతః-సనాతనః***
***మనః-షష్ఠాని-ఇంద్రియాణి-ప్రకృతిస్థాని-కర్షతి***

| | | | |
|---|---|---|---|
| సనాతనః | = సనాతనుడైన | ప్రకృతి స్థాని | = ప్రకృతి యందున్న |
| మమ ఏవ | = కేవలం నా యొక్క | మనః షష్ఠాని | = మనస్సుతో కూడి ఆరు అయిన |
| అంశః | = అంశము | ఇంద్రియాణి | = ఇంద్రియాలను |
| జీవభూతః | = జీవుడై | కర్షతి | = లాగుతూ ఉంది |
| జీవలోకే | = సంసారము నందు | | |

**అర్జునా! సనాతనమైన నా అంశమే సంసారంలో జీవ రూపంతో ఉంది. ప్రకృతి లోని ఇంద్రియ మనస్సులు ఆరింటిని తన వైపుకు ఆకర్షిస్తూ ఉంది.**

**వ్యాఖ్య**

నేను ఉన్నాను ***( అహమస్మి )*** అనే వాక్యములో 'నేను' అనే పదము దేహానికి సంబంధించింది కాదని, ఇంద్రియాలకు సంబంధించింది కాదని, ప్రాణానికి సంబంధించింది కాదని, మనస్సుకు సంబంధించింది కాదని ఇప్పటికే మనం తెలుసుకున్నాం. అలాగే ఈ లోకములో 'నేను' అనే వస్తువు లేదని కూడా అర్థం చేసుకున్నాం. 'నేను' అంటే జీవుడు. చైతన్య రూపుడు.

'నేను' అంటూ నేను పలుకుతున్నాను. నీవూ పలుకుతున్నావు. ఆమె కూడా పలుకుతోంది. ఇలా అనేక మంది 'నేను - నేను' అంటూ ఉన్నారు. మరి ఈ 'నేను' యొక్క లక్షణాలు మనిషి మనిషికి భిన్నంగా ఉన్నాయా? లేవు. ఎందరు పలికినా, ఎవరు పలికినా 'నేను' ఒక్కటే. 'అహం' శబ్దార్థ మొక్కటే. అదే జీవుడు. సద్రూపుడు. ఏక సద్రూపుడు. దేవుడి కన్నా భిన్నం కాని వాడు. జీవుడుగా తెలుస్తున్న వాడు ***( జీవ భూతః ).***

## జీవుడు

జీవ లోకంలో, అంటే సంసారములో జీవుడుగా తెలుస్తున్నది ***(జీవ లోకే జీవ భూతః)*** నా యొక్క సనాతన మైన అంశమే ***(మమ అంశః ఏవ సనాతనః)*** అంటున్నాడు భగవంతుడు. అంశము అంటే, భాగము అని, అవయవము లేదా అంగము అని, ఏకదేశ మని అర్థం. జీవలోకంలో, లేదా సంసారంలో ***(జీవ లోకే జీవానాం లోకే సంసారే)*** భోక్తగా, కర్తగా తెలియ బడుతున్న జీవుడు ***(జీవ భూతః భోక్తా కర్తా ఇతి ప్రసిద్ధః)*** పరమాత్మ యొక్క అంశగా ప్రసిద్దుడు. అంటే, పరమాత్మ అంశముగా కల్పితుడైన జీవుడు కర్తగా, భోక్తగా ప్రసిద్దుడు అని అర్థం. అట్టి జీవుడు సనాతనుడు ***(సనాతనః)***.

బ్రహ్మము అనంతము, నిష్కలము అని అర్థం చేసుకున్నాం. నిష్కలము అన్నప్పుడు బ్రహ్మము అఖండమే గాని భాగములు, లేక అవయవములు గల వాడు కాడు. మరి, బ్రహ్మము నిర్విశేషము, నిరవయవము అయినపుడు, అట్టి పరమాత్మకు జీవుడు ఒక అంగము, లేదా అంశము అనేది ఎలా సముచితము? జీవుడు బ్రహ్మము నందు అంశమైతే, భాగమైతే, అవయవ మైతే, బ్రహ్మము సావయవము అని నిర్ణయించవలసి వస్తుంది. సావయవ మైన దానికి నిత్యత్వము ఉండే అవకాశము లేనందున అది నశించేది అవుతుంది.

ఇంతకీ జీవుడు బ్రహ్మము కంటే అన్యంగా ఉన్నాడా? లేక జీవుడుగా తెలిసేది బ్రహ్మ మేనా? లేక జీవుడు అసలు లేడా? ఈ మూడు ప్రశ్నలు **మమైవాంశః** శబ్ద ప్రయోగము వలన ఉత్పన్న మవుతున్నాయి.

జీవుడే లేడు అనే మూడవ ప్రశ్న ఉపపన్నం కానే కాదు. జీవుడు లేడు అని అంగీకరిస్తే ***అహమస్మి*** - నేను ఉన్నాను అని చెబుతూ ప్రత్యక్షంగా కనిపిస్తున్న నిన్నే నిరాకరించినట్లు అవుతుంది. కనుక జీవ అభావ ప్రసక్తి నిర్హేతుకం.

ఇక జీవుడు బ్రహ్మము కన్నా వేరైన వాడా? అనే మొదటి ప్రశ్న. జీవుడు వేరు - బ్రహ్మము వేరు అని చెప్పినట్లైతే, జీవుడు చైతన్య రూపుడా, లేక అచేతనుడా? అని మరొక ప్రశ్న ఉదస్తుంది. జీవుడు అచేతనుడు ఎలా అవుతాడు? జీవుడే గనుక అచేతను డయితే, ***అహం - ఇదం*** - నేను - ఇది; ***అహం - మమ*** - నేను - నాది; అనే జ్ఞానము ఎలా కలుగుతుంది? జీవుడు ఏ చెట్టు లాగో, పుట్ట లాగో, కొండ లాగో, బండ లాగో పడి ఉండాలి. కనుక జీవుడు సచేతనుడే గాని అచేతనుడు కాడు.

జీవుడు సచేతను డైతే, బ్రహ్మము కంటే అన్యంగా ఎలా ఉంటాడు? అలా ఉంటే, బ్రహ్మ చైతన్యము, జీవ చైతన్యము అని రెండు చైతన్యాలు ఉండాలి. రెండు చైతన్యాలు ఉంటే, రెండూ దృశ్యాలే అవుతాయి. దృశ్యా లైతే రెండూ నశించి పోతాయి. నశించేది చైతన్య మెలా అవుతుంది? చైతన్యము ఏకము, అద్వయము. అట్టి చైతన్యము దృశ్యము కాలేదు. కనుక మొదటి పక్షము ననుసరించి చెప్పాలి అంటే, చేతన మైన జీవుడు అద్వయ బ్రహ్మము కంటే అన్యమైన వాడు కాడు.

ఇక మిగిలింది రెండవ ప్రశ్న ఒక్కటే. జీవుడుగా తెలిసేది బ్రహ్మ మేనా? జీవత్వముగా మనం చెప్పుకుంటున్నది బ్రహ్మత్వ మేనా? అవును. అదే యుక్తము.

జీవుడే బ్రహ్మ మైతే, పూర్వ శ్లోకాలలో మనం చెప్పుకున్నట్లు బ్రహ్మము పూర్ణము, అనంతము కనుక, జీవుడు కూడా పూర్ణము, అనంతము అయి ఉండాలి. మరి పూర్ణము, అనంతము అయిన బ్రహ్మమునకు సంసారిత్వము అసంగత మైనపుడు జీవునికి మాత్రం సంసారిత్వము ఎలా సంభవము? అదీ గాక, జీవుడే బ్రహ్మ మైతే, తాను పూర్ణుడు, అనంతుడు అనే జ్ఞానము జీవునికి ఎందుకు లేదు? ఈ ప్రశ్న లన్నీ ఉద్భవిస్తాయి.





దానికి శ్రుతి ప్రతిపాదిత సమాధానం ఉంది. జీవుడు బ్రహ్మమే అయినా, అవిద్య చేత జీవుడుగా తెలుస్తూ ఉన్నాడు. ఈ విషయాన్ని పదమూడవ అధ్యాయంలో కూడా మనం సవిస్తరంగా చర్చించుకున్నాం. ఇది అంగీకారం గానే ఉంది. ప్రామాణికం గానూ ఉంది. కాకపోతే, సనాతనుడైన జీవుడు నా అంశమే, **మమైవాంశః** ***(జీవభూతః మమ సనాతన అంశః ఏవ)*** అని భగవానుడు చెబుతున్నది ఎలా సమంజసము? జీవుడు బ్రహ్మము యొక్క 'అంశ', అంటే భాగము లేక అవయవము అనేది యుక్తమా? ఇరువురికి 'అంశ - అంశి' భావము సమంజసమా?

పరమాత్మ అవయవ సహితమా? లేక నిరవయవమా? బ్రహ్మమే గనుక అవయవ సహిత మైతే, బ్రహ్మమునకు అవయవ విభాగము ప్రాప్తించదా? అదే జరిగితే ఫలం వినాశమే కదా? మరి, నశించేది బ్రహ్మ మెలా అవుతుంది?

అనంతము, పూర్ణము అయిన బ్రహ్మములో అవయవము, భాగము, ఏకదేశము అంటూ 'అంశ' ప్రసక్తి ఎలా సంభవము? అనంతమైన బ్రహ్మము అద్వితీయము కావడం చేత, అంశ ప్రసక్తి తలెత్తే అవకాశమే లేదు కనుక, బ్రహ్మము నిరవయవము. నిరవయవ మైన బ్రహ్మమునకు జీవుడు అంశ ఎలా అవుతాడు? అంశ కాలేడు. అలాంటప్పుడు ***మమైవాంశో జీవలోకే జీవ భూతః సనాతనః*** అని గీతాచార్యుడు ప్రతిపాదించిన విషయము ఎలా సహేతుకము?. ఎలా సశాస్త్రీయము? ఏకము, అద్వితీయము అయిన బ్రహ్మమునకు అంశాంశి భావము ఎలా ఉపపన్నము?

నిజమే. ఈ వాదము సహేతుకం గాను, సశాస్త్రీయం గాను, పటిష్ఠం గాను ఉంది. కాకపోతే, జీవబ్రహ్మలకు ఈ అంశాంశి భావము వాస్తవమా లేక కల్పితమా? అనేది ముందు స్పష్టం కావాలి. వాస్తవికంగా అంశాంశి భావము ఉన్న ట్లైతే, అది హేతుబద్ధము కాకపోవడమే గాక, ప్రమాణ విరుద్ధము కూడా అవుతుంది. కనుక జీవబ్రహ్మలకు ప్రస్తుత శ్లోకములో భగవానుడు ప్రతిపాదించిన అంశాంశి భావము కల్పిత మైనది. ఆరోపిత మైనది. అది ఆధ్యాసిక సంబంధమే గాని వాస్తవంగా అద్వితీయ బ్రహ్మమునకు దేని తోనూ ఏ సంబంధమూ లేదు. కనుక, ఆరోపిత అంశాంశి భావము అనుపపన్నం కాదు; శాస్త్ర విరుద్ధమూ కాదు. అహేతుకము, అప్రమాణము అసలే కాదు. అనంతమైన బ్రహ్మమునకు ఉపాధి రీత్యా అంశాంశి భావము ఉపపన్నమే. అదెలాగో విశ్లేషించి అర్థం చేసుకుందాం.

### అంశ అంశి భావము

అద్వితీయమైన బ్రహ్మమునకు వాస్తవిక అంశాంశి భావము సంభవము కాదు. కాని, అవిద్యోపాధితో కూడినపుడు బ్రహ్మమునకు కల్పిత అంశాంశి భావమును చెప్పుట సమంజసమే.

ఆకాశము ఏకము. నిరవయవము. అయినా, కుండ అనే ఉపాధి వైశిష్ట్యము చేత ఘటాకాశము అని చెప్పబడుతూ ఉంది. ఘటాకాశము అని ఒక వైపు చెప్పబడుతున్నా, మరో వైపు మహాకాశము తెలుస్తూనే ఉంది. మహాకాశము నిరవయవంగా, అపరిచ్ఛిన్నంగా గోచరిస్తున్నా, ఘటోపాధి కారణంగా మహాకాశానికి అంశాంశి భావము సంభవిస్తూ ఉంది. మహాకాశము అంశి కాగా, ఘటాకాశము దాని అంశముగా తెలుస్తూ ఉంది. వాస్తవానికి మహాకాశానికి అంశాంశి భావము లేదు.

ఘట నిమిత్తంగా ఉపపన్నమైన అంశాంశి భావము ఘట భంగం జరిగిన తరువాత, నిమిత్తం తొలగి పోయిన కారణంగా మహాకాశాన్ని పొందుతూ ఉంది. ఉపాధి ఉన్నంత వరకు ఆకాశము ఘటాకాశంగా తెలుస్తూ, మహాకాశానికి కల్పిత అంశగా అర్థమై, ఉపాధి వినిర్ముక్తం కాగానే మహాకాశాన్ని పొంది కల్పిత అంశాంశి భావము నుండి విడిపడి నిరవయవ, అపరిచ్ఛిన్న స్థితిని పొంది మళ్ళీ తిరిగి రాని స్వరూపాన్ని చేరి పోతుంది

(యథా వా ఘటాద్యుపాధి పరిచ్ఛిన్నః ఘటా ద్యాకాశః ఆకాశాంశః సన్ ఘటాది నిమిత్తాపాయే ఆకాశం ప్రాప్య న నివర్తతే ఇత్యేవమ్!). ఇదే విషయాన్ని నిరూపించడానికి ఆచార్యుల వారు బింబ ప్రతిబింబ న్యాయాన్ని కూడా ఉదహరిస్తారు.

సూర్యుడు కూప జలాలలో ప్రతిబింబిస్తాడు. జలంలో ప్రతిఫలించిన ప్రతిబింబము ఎవరిదో కాదు, సూర్యునిదే. సూర్యుని అంశమే. ఈ విధంగా సూర్యునికి అంశాంశి భావము కల్పించ బడింది. బావిలో జలం ఇంకి పోగానే, నిమిత్తం తొలగి పోయిన కారణంగా, ప్రతిబింబము సూర్యబింబమును చేరి, మళ్ళీ తిరిగి రాదు **(యథా జల సూర్యకః సూర్యాంశః జల నిమిత్తాపాయే సూర్య మేవ గత్వా న నివర్తతే)**.

ఘటోపాధి వలన ఏకము, అద్వితీయము అయిన ఆకాశమునకు కల్పిత అంశాంశి భావము ఉపపన్న మైనట్లు, జలోపాధి కారణంగా ఏకమైన సూర్య బింబమునకు ఆరోపిత అంశాంశి భావము సంభవ మైనట్లు, ఘటోపాధి నిర్ముక్తం కాగానే అపరిచ్ఛిన్నమైన ఆకాశమునకు కల్పిత అంశాంశి భావము తొలగి పోయినట్లు, జలోపాధి వినిర్ముక్తం కాగానే ఏకమైన సూర్యబింబమునకు అంశాంశి భావము తొలగిపోతూ ఉంది.

అలాగే పూర్ణము, అనంతము అయిన బ్రహ్మమునకు అంశాంశి భావము అనుపపన్నమే అయినా, బుద్ధ్యుపాధి విశిష్టుడు అయినపుడు, బుద్ధ్యవచ్ఛిన్ను డైన జీవునికి అంశత్వము కల్పించబడి, జీవుడు బ్రహ్మ యొక్క అంశము - **మమైవాంశః (జీవః మమ అంశః ఏవ)** అనేది సంభవించింది. ఉపాధి వినిర్ముక్తం కాగానే పరిచ్ఛిన్నుడుగా తెలిసిన జీవుడు అనంతుడైన బ్రహ్మము గానే భాసిస్తున్నాడు. బ్రహ్మము నందు కల్పించ బడిన అంశాంశి భావము లేనిదే అగుచున్నది. ఈ విధంగా బ్రహ్మము నందు అంశాంశి భావము ఆరోపితము. ఈ విషయాన్ని క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో విస్తరించి చెప్పుకున్నాం **(అయం అర్థః క్షేత్రాధ్యాయే విస్తరశః)**. జీవుని విషయంలో భిన్నాభిప్రాయాలు ఎన్నో ఉన్నాయి. అన్యులను ప్రక్కన ఉంచితే, సంప్రదాయ గాడిలో నడిచే అద్వైతులలో కూడా అభిప్రాయ భేదా లున్నాయి. ఇది చాలా జటిలమైన విషయము. కనుక, ముముక్షువులకు ఉపకరిస్తుం దని సంక్షేపంగా జీవ నిర్వచనం కూడా అందిస్తాను.

**జీవ నిర్వచనము**

*శ్లో॥ అధిష్ఠానం చిదాభాసో బుద్ధిః ఏత త్త్రయం యదా।*
*అజ్ఞానాత్ ఏకవ ద్భాతి జీవ ఇత్యుచ్యతే తదా॥*

'అధిష్ఠానమైన ఆత్మ చైతన్యము, బుద్ధిలో ప్రతిఫలించిన చిదాభాస చైతన్యము, బుద్ధి అనే ఉపాధి - ఈ మూడు అజ్ఞానము వలన ఒకటిగా గోచరించి నపుడు జీవుడు అని పిలవడం జరుగుతూ ఉంది ' అని శ్రీశంకరాచార్య స్వామి స్వాత్మ ప్రకాశిక అనే గ్రంథంలో నిర్వచించారు.

పై మూడు అంశాలను పరిశీలిస్తే, ఆత్మ చైతన్యము నిర్వికారం కనుక అది జీవుడు అనలేము. చిదాభాసుడు మిథ్య కనుక అతడూ జీవుడు కాడు. ఇక మిగిలింది బుద్ధి. అది ఎలాగూ జడము కనుక జీవుడు కానేరదు. ఈ మూడిటిలో ఏ ఒక్కటి, లేదా ఏ రెండు జీవుడు కాకపోయినా, మూడు కలిసి నపుడు జీవ నామం వినిపిస్తూ ఉంది అనేది ఆచార్యుల వారి అభిప్రాయము. శ్రీ విద్యారణ్యస్వామి వేదాంత పంచదశిలో ఎలా నిర్వచించారో చూడండి.

*శ్లో॥ చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చ యః పునః।*
*చిచ్ఛాయా లింగ దేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే॥*





అధిష్ఠానమైన ఆత్మ చైతన్యము, లింగ దేహము లేదా సూక్ష్మ శరీరము, లింగ దేహము నందు ప్రతిబింబించిన చిదాభాసుడు - ఈ మూడు కలిసి జీవుడు అనబడతాడు అని శ్రీ విద్యారణ్యస్వామి వేదాంత పంచదశి గ్రంథం లోని ద్వైత వివేక ప్రకరణములో తెలియ చేశారు (*వేదాంత పంచదశి ; 4 వ అ - 11 వ శ్లో*).

శ్రీ శంకరుల నిర్వచనానికి, శ్రీ విద్యారణ్యుల నిర్వచనానికి పరస్పరం అభేదమే. శ్రీ శంకరులు బుద్ధి అన్నారు. శ్రీ విద్యారణ్యులు లింగ దేహము అన్నారు. రెండూ ప్రకృతి పరిణామాలే, గుణ పరిణామాలే. బుద్ధి సూక్ష్మ శరీరానికి, లేదా లింగ దేహానికి సంబంధించిందే కదా! దీనిని శాస్త్రంలో ఆభాసవాదము అంటారు.

ఈశ్వరుడు ఉపాధిలో ప్రవేశించడమే గాక, ఉపాధి మనుగడకు ప్రాణాదులను ప్రేరేపించాడు **(సన్నిధి మాత్రేణ)** అని కూడా శ్రీ విద్యారణ్యులు చెప్పారు **(కృత్వా రూపాంతరం జైవం దేహే ఇతి తాః శ్రుతయః ప్రాహుః జీవత్వం ప్రాణధారణాత్)**. ఇదంతా శ్రుతి సమ్మతమే. కొందరు జీవ నిర్వచనంలో ఆభాస వాదమును కాకుండా ప్రతిబింబ వాదమును ప్రతిపాదిస్తారు. భామతీ వ్యాఖ్యాత వాచస్పతి వాదము మరో విధంగా ఉంది. అవన్నీ చర్చించడానికి ఇది సందర్భమే అయినా, ఎందుకో నాకు సానుకూలంగా లేదు. ఎంత తిరిగినా భూమి గుండ్రంగా ఉన్న దన్నట్లు, ఎన్ని చెప్పుకున్నా మళ్ళీ శ్రీ శంకరుల దగ్గరికి రావలసిందే. అదెలాగూ చెప్పాశాను కనుక చాలు అని సరిపెట్టుకుంటున్నా.

ఈ విధంగా దేహంలో ప్రవేశించిన పరమేశ్వరుని అంశ అయిన జీవాత్మ దేహములో అయిదు జ్ఞానేంద్రియాలను, మనస్సుతో కలసి ఆరింటిని తన వైపుకు ఆకర్షిస్తున్నాడు **(మనః షష్ఠాని ఇంద్రియాణి శ్రోత్రాదీని ఆకర్షతి)**. ఇక్కడ ఇంద్రియాలు అనేది ఉపలక్షణం. జ్ఞానేంద్రియాలు అంటే కర్మేంద్రియాలు, పంచ ప్రాణాలు అని కూడా అర్థం. ఇలా సంసారంలో ప్రవేశించిన జీవుడు ఒక దేహాన్ని విడిచి మరొక దేహంలో ప్రవేశించే టప్పుడు, వాటిని వెంట పెట్టుకొని నిష్క్రమిస్తున్నాడు.

అదెలాగో చెబుతున్నాడు.

శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః।
గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గన్ధా ని వాశయాత్॥ 8

*శరీరం-యత్-అవాప్నోతి-యత్-చ-అపి-ఉత్క్రామతి-ఈశ్వరః*
*గృహీత్వా-ఏతాని-సంయాతి-వాయుః-గంధాన్-ఇవ-ఆశయాత్*

| | | | |
|---|---|---|---|
| ఈశ్వరః | = ఈశ్వరుడు | వాయుః | = గాలి |
| యత్ | = ఎప్పుడు | ఆశయాత్ | = సౌరభ స్థానము నుండి |
| శరీరం | = శరీరమును | గంధాన్ ఇవ | = గంధము వలె |
| అవాప్నోతి | = పొందుతాడో | ఏతాని | = ఈ ఇంద్రియములను |
| యత్ చ అపి | = ఎప్పుడు | గృహీత్వా | = గ్రహించి |
| ఉత్క్రామతి | = విడుస్తున్నాడో | సంయాతి | = వెళ్తాడు |

**అర్జునా! గాలి పోతూ పోతూ పువ్వుల లోని పరిమళాన్ని వెంట తీసుకొని పోతుంది. అలాగే జీవుడు ఒక శరీరాన్ని విడిచి పెట్టి మరొక శరీరంలో ప్రవేశించే టప్పుడు ఇంద్రియ మనస్సులు ఆరింటిని వెంట పెట్టుకొని పోతాడు.**

## వ్యాఖ్య

దేహాది సంఘాతానికి ప్రభువైన జీవుడు ఎప్పుడైతే ఉత్క్రమిస్తున్నాడో, అంటే పైకి లేస్తున్నాడో అప్పుడు, మనస్సు ఆరవదిగా గల ఇంద్రియాలను ఆకర్షిస్తున్నాడు, లేదా లాగుతున్నాడు అనే అర్థ ప్రాధాన్యాన్ని అనుసరిస్తూ, పూర్వ శ్లోకము యొక్క ద్వితీయ పాదాన్ని ముందుగా గ్రహించి ప్రస్తుత శ్లోకముతో అన్వయించుకోవాలి. అప్పుడు, జీవుడు పూర్వ శరీరాన్ని విడిచి మరొక శరీరాన్ని పొందునపుడు మనస్సు ఆరవదిగా గల ఇంద్రియాలను వెంట పెట్టుకొని వెళ్తాడు అనే భావం స్పష్ట మవుతుంది. ఎలా వెళ్తాడు? ఆ విషయాన్నే సోదాహరణంగా ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.

వెనుకటి శరీరాన్ని విడిచి వేరొక శరీరంలో ప్రవేశించుటకు ఉత్క్రమిస్తున్న సమయంలో దేహాది సంఘాతానికి ప్రభువు (**ఈశ్వరః**) అయిన జీవుడు ఇంద్రియ మనస్సులను ఆకర్షిస్తున్నాడు. ఈ సందర్భములో దేహాది సంఘాత స్వామిని ఈశ్వరుడు అంటున్నాడు (***ఈశ్వరః దేహాది సంఘాత స్వామీ జీవః***). అంటే, జనన మరణాల విషయంలో ప్రస్తావించ బడుతున్న జీవుడు స్వరూపతః ఈశ్వరుడే. ఈశ్వరుడు చైతన్య రూపుడు కనుక అతనికి జననమరణాలు లేవు. కర్తగా, భోక్తగా జీవుడు వ్యావహారికంగా పిలువ బడుతున్నా, వాస్తవానికి అతడు కర్తా కాడు, భోక్తా కాడు. దేహేంద్రియ మనస్సులతో తాదాత్మ్యం చెంది ఉండటం చేత జీవుడు భోక్త అనే ఆరోపణ జరుగుతోంది.

**ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః ॥**

దేహము, ఇంద్రియాలు, మనస్సుతో కూడిన జీవుణ్ణి భోక్త అని చెబుతారు అన్నది కఠోపనిషత్తు. భోక్త కనుక, జీవుడు సంసారి అయ్యాడు. అంటే, దేహేంద్రియ మనస్సులతో తాదాత్మ్యము లేనపుడు జీవుడు భోక్త కాడనే కదా అర్థం? అవును. కానీ, ఈ తాదాత్మ్యము ఆధ్యాసిక మని ముందే చెప్పుకున్నాం కదా! కనుక జీవుడు ఎన్నడూ భోక్త కాలేడు. ఎందుకని? కర్త కాడు కనుక. జీవుడు కేవలం చైతన్య రూపుడే కావడం చేత జీవునికి భోక్తృత్వం లేదు (***న హి కేవలస్య ఆత్మనః భోక్తృత్వం అస్తి*** - *కఠ భాష్యము*). జీవునికి భోక్తృత్వము స్వతఃసిద్ధము కాదు. ఆరోపితము. ఒకవేళ కర్తృత్వ భోక్తృత్వాలు జీవునికి స్వభావములే అయితే, స్వభావము నశించదు కనుక జీవుడు నిత్య సంసారి అవుతాడు.

కనుక, ఉపాధి స్థాయి నుండి జననమరణాలు చెప్పబడుతున్నాయే గాని, వాస్తవానికి జీవునికి చావు పుట్టుకలు లేవు. ముక్క లయ్యేది కుండే గాని కుండ లోని ఆకాశం కాదు కదా! కనుకనే, సనాతనుడైన జీవుడు బ్రహ్మము యొక్క అంశమే అని చెప్పడం జరిగింది *(15 వ అ - 7 వ శ్లో)*. కుండను తీసుకొని పోతూ ఉంటే, కుండ లోని ఆకాశాన్ని కూడా తీసుకొని పోతున్నట్లు అనిపిస్తుంది. ప్రయాణం చేసేది కుండే గాని కుండ లోని ఆకాశం కాదు. ఘటాకాశము ప్రత్యేకంగా ఎక్కడుంది పయనించ డానికి? ఘటాకాశము మహాకాశము నుండి వేరైనది ఎప్పుడు? ఘటాకాశమును ఆరోపించడం చేత ఘటం పయనిస్తూ ఉంటే, ఘటాకాశం కూడా చలిస్తూ ఉందని భ్రమిస్తున్నాము. వాస్తవానికి ఘటమే ఆకాశంలో కదులుతూ ఉంది. అలాగే మరణంలో స్థూల దేహము నుండి సూక్ష్మ దేహము విడిపడి మరో శరీరంలో ప్రవేశిస్తూ ఉంటే, జీవుడు ప్రయాణం చేస్తున్నట్లు మనం ఆరోపిస్తున్నాము. జీవుడు ఈశ్వరుడే కనుక రాకపోకలు లేని వాడు. జననమరణాలు తెలియని వాడు. అందు చేతనే ఉపనిషత్తులు జీవుని కర్మాకర్మలను ***ధ్యాయతి ఇవ, లేలాయతి ఇవ*** - జీవుడు ధ్యానించు వాని వలె, చలించు వాని వలె ఉన్నాడు అని ప్రబోధించాయి. అలాగే జననమరణాల మధ్య కూడా జీవుడు పయనిస్తున్నాడు





అనుకుంటున్నాము. వాస్తవానికి పయనించు వాని వలె ఉన్నాడు. ఇక్కడ 'వలె' (**ఇవ**) అనేది చాలా ప్రధానమైన విషయము. ఇక ప్రయాణం ఎలా సాగుతూ ఉందో చూద్దాం.

**జీవ యానము**

అర్జునా! జీవుడు వెనుకటి శరీరాన్ని విడిచే టప్పుడు గాని (***ఉత్క్రామతి***), వేరొక శరీరాన్ని పొందే టప్పుడు గాని (***అవాప్నోతి***), గాలి పువ్వుల నుండి సుగంధాన్ని వెంట పెట్టుకొని పోయినట్లు, ఇంద్రియ మనస్సులను వెంట పెట్టుకొని పయనిస్తాడు.

పువ్వులలో సువాసన ఉంది. వాయువు సువాసనను తీసుకొని పోతుందే గాని, పువ్వులను తీసుకొని పోదు. పువ్వులు అక్కడే ఉంటాయి. గాలి సుగంధాన్ని మాత్రమే వెంట పెట్టుకొని పోతుంది. మరణంలో స్థూల దేహము పువ్వు లాగా అక్కడే ఉంటుంది. పువ్వు లోని సౌరభాన్ని గాలి తీసుకొని పోయినట్లు, స్థూల దేహం లోని సూక్ష్మ దేహాన్ని మాత్రమే జీవుడు వెంట పెట్టుకొని పోతాడు.

పుష్పాలు స్థూల శరీరాలు. గంధాలు పుణ్య పాపాది వాసనా యుతమైన సూక్ష్మ శరీరాలు. వాయువు జీవాత్మ. గాలి ఎలాగైతే పువ్వును విడిచి పెట్టి సుగంధాన్ని వెంట పెట్టుకొని పోతుందో, జీవుడు అలాగే స్థూల దేహాన్ని విడిచి పెట్టి సూక్ష్మ దేహాన్ని వెంట పెట్టుకొని వెళ్తాడు. ఇప్పుడు అర్థమైంది అనుకుంటాను. జనన మరణాలలో ప్రయాణం సాగించేది సూక్ష్మ దేహమే గాని జీవుడు కాడు. స్థూల దేహమూ కాదు. స్థూల దేహము శ్మశానంలో అంత మవుతుంది. జీవుడు అంతమయ్యే వాడు కానందున నిత్యుడై ఉంటాడు. సూక్ష్మ దేహము మాత్రం అజ్ఞానము అంతం కానంత వరకు చావుపుట్టుకల మధ్య తిరుగుతూ ఉంటుంది.

మరణానంతరము ప్రయాణము అనివార్యం అని తేలి పోయింది. కాకపోతే, పయన మయ్యేది సూక్ష్మ శరీరము కనుక, స్థూల శరీరం తోడు రాదు. ప్రోగు చేసుకొనిన సంపదలు వెంట రావు. బంధుజనం కలిసి పయనించరు.

*సీ॥ ధరణిలో వెయ్యేండ్లు తనువు నిల్వగ బోదు ధన మెప్పటికి శాశ్వతంబు గాదు*
*దారాసుతాదులు తన వెంట రాలేరు భృత్యులు మృతిని తప్పింప లేరు*
*బంధుజాలము తన్ను బ్రతికించుకో లేదు బలపరాక్రమ మేమి పనికి రాదు*
*ఘనమైన సకల భోగ్యం బెంత గల్గియు గోచి మాత్రం బైన గాంచబోదు*

*తే॥ గీ॥ వెఱ్ఱి కుక్కల భ్రమలన్ని విడచి నిన్ను భజన చేసెడి వారికి పరమ సుఖము*
*భూషణ వికాస శ్రీధర్మ పుర నివాస ! దుష్ట సంహార! నరసింహ! దురితదూర!*

దేహము ఈ లోకంలో వెయ్యేండ్లు ఉండేది కాదు. ధనము ఎవరి దైనా అనిత్యమే. తనువు చాలించి పయనమయ్యే నాడు భార్యాబిడ్డలు వెంట రారు. సేవకు లెందరున్నా మరణాన్ని నివారించ లేరు. బంధువులు బ్రతికించుకో లేరు. శక్తిసామర్థ్యాలు మరణంలో ఉపకరించవు. గొప్ప సంపద లున్నా, పోయే నాడు గోచి కూడా తోడు ఉండదు అని నరసింహ శతకము.

తోడు వచ్చేవి, తోడు నడిచేవి ఇంద్రియాలు అయిదు, మనస్సు ఆరవది (***మనః షష్ఠానీంద్రియాణి***). వాటిని పవిత్రంగా ఉంచుకోవాలి. దివ్యంగా మలచుకోవాలి. వెంట వచ్చేవి అవే కనుక, అవి మంగళకరంగా ఉంటే, తరువాత జన్మ శోభాయమానంగా ఉంటుంది. అలా ఇంద్రియ మనస్సులను పవిత్రం చేసుకొనే ప్రక్రియను భాగవతం దివ్యంగా వివరించింది.

**సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ**
**సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము**
**విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరి దవిలిన మనము మనము**
**భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి**
**తే॥ గీ॥ దేవ దేవుని జింతించు దినము దినము చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు**
**కుంభి నీ ధవు జెప్పెడి గురుడు గురుడు తండ్రి హరి జేరుమని యెడి తండ్రి తండ్రి !**

అంటూ ఇంద్రియ మనోబుద్ధులను ఎక్కడ నియమిస్తే పవిత్ర మౌతాయో, ఎలా వినియోగించుకుంటే బ్రతుకు భవ్య మౌతుందో తెలుపుతూ ప్రహ్లాదుడు ముముక్షువులకు మార్గ నిర్దేశం చేశాడు.

మరణానంతరము జీవుని వెంబడించి వచ్చేవి ఇంద్రియాలు, మనస్సే కనుక వాటిని ఇప్పుడే, ఇక్కడే పవిత్రం చేసుకోవాలి. కర్మేంద్రియాలైన హస్తాలు దైవపూజలో, భగవత్కార్యాలలో సదా పునీతం కావాలి. భగవంతుని స్మరించేందుకు అనువైన పరమేశ్వర సన్నిధికి, సంత్ పురుషుల సదనాలకు నిత్యము నడక సాగుతూ ఉండాలి. కరచరణాదులు కర్మేంద్రియ సమూహానికి ఉపలక్షణము. ఈ విధంగా కర్మేంద్రియాలను పునీతం చేసుకుంటే, ఉత్తర జన్మలలో కర్మేంద్రియాలన్నీ వాటి వాటి కార్యాలను భగవన్ముఖంగా కొనసాగించి బ్రతుకుకు ధన్యతను చేకూర్చుతాయి.

అలాగే, శ్రోత్రాది జ్ఞానేంద్రియాలను కూడా నిత్యము జ్ఞానగంగలో పవిత్ర మయ్యే లాగా శ్రద్ధ వహించాలి. మహాత్ముల దర్శనంతో, మాధవ సందర్శనంతో నేత్రాలను, దివ్య శ్రవణంతో వీనులను, పవిత్ర భాషణంతో, దివ్య నామ సంకీర్తనముతో నాలుకను పునీతం చేసుకోవాలి.

కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలను భగవ త్సంబంధమైన కర్మయోగ, జ్ఞానయోగ సాధనలలో పవిత్రం చేసుకున్నట్లు, మనోబుద్ధులను సదా భగవ చ్చింతనము, ఆత్మవిచారము, దైవ ధ్యానాలతో మంగళకరంగా మార్చుకోవాలి. వైభవోపేతమైన ఈ సాధనల ఫలితంగా ఉత్తర జన్మలు కూడా భగవన్మయ మవుతాయి. ఈ విధంగా దేహ పతనానంతరము వెంట వచ్చే వాటి విషయంలో ప్రతి ఒక్కరు సావధానులై ఉండాలి.

*జీవుడు జన్మాంతర ప్రస్థానంలో ఎందుకని ఇంద్రియ మనోబుద్ధులను తీసుకొని పోతున్నాడో, ఆ విషయాన్ని వివరిస్తున్నాడు.*

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే ॥ 9

***శ్రోత్రం-చక్షుః-స్పర్శనం-చ-రసనం-ఘ్రాణం-ఏవ-చ***
***అధిష్ఠాయ-మనః-చ-అయం-విషయాన్-ఉపసేవతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయం | = | ఈ ఆత్మ | ఘ్రాణం ఏవ చ | = | ముక్కును |
| శ్రోత్రం | = | చెవిని | మనః చ | = | మనస్సును |
| చక్షుః | = | కంటిని | అధిష్ఠాయ | = | అధిష్ఠించి |
| స్పర్శనం చ | = | చర్మమును | విషయాన్ | = | విషయములను |
| రసనం | = | నాలుకను | ఉపసేవతే | = | అనుభవిస్తుంది |

**అర్జునా! జీవుడు ఇంద్రియ మనస్సులు ఆరింటిని ఆశ్రయించుకొని విషయాలను అనుభవిస్తాడు.**





**వ్యాఖ్య**

ప్రయాణికులు వారికి అవసరమైన వస్తువులను జాగ్రత్తగా వెంట పెట్టుకొని వెళ్తూ ఉంటారు. వారు వెళ్ళిన చోట అవి ఉపయుక్తంగా ఉంటాయనే వెంట తీసుకొని పోతారు. తీరా చేర వలసిన చోటికి చేరిన తరువాత వెంట తెచ్చుకున్న వాటిని వినియోగించుకుంటూ ఉంటారు. అలాగే జన్మాంతరాలలో పయనించే జీవుడు పూర్వ దేహాన్ని విడిచి పెట్టే టప్పుడు ఐదు ఇంద్రియా లను, ఆరవది అయిన మనస్సును వెంట పెట్టుకొని వెళ్ళి, వాటితో కలిసి ఉత్తర దేహంలో ప్రవేశిస్తాడు. తీరా ప్రవేశించిన తరువాత, తన వెంట తెచ్చుకొనిన వాటిని వినియోగించు కుంటాడు. ఇదే ఈ శ్లోకంలో ప్రధాన మైన విషయం.

విషయ ప్రపంచములో చరించే వ్యక్తి కర్మాచరణమునకు బాహ్యం లోని శబ్దాది విషయాలే హేతువులు. ఆ శబ్దాది విషయాలను అనుభవించ డానికి సాధనము లైన శ్రోత్రాది ఇంద్రియాలు, ఆరవది అయిన మనస్సు వ్యక్తిలో ఉన్నాయి. జన్మాంతరాలలో జీవుని వెంబడించి వచ్చాయి. అవే చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు, మనస్సు అనేవి ( ***శ్రోత్రం చక్షుః స్పర్శనం, రసనం, ఘ్రాణమ్, మనః*** ). శ్రోత్రాది పంచేంద్రియాలలో ఒక్కొక్క ఇంద్రియముతో కలిసిన మనస్సును జీవుడు ( ***అయం*** ) అధిష్ఠించి, దేహము నందుండి శబ్దాది విషయ వ్యాపారా లైన వినడము, కనడము, స్పృశించడము, రుచి చూడటము, వాసన చూడటము, ఆలోచించడము మొదలైన విషయాలను అనుభవిస్తూ ఉంటాడు ( ***ఉప సేవతే*** ).

శ్రోత్రాది పంచేంద్రియాలతో సంబంధం కలిగిన మనస్సును ఆశ్రయించుకొని, వినాలనే కుతూహలంతో చెవితో చేరి శబ్దాలను వింటాడు. మనస్సును అధిష్ఠించి, చూడాలనే ఆసక్తితో కళ్ళతో కలిసి రూపాలను, రంగులను వీక్షిస్తాడు. మనస్సులో కొలువై, ఆఘ్రాణించాలనే అభిలాషతో ముక్కుతో కుమ్మక్కై వాసనలను పీలుస్తాడు. మనస్సులో చేరి, రుచి చూడాలనే అభిరుచితో నాలుకతో జతై రుచులను అనుభవిస్తాడు. మనస్సులో నిలిచి, స్పృశించాలనే స్పృహతో త్వగింద్రియంతో, అంటే చర్మముతో చెట్ట పట్టా లేసుకొని వస్తువులను తాకుతూ ఉంటాడు. ఈ విధంగా మనస్సులో సదా మనుగడను సాగిస్తూ, ఒక్కొక్క ఇంద్రియముతో ప్రత్యేకంగా కలుస్తూ, ఆయా విషయాలను జీవుడు అనుభవిస్తూ ఉంటాడు.

ఇంద్రియ మనస్సుల ద్వారా జీవుడు విషయాలను అనుభవిస్తున్నాడు. కనుక పంచేంద్రియాలు, ఆరవది అయిన మనస్సు జీవునికి భోగ సాధనాలుగా ఉన్నాయి. పనిముట్లుగా ఉపకరిస్తున్నాయి. పని వాడు పనిముట్టు కన్నా అన్యమైన వాడు. అలాగే, జీవుడు ఇంద్రియ మనస్సుల కన్నా భిన్నమైన వాడు.

ఇంద్రియ మనస్సులు సూక్ష్మ శరీరానికి సంబంధించినవి. పూర్వానుభవాలకు సంబంధించిన వాసనలన్నీ సూక్ష్మదేహం లోనే ఉంటాయి. మనస్సు లోనే ఉంటాయి. జీవి నూతన దేహంలో ప్రవేశించే టప్పుడు పూర్వ వాసనలతో నిండి ఉన్న మనస్సుతో కలిసే ప్రవేశిస్తాడు. పూర్వ కర్మలకు సంబంధించిన ఫలాలను కూడా మనస్సే, అనగా సూక్ష్మదేహమే అనుభవిస్తుంది. పుణ్య పాప ఫలాలను భోగిస్తుంది. ఈ సూక్ష్మదేహంతో తాదాత్మ్యం చెందడం చేత జీవుడు భోక్తగా, ద్రష్టగా, శ్రోతగా, జ్ఞాతగా తెలుస్తూ ఉంటాడు. వాస్తవానికి భోక్త మనస్సే గాని జీవుడు కాడు. కనుక సూక్ష్మ శరీరము జీవునికి ఉపాధిగా తెలుస్తూ ఉంది.

**బహిర్ముఖాసక్తి**

శబ్దాది విషయాలన్నీ బాహ్య ప్రపంచం లోనే ఉన్నాయి. పూర్వ వాసన లన్నీ విషయ సంబంధం గానే ఉన్నాయి. దానికి తోడు ఇంద్రియాలు కూడా బాహ్య దృష్టి కలవి గానే సృష్టింపబడి ఉన్నాయి. సృష్టికర్తే అలా సృజించాడు అన్నది వేదం.

మ॥ **పరాంచి ఖాని వ్యతృణ త్స్వయం భూః**
**తస్మా త్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్,**

బ్రహ్మదేవుడు ఇంద్రియాలను బహిర్ముఖం గానే సృష్టించాడు. అందుచేత మనిషి బాహ్యాన్నే చూస్తాడు. అంతరాత్మను చూడలేడు అన్నది కఠోపనిషత్.

మనం పూర్వ శ్లోక వ్యాఖ్యానంలో చెప్పుకున్నట్లు, ఇంద్రియ మనస్సులను భగవత్కార్యాలలో పవిత్రం చేసుకుంటే, తత్సంబంధమైన తాత్త్విక వాసనలే మనస్సులో నిక్షిప్తమై ఉంటాయి కనుక, బహిర్ముఖ మయ్యే సహజ స్వభావము ఇంద్రియ మనస్సులకు ఉన్నప్పటికీ, పూర్వ వాసనా జనిత పుణ్య సంస్కారం చేత అవి అంతర్ముఖమై, అంతరాత్మ వైపు పయనించే అవకాశం సాధకులకు లభ్య మౌతుంది.

ఈ విధంగా పరమాత్మ స్వరూపుడైన జీవుడు దేహగతుడై ఉన్నా ఎందుకని మనుషులు గ్రహించలేక పోతున్నారు? చెబుతున్నాడు.

ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10

**ఉత్క్రామంతం-స్థితం-వా-అపి-భుంజానం-వా-గుణాన్వితం**
**విమూఢాః-న-అనుపశ్యంతి-పశ్యంతి-జ్ఞానచక్షుషః**

| | | | |
|---|---|---|---|
| ఉత్క్రామంతం | = ఉత్క్రమించే వానిని గాని | విమూఢాః | = అజ్ఞానులు |
| స్థితం వా అపి | = ఉన్న వానిని గాని | న అనుపశ్యంతి | = చూడలేరు |
| భుంజానం వా | = అనుభవించుచున్న వానిని గాని | జ్ఞానచక్షుషః | = జ్ఞానదృష్టి గలవారు |
| గుణాన్వితం | = గుణములతో గూడిన వానిని | పశ్యంతి | = చూస్తారు |

**అర్జునా! వెళ్ళేవాడు, ఉండేవాడు, అనుభవించే వాడు, గుణయుతుడు అయిన జీవాత్మను అజ్ఞానులు తెలుసుకో లేరు. జ్ఞాన నేత్రం కల వారు దర్శిస్తారు.**

### వ్యాఖ్య

ఈ లోకంలో సనాతనుడైన జీవుడు తన అంశయే, తన స్వరూపమే అని భగవంతుడు ఏడవ శ్లోకంలో చెప్పడం జరిగింది. దేహాది సంఘాతానికి ప్రభువైన జీవుడు పూర్వ దేహాన్ని విడిచిపెట్టే టప్పుడు గాని, మరొక శరీరంలో ప్రవేశించే టప్పుడు గాని, పుష్పము నందలి సుగంధమును వాయువు వెంట పెట్టుకొని పోయినట్లు, ఇంద్రియ మనస్సులను వెంట పెట్టుకొని పోతున్నాడు అని ఎనిమిదవ శ్లోకంలో ప్రవచించడం జరిగింది. దేహ గతుడై ఉన్నప్పుడు కూడా మనస్సును అధిష్ఠించి, ఇంద్రియాలతో ప్రత్యేకంగా సంగమిస్తూ, విషయాలను జీవుడు అనుభవిస్తున్నాడు అని తొమ్మిదవ శ్లోకంలో ప్రసంగించడం జరిగింది. ఈ విధంగా దేహాన్ని పరిత్యజించే టప్పుడు గాని (***ఉత్క్రామన్తం, పరిత్యజన్తం దేహం పూర్వోపాత్తం***), దేహస్థితుడై ఉన్నప్పుడు గాని (***స్థితం వా దేహే తిష్ఠన్తం***), గుణాలతో కూడి విషయాలను అనుభవిస్తు న్నప్పుడు గాని (***భుంజాన వా శబ్దాదీన్, సుఖదుఃఖ మోహాఖ్యైః గుణైః అనుగతమ్***)- వీటన్నిటిలో జీవుని సన్నిధి సుస్పష్టంగా కనిపిస్తూ ఉండినా (***అత్యన్త దర్శన గోచర ప్రాప్తం***), ఎందుకని మానవులు గుర్తించలేక పోతున్నారు? ఎందుకని దర్శించలేక పోతున్నారు? అనేది ఆశ్చర్యకర మైన ప్రశ్న. ఈ సమస్య ప్రస్తుత శ్లోకంలో పరిష్కరింప బడుతూ ఉంది.

భగవంతుడు అందరికీ కావాలి. కాని, భగవంతుణ్ణి అందరూ తెలుసుకో లేరు. మోక్షం అందరికీ కావాలి.





కాని మోక్ష మేమిటో అందరూ అర్థం చేసుకో లేరు. అవసర మైతే అందరికీ ఉంది. కాని తీరే ఉపాయం అందరి వద్ద లేదు. జీవుడు ఆత్మస్వరూపమే కదా! జీవుని అస్తిత్వం అంతటా సుస్పష్టంగా ఉన్నా, ఎందుకని దర్శించ లేక పోతున్నారు? ఈ దుస్థితిని చూచి భగవంతుడు కూడా చలించి పోతున్నాడు అని ఈ సందర్భంలో శ్రీశంకరాచార్యస్వామి అనితర సాధ్యంగా భాష్యంలో ప్రవచించారు. అయ్యో! మానవులకు ఎంత కష్ట మొచ్చి పడింది అని భగవంతుడు జాలి పడుతున్నాడట (***అహో కష్టం వర్తతే ఇతి అనుక్రోశతి చ భగవాన్!***).

## సామీప్యమే గాని సందర్శనం లేదు

మరణానంతరము, దేహాంతరమును పొందుతున్న జీవుడు లింగ శరీరమును, లేదా సూక్ష్మ శరీరమును వెంట పెట్టుకొని పోవడం వల్లనే కదా స్థూలదేహం శవంగా పడి ఉంది? జీవుడు సూక్ష్మ దేహాన్ని వెంట పెట్టుకొని పోతున్నాడు అంటే, సూక్ష్మదేహం తన కన్నా అన్య మైనది అని అర్థం కాదా? స్థూలదేహం చలించడానికి కారణమైన లింగ దేహమును ఆకర్షించి (***కర్షతి***) వెంట తీసుకొని పోతున్న జీవుడు స్థూలదేహం కన్నా, లింగదేహం కన్నా కూడా విలక్షణుడు అని తెలుస్తూనే ఉన్నాడు కదా? దర్శనీయుడు గానే ఉన్నాడు కదా?

దేహంలో జీవుని యొక్క అస్తిత్వము లింగ శరీరము ఉండటం చేతనే నిరూపించ బడుతుంది. మరొక ఋజువు అవసరం లేదు. అందుకే సూక్ష్మ శరీరాన్ని లింగ శరీరం అన్నారు. లింగం అంటేనే గుర్తు, లేదా చిహ్నము అని అర్థము. జీవుడు ఉన్నాడు అనడానికి లింగ దేహమే గుర్తు (***లింగ్యతే అనేన ఇతి లింగమ్***).

జీవించి ఉన్నప్పుడు చలిస్తూ ఉండిన స్థూలదేహం మరణానంతరం శవమై అచలంగా ఎందుకని పడి ఉంది? లింగ శరీరం స్థూల శరీరం నుండి విడిపడి పోయింది కనుక. సూక్ష్మదేహం స్థూలదేహంతో సంయుక్తమై ఉన్నప్పుడు స్థూలదేహం జీవిస్తూ ఉండింది కనుక జీవుడు ఉన్నాడని స్పష్ట మౌతూ ఉంది. సూక్ష్మదేహం విడిపడి పోగానే మరణం సంభవించింది. కనుక జీవుడు ఉన్నాడా, లేక ఉత్క్రమించాడా? అని తెలుసుకోవడానికి లింగ దేహమే గుర్తు. లింగదేహం ఉంటే జీవుడు ఉన్నాడని అర్థం. లింగదేహం పోతే జీవుడు కూడా స్థూలాన్ని విడిచి పెట్టాడు అని అర్థం. లింగ దేహాన్ని వెంట పెట్టుకొని వెళ్ళా డనేది సుస్పష్టం. మరణానంతరం కూడా జీవాత్మ ఉందని ఇంత స్పష్టంగా తెలుస్తూ ఉన్నా, మరణాన్ని జీవునికి ఆపాదించి అవివేకంతో మనుషులు దుఃఖిస్తున్నారు. అందుచేత జీవుడు ఉన్నట్లు తెలుస్తూ ఉన్నా, విమూఢులై (***విమూఢాః***) గుర్తించలేక పోతున్నారు (***న అనుపశ్యన్తి***).

***హృదయాకాశ మాత్రస్య వినాశే దేహనాశతః***
***వ్యర్థం భూతాని శోచన్తి నష్ట ఆత్మేతి శంకయా ॥***

హృదయ పుండరీకంలో పరమాత్మ స్వరూపమైన జీవాత్మ ఉండటం చేత దేహము జీవించింది. మరణంలో దేహము నశిస్తూ ఉంది. దేహ నాశము వల్ల హృదయాకాశము నశిస్తుందే గాని, హృదయ స్థితుడు, సనాతనుడైన జీవుడు నశించడం లేదు. దేహమే ఆత్మ అనే భావం దేహాత్మ భావం. ఈ దేహాత్మ భావం వల్లనే దేహము నశిస్తే జీవాత్మ నశించినట్లు మానవులు దుఃఖిస్తున్నారు.

## ఉన్నప్పుడు కూడా లేనట్లే

వెనుకటి దేహము నుండి ఉత్క్రమించి, మరొక దేహంలో లింగ శరీరంతో పాటు ప్రవేశించిన జీవుడు, ఆ దేహంలో శబ్దాది విషయాలను అనుభవిస్తున్నాడు. అలాగే సత్త్వరజస్తమో గుణాలతో కలిసి సుఖదుఃఖ మోహాలను అనుభవంలో అవలోకిస్తున్నాడు. మనస్సును అధిష్ఠించి విషయాలను ఇంద్రియాల ద్వారా అనుభవిస్తున్నాడు (***మనః ప్రత్యేకమ్ ఇంద్రియేణ సహ అధిష్ఠాయ దేహస్థః విషయాన్ శబ్దాదీన్ ఉపసేవతే***).

జడమైన ఇంద్రియ మనస్సులు దృశ్యములు. దృగ్రూపుడైన జీవాత్మ చైతన్యము. జీవ చైతన్యం యొక్క ప్రభావం చేతనే జడమైన దృశ్య వర్గము చలిస్తూ ఉంది. చెట్టుకొమ్మలు చలిస్తూ ఉంటే, వాయువు ఉందని గుర్తిస్తున్నామా లేదా? ఫ్యాను తిరుగుతూ ఉంటే, విద్యుచ్ఛక్తి ఉందని గుర్తిస్తున్నామా లేదా? మరి స్థూల, సూక్ష్మ దేహాలు చలిస్తూ ఉంటే, అందుకు కారణమైన జీవాత్మ దేహంలో భాసిస్తున్నాడని గుర్తించ మెందుకని? దీనికి కారణము అవివేకము. వివేకము లేక పోవడము. వివేకము లేని వారు మూఢులు. విమూఢులు. అందుచేత జీవిత కాలంలో స్థూల సూక్ష్మ దేహ వ్యాపారాదులలో జీవాత్మ సుస్పష్టంగా తెలుస్తూ ఉండినా, వివేకము లోపించిన కారణంగా విమూఢులు దర్శించలేక పోతున్నారు ***(విమూఢాః న అనుపశ్యన్తి)***.

## జ్ఞానులకు దర్శనీయం

అవివేకం వల్ల, అజ్ఞానం వల్ల, మూఢత్వం వల్ల జ్ఞానం లేని వారు సుస్పష్టంగా దర్శన గోచర మవుతున్నా జీవాత్మను తెలుసుకోలేక పోతూ ఉంటే, జ్ఞానచక్షువులు గల విజ్ఞానులు ఆత్మను చక్కగా దర్శిస్తున్నారు అంటున్నాడు ***(పశ్యన్తి జ్ఞాన చక్షుషః)***.

విమూఢులు ఆత్మ దర్శనం చేయలేక పోవడానికి అజ్ఞానము కారణము. విజ్ఞానులు ఆత్మను దర్శించ డానికి జ్ఞానమే కారణము. జ్ఞానమును ప్రమ అంటారు. ప్రమను, అనగా జ్ఞానమును కలిగించేది ప్రమాణము. అదే శాస్త్రము. వేదాంత శాస్త్రము. ప్రమాణం ఉన్నప్పుడు ప్రమ కలగక పోవడ మనేది ఉండదు. అట్టి వేదాంత శాస్త్ర జ్ఞానమును గురూపదేశం వల్ల ఎవరైతే గ్రహిస్తారో వాళ్ళకి జ్ఞానం ప్రాప్తిస్తుంది. వారి బుద్ధి జ్ఞానమయ మవుతుంది. వారి దృష్టి జ్ఞానదృష్టిగా మారుతుంది. దీనినే శాస్త్ర పరిభాషలో జ్ఞాన చక్షువు అంటారు. ఇట్టి జ్ఞానచక్షువు గల వారు అంతటా స్పష్టంగా భాసిస్తున్న ఆత్మను సహజంగా దర్శిస్తారు ***(యే తు ప్రమాణ జనిత జ్ఞాన చక్షుషః తే ఏవం పశ్యన్తి జ్ఞాన చక్షుషః వివిక్త దృష్టయః ఇత్యర్థః)***. వీరే వివేకులు. ఆత్మను చక్కగా అవలోకించే వారు.

వివేకులు జ్ఞాన చక్షువు కల వారు కావడం చేత ఆత్మను దర్శిస్తారు. ఈ జ్ఞానం శాస్త్రం నుండి వారికి ప్రాప్తించింది. ఇది ప్రమాణ జనిత జ్ఞానము. మరి విమూఢులు ఆత్మను దర్శించలేక పోవడానికి కారణం అజ్ఞానము అని అంటున్నాము కదా! జ్ఞాన మైతే శాస్త్రము నుండి వస్తుంది. మరి అజ్ఞానం ఎక్కడ నుండి వస్తుంది?

వెలుతురు దీపం నుండి వస్తుంది అని చెప్పగలం. చీకటి ఎక్కడి నుండి వస్తుంది అంటే ఏమి చెప్ప గలం? చీకటి ఎక్కడి నుండో రాదు. ఉంటుంది. రాకుండానే ఉంటుంది. అజ్ఞానం కూడా అంతే. అజ్ఞానం ఎక్కడి నుండో రాదు. ఉంటుంది. రాకుండానే ఉంటుంది. అదెలా? ఎక్కడో ఒక చోట నుండి అజ్ఞానం వచ్చి ఉండాలి. లేదా ఒక సమయంలో కదిలి ఉండాలి అంటారా! ఏమో! ఇది అంతు పట్టని విషయం. అందుకే అజ్ఞానాన్ని అనాది అన్నారు. అనాది అంటే ఆది లేనిది అని అర్థము. ఆది లేని దానికి అంతం కూడా ఉండదు కదా! మరి అజ్ఞానం ఎలా పోతుంది? జ్ఞానం ఎలా వస్తుంది?

చీకటి ఎప్పటి నుండి ఉంది? దాని ఆది ఎక్కడ? తెలియదు. మరి అనాదిగా ఉన్న చీకటి, దీపం వెలిగించ గానే అంతం అవుతుందా లేదా? అజ్ఞానం కూడా అంతే. అజ్ఞానం ఫలాన సమయంలో ఆరంభమైంది అని ఎవరైనా చెప్పారనుకోండి. దాని అర్థ మేమిటి? అంతకు ముందు అజ్ఞానం లేదు అని అర్థం. అప్పుడే అది ఆరంభం అనబడుతుంది. సరే, అజ్ఞానం ఆరంభం కాక ముందు అజ్ఞానం లేదు. మరేముంది? జ్ఞాన ముంది. అంతేనా? అంతే. మరి, జ్ఞాన మున్నప్పుడు, అజ్ఞాన మెలా ఉంటుంది? లేని అజ్ఞానం ఎలా ఆరంభ మౌతుంది?





ఈ ప్రశ్నల సుడిలో దూరడం కన్నా, అజ్ఞానం అనాది అనే వాస్తవాన్ని అంగీకరించి సుడులకు, ముడులకు దూరంగా ఉండటం మంచిది. అజ్ఞానము అనాదే అయినా, జ్ఞానప్రాప్తిలో అంతమై పోతుంది.

*మరి, ప్రమాణ విచార ఫలితంగా శాస్త్ర జ్ఞానాన్ని పొందుటకు ప్రయత్నించిన వారందరికీ ఆత్మదర్శన మవుతుందా? ఏమో! కావచ్చు. కాకపోవచ్చు. చదవండి.*

**యతన్తో యోగిన శ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్ ।**
**యత న్తోఽ ప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః ॥** **11**

***యతంతః-యోగినః-చ-ఏనం-పశ్యంతి-ఆత్మని-అవస్థితం***
***యతంతః-అపి-అకృతాత్మానః-న-ఏనం-పశ్యంతి-అచేతసః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగినః | = | యోగులు | అకృతాత్మానః | = | సంస్కరింప బడని వారు |
| యతంతః | = | ప్రయత్నించు వారు | అచేతసః | = | వివేకం లేని వారు |
| ఆత్మని | = | ఆత్మ యందు | యతంతః అపి | = | ప్రయత్నించు వారైనప్పటికి |
| అవస్థితం | = | ఉన్నటు వంటి | ఏనం | = | ఈ ఆత్మను |
| ఏనం | = | ఈ ఆత్మను | న చ పశ్యంతి | = | చూడలేరు |
| పశ్యంతి | = | చూస్తున్నారు | | | |

**అర్జునా! ప్రయత్నము చేసే యోగులు తమ స్వరూపమైన ఆత్మను దర్శిస్తున్నారు. అభ్యాసపరు లైనను అజ్ఞానులు పరమాత్మను దర్శించలేక పోతున్నారు.**

### వ్యాఖ్య

ప్రమాణ జనిత జ్ఞానము కల వారు జ్ఞానదృష్టి కల వారు. జ్ఞాన నేత్రం కల వారు. అట్టి వారు ఆత్మను దర్శిస్తారు అని పూర్వ శ్లోకంలో చూశాం. కేవలం ప్రమాణ జనిత జ్ఞానము చేతనే ఆత్మజ్ఞానము సిద్ధిస్తుందా అనేది శంక. కొందరు ప్రయత్నించి ఆత్మను దర్శించ గలుగు తున్నారు. కొందరు ప్రయత్నించినా ఆత్మను దర్శించలేక పోతున్నారు. అందుకే ఈ మీమాంస. ప్రయత్నం చేసి ఆత్మ దర్శనం చేసే వారు యోగులు. ప్రయత్నించినా ఆత్మను దర్శించలేని వారు అకృతాత్ములు. అచేతసులు.

మన మేదైనా పొందాలనుకున్నపుడు ఆ పొంద వలసింది మన కన్నా అన్యమైనది, దేశకాలాదులలో దూరంగా ఉన్నది అయినపుడు దానిని యత్నించి కర్మ ద్వారా పొంద వలసి ఉంటుంది. కాని, మనం పొందాలి అనుకున్నది మన కన్నా అన్యమైనది కానపుడు, లేక మనమే అయినపుడు దానిని కర్మ ద్వారా పొందే ప్రసక్తే లేదు. మనం పొందాలి అనుకున్నది మన వద్దే ఉన్నప్పుడు, లేదా మనమే అయినపుడు, దానిని పొందడానికి ఏకైక మార్గము జ్ఞానమే. వస్తువు ఉన్నదే కనుక, ఉన్నది అనే జ్ఞానాన్ని పొందితే సరిపోతుంది. ఇక్కడే శాస్త్రం ప్రమాణ మైంది. ***ప్రమాకరణం ప్రమాణం*** - జ్ఞానమును కలిగించేది ప్రమాణం కనుక ప్రమాణ జనిత జ్ఞానం మనకు జ్ఞాన చక్షువును ప్రసాదిస్తుంది. తద్వారా ఆత్మదర్శన మవుతుంది.

చూచే కళ్ళు నా కున్నాయి. కనుక ఎవరి ముఖాన్నైనా నేను చూడ గలను. నాకూ ముఖ ముంది. కాని, నా ముఖాన్ని నా కళ్ళతో నేను చూసుకోలేను. ఒకవేళ నా ముఖాన్ని నా కళ్ళ తోనే నేను చూసుకోవాలి అనేది గనుక నా అభిమత మైతే, నా ముఖాన్ని ప్రతిబింబించే వస్తువులో దానిని చూసుకోవడం కన్నా మరో మార్గం లేదు. అలా ప్రతిబింబించేది అద్దం కావచ్చు. లేదా ఉదకం కావచ్చు.

నీ సత్య స్వరూపము ఆత్మే. నీవే ఆత్మ. ఆత్మే నీవు. అలాంటప్పుడు నిన్ను నీవు ఎలా దర్శించ గలవు? కనుక నీ స్వరూపాన్ని ప్రతిబింబించేది ఏదైనా కావాలి. అప్పుడే అందులో నిన్ను నీవు దర్శించ గలవు. అలా ప్రతిబింబించే దర్పణమే శాస్త్రము. వేదాంతము. అద్దంలో ముఖం కనిపించినట్లు శాస్త్రంలో మనల్ని మనం దర్శించ గలం ***( దర్పణే ముఖ దర్శనవత్ శాస్త్రే ఆత్మ దర్శనం ).***

ఇక్కడ అతి ప్రధానమైన విషయం ఒకటుంది. మనిషి అద్దాన్ని చూచేది తన ముఖాన్ని చూసుకోవడానికే గాని, అద్దాన్ని చూడటానికి కాదు. అలాగే జిజ్ఞాసువు ప్రమాణ విచారము చేసేది, కేవలం ప్రమాణ విచారం కొరకు కాదు, స్వరూప దర్శనం కోసం. అద్దం మనకు అభిముఖంగా ఉన్నప్పుడు, మన దృష్టిలో ఏ లోపం లేనపుడు ప్రతిబింబ దర్శనము జరగక పోయే ప్రసక్తే లేదు. అలా కాకుండా, దర్పణం పరిశుద్ధంగా ఉన్నా, ముఖానికి అభిముఖంగా అమర్చ బడినా, చూచే వ్యక్తికి చత్వార ముంటే, రూప దర్శనం కాకపోవచ్చు. ఒకవేళ అయినా, అనేక విధాలుగా, వికృతాకారంగా కనిపించ వచ్చు.

**ఆత్మదర్శన యోగులు**

అర్జునా! సమాహిత చిత్తులైన యోగులు ***( యోగినః )*** ప్రయత్నశీలురై ***( యతన్తః ప్రయత్నం కుర్వన్తః )*** స్వతస్సిద్ధ మైన ఆత్మను ***( ఆత్మని స్వస్యాం బుద్ధౌ అవస్థితం )*** దర్శిస్తున్నారు ***( పశ్యన్తి ).*** ఏ ఆత్మ స్వరూపమును గూర్చి మనం విచారిస్తున్నామో, ఆ ఆత్మను తమ బుద్ధి యందు 'ఇది నేను' అని దర్శిస్తున్నారు ***( అయమ్ అహమస్మి ఇతి ఉపలభన్తే, ).*** ఆత్మ, ఆత్మజ్ఞానము వేరు కానందున, ఆత్మజ్ఞానము వల్ల ఆత్మ దర్శింప బడుతోంది. ఈ విధంగా శాస్త్రకృప, ఆచార్యకృప, ఆత్మకృప, ఈశ్వరకృప అనే చతుర్విధ కృపలను పొందిన వ్యక్తి, ఇంద్రియ మనస్సులను నియమించి, శ్రవణ మనన నిదిధ్యాసల ద్వారా జ్ఞానసిద్ధి కొరకు యత్నించి ఆత్మను దర్శిస్తాడు. అలా దర్శించే వారే యోగులు.

***శ్లో॥ లక్ష్యైకతాం సమాసాద్య నిర్వికారత యాత్మని ।***
***మనసో నిశ్చలత్వేన స్థితి ర్యోగ ఇతీర్యతే ॥***

'లక్ష్యము నందే ఏకాగ్రతను సాధించి, మనస్సును ఆత్మ యందే నిశ్చలంగా, నిర్వికారంగా నిలపడమే యోగము'. తీవ్రమైన మోక్ష కాంక్ష, పటుతరమైన వైరాగ్యము చేత బాహ్య విషయ విరక్తితో స్వాత్మ యందే సమాహిత చిత్తులైన యోగులు తప్పక ఆత్మను దర్శిస్తారు.

**దర్శన అయోగ్యులు - అకృతాత్ములు**

ప్రయత్నించిన యోగులు జ్ఞానార్హులు కావడం చేత ప్రమాణ విచారం చేసి ఆత్మ దర్శనం చేయగలరు. ప్రయత్నం చేసినా యోగ్యత లేని వారు ఆత్మను దర్శించ లేరు. సాధన సంపత్తి లేని అయోగ్యులు శాస్త్ర ప్రమాణమును గ్రహించినా ఫలితాన్ని పొందలేరు. వారి విషయంలో ప్రమాణం ఫలించదు. అలా ప్రయత్నించినా పొందలేని వారు అకృతాత్ములు.

అకృతాత్ములు అంటే సంస్కరింప బడని చిత్తము కల వారు ***( అకృతాత్మనః అసంస్కృత ఆత్మానః ).*** తపశ్శక్తి లేని వారు. ఇంద్రియాలను జయించలేని వారు. దురాచారమును విరమించని వారు. దర్పాభిమానాల చేత కలుషితమైన అంతఃకరణము కల వారు. అశాంత చిత్తులు. ఇలాంటి అచేతస్కులు ***( అచేతసః అవివేకినః )*** ఎంతగా ప్రయత్నిస్తు న్నప్పటికి ***( ప్రయత్నం కుర్వన్తః అపి )*** ఈ ఆత్మను దర్శించ లేరు ***( న ఏనం పశ్యన్తి ).*** బాహ్య విషయ వాసనల చేత కలుషితమై ఉన్నందున వారి చిత్తము వశీకృతం కాదు. అందుచేత ప్రమాణము ఫలించదు.





***మం॥ కుశలా బ్రహ్మ వార్తాయాం వృత్తి హీనా సురాగిణః***
***తే ప్య జ్ఞాన తయా నూనం పునరాయాన్తి యాన్తి చ ॥***

'విషయాల యందు అనురాగము కలిగి, చిత్తమును నిరోధించలేని వారు ప్రమాణ విషయంలో కుశలత్వము కలిగిన వారైనను జనన మరణాల మధ్య తిరుగుతూ ఉంటారే గాని మోక్షాన్ని పొందలేరు' అని తేజోబిందూపనిషత్తు.

*సర్వాత్మకమైన బ్రహ్మపదమును, మోక్ష ధామమును ఉపదేశించుటకు ఉపక్రమిస్తూ వరుసగా నాలుగు శ్లోకాలలో విభూతుల సంక్షేపాన్ని వివరిస్తున్నాడు.*

**య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽ ఖిలమ్ ।**
**య చ్చన్ద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్ ॥** 12

***యత్-ఆదిత్యగతం-తేజః-జగత్-భాసయతే-అఖిలం***
***యత్-చంద్రమసి-యత్-చ-అగ్నౌ-తత్-తేజః-విద్ధి-మామకం***

| | | | |
|---|---|---|---|
| యత్ | = ఏ | చంద్రమసి | = చంద్రుని యందున్నదో |
| తేజః | = తేజస్సు | యత్ | = ఏది |
| ఆదిత్యగతం | = సూర్యుని యందు ఉన్నదై | అగ్నౌ చ | = అగ్ని యందున్నదో |
| అఖిలం | = సమస్త | తత్ | = అట్టి |
| జగత్ | = లోకమును | తేజః | = తేజస్సును |
| భాసయతే | = ప్రకాశింప చేస్తున్నదో | మామకం | = నాకు సంబంధించినది అని |
| యత్ | = ఏది | విద్ధి | = తెలుసుకో |

**అర్జునా! సూర్యునిలో ఉండి లోకాన్నంతా వెలిగిస్తున్న ప్రకాశము, చంద్రుని యందున్న వెలుగు, అగ్ని యందున్న తేజస్సు - అంతా నాదే నని తెలుసుకో!**

**వ్యాఖ్య**

అది బ్రహ్మపదము. పరంధామము. సూర్యచంద్రాగ్నులు ప్రకాశింప చేయ లేనిది. ఆ పరమ పదమును చేరిన ముముక్షువులు తిరిగి సంసారంలో ప్రవేశించరు ***( యత్ప్రాప్తాః ముముక్షవః పునః సంసారాభిముఖా న నివర్తన్తే ).*** ఉపాధి భేదాన్ని బట్టి ఘటాకాశము మహాకాశమునకు అంశ మైనట్లు, జీవులు ఆ బ్రహ్మపదానికి అంశరూపులై సంసారంలో పరిభ్రమిస్తున్నారు. అట్టి బ్రహ్మధామము సర్వాత్మకమే గాక సర్వ వ్యవహారాస్పదము కూడా. అంటే, తాను స్వరూపతః దివ్యంగా భాసించడమే గాక, సమస్తమును ప్రకాశింప చేస్తూ సర్వ వ్యవహారము లందు భాసక చైతన్యముగా కూడా ఉంది. ఈ సత్యాన్ని ప్రవచించ డానికి భగవంతుడు ప్రస్తుత శ్లోకం నుండి వరుసగా నాలుగు శ్లోకాలలో విభూతి వైభవాన్ని సంక్షేపంగా బోధిస్తున్నాడు.

**దీప్తి మంతము**

దేనిని పొందిన తరువాత తిరిగి సంసారంలో ప్రవేశించరో, దేనిని సూర్యచంద్ర నక్షత్రాగ్నులు ప్రకాశింప చేయలేవో, ***తత్*** - ఆ ధామమే నా పదము అని భగవంతుడు ఆరవ శ్లోకంలో దేనిని గూర్చి ప్రబోధించాడో దానినే ప్రస్తుత శ్లోకంలో ***యత్*** - ఏదయితే అంటూ శ్లోకారంభం చేస్తున్నాడు. అది ఏది? ***( కిం తత్ ?).*** అది దీప్తి, లేదా ప్రకాశము ***( తేజః ).*** ఆ ప్రకాశము సూర్యుణ్ణి ఆశ్రయించుకొని ***( ఆదిత్య గతం ఆదిత్యాశ్రయం )*** సమస్తమైన ప్రపంచాన్ని ప్రకాశింప చేస్తూ ఉంది ***( జగత్ భాసయతే ప్రకాశయతి అఖిలం సమస్తం ).*** చంద్రునిలో,



4 10

అగ్నిలో ఉన్న ప్రకాశము కూడా అదే. ఆ తేజస్సు పరమాత్మదే (***తత్ తేజః విద్ధి మామకమ్***). పరమాత్మకు సంబంధించినదే. ఇది, శ్లోక భావం.

బ్రహ్మము ప్రకాశైక స్వరూపము. సమస్తములో ఉన్న ప్రకాశము తానే. స్థావర జంగమాల లోని ప్రకాశమంతా తానే. అలాంటప్పుడు ***యదాదిత్య గతం తేజః*** అంటూ సూర్యుణ్ణి మాత్రమే ఉదహరిస్తూ ఎందుకు చెప్పవలసి వచ్చింది? విద్యు ద్దీపంలో ఉన్నది తాను కాదా? అనే ప్రశ్న ఇక్కడ ఉత్పన్న మవుతుంది. ఈ విధమైన దోషము బ్రహ్మములో లేదు (***న ఏష దోషః***).

చైతన్య ప్రకాశము సమస్తము నందు ప్రకాశిస్తూ ఉన్నా, ఎక్కడ సత్త్వము అధికంగా ఉంటుందో, అక్కడ చైతన్య జ్యోతిస్సు అధికంగా ఆవిష్కృత మవుతుంది. ఆదిత్యాదులలో అత్యంత ప్రకాశవంత మైన సత్త్వము ఉంది. అందుచేత వాటిలో ప్రకాశము అధికోత్కర్షంతో ఉంటుంది. సమస్త ప్రపంచములో ప్రకాశిస్తున్న చైతన్య జ్యోతి ఆదిత్యాదులలో తరతమ భేదాన్ని అనుసరించి విశేషంగా వ్యక్తం కావడం చేత ఆదిత్యాదులను ఉదాహరణగా చెప్పడం జరిగిందే గాని, చైతన్య ప్రకాశము ఆదిత్యాదులకే పరిమిత మని గాని, అది అన్యత్ర అభాస మని గాని అర్థం కాదు. ఇక్కడ మరొక సూక్ష్మాంశాన్ని కూడా అర్థం చేసుకోవాలి. ఆదిత్యాదులు చైతన్య ప్రకాశాన్ని అధికంగా వ్యక్తం చేయడం వల్ల అలా ఉదహరించడం జరిగిందే గాని, ఆదిత్యాదులలో అధికంగా చైతన్య ప్రకాశం ఉందని కాదు (***న తు తత్రైవ తత్ అధికమ్ ఇతి***). ఈ విశేషాన్ని ముఖ్యంగా గుర్తించాలి.

మన ముఖమును అద్దము ప్రతిబింబించినట్లు కట్టెలు, గోడలు ప్రతిబింబించవు కదా! ఏది స్వచ్ఛమో, సత్త్వ ప్రధానమో దాని యందే ప్రతిబింబము గోచరిస్తుంది. స్వచ్ఛమైన దానిలో స్పష్టంగా తెలిసేది స్వచ్ఛతర మైన దానిలో సుస్పష్టంగా తెలుస్తుంది (***స్వచ్ఛే స్వచ్ఛతరే చ తారతమ్యేన ఆవిర్భవతి***). అంతే గాని సర్వావభాసకమైన ప్రకాశమును పరిమితం చేయడం సాధ్య పడదు.

**గీతోపనిషత్**

***న త ద్భాసయతే సూర్యః*** అంటూ ఆరంభమైన ఆరవ శ్లోకాన్ని కఠ, ముండక, శ్వేతాశ్వతర ఉపనిషత్తుల లోని ***న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం*** అనే మంత్రాన్ని ఉటంకిస్తూ చర్చించడం జరిగింది. గీత ఉపనిషత్తుల సారమని ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. ఈ ఉపనిషత్ మంత్రం లోని పూర్వార్ధానికి ఆరవ శ్లోకం వ్యాఖ్యానం కాగా, ఉత్తరార్ధానికి (***తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి***) ప్రస్తుత శ్లోకం వ్యాఖ్యానము. ఒక వైపు భగవద్గీత ఉపనిష త్సారాన్ని అందిస్తూ ఉంది. మరొక వైపు ఉపనిషత్తులను వ్యాఖ్యానిస్తూ కూడా సాగుతూ ఉంది. ఆదిత్యాదులు తనను ప్రకాశింప చేయ లేవు అని ఆరవ శ్లోకంలో ప్రవచించిన ఆదిదేవుడు, ఆదిత్యాదుల లోని ప్రకాశము తన విభూతియే నని ప్రస్తుత శ్లోకంలో ప్రస్ఫుటం చేస్తున్నాడు.

జీవు లందరూ పరమాత్మ అంశరూపులే కనుక, తమ ఆత్మనే పరమాత్మ స్వరూపంగా భావించాలి అని ఆరవ శ్లోకంలో తెలిపిన గీతాచార్యుడు, ఇప్పుడు, కేవలం అంతరంగము నందే గాక బాహ్యంలో సర్వత్ర నిండి నిబిడీ కృతమైన సర్వాత్మ స్వరూపాన్ని విభూతులలో దర్శించి ఉపాసించే దివ్య సాధనను తెలిపే ప్రయత్నంలో ప్రస్తుత శ్లోకము మొదలుకొని వరుసగా నాలుగు శ్లోకాలలో విభూతి సంక్షేపాన్ని వివరిస్తున్నాడు. దీనిని ఓ విధంగా, విశ్వరూపోపాసనగా సాధకులు భావించ వచ్చు.

**శూషోహవై వార్ష్ణేయ ఆదిత్యేన సమాజగామ**

శోషణ శక్తి కలిగిన (***శూషః***) శ్రీకృష్ణుడు (***వార్ష్ణేయః***) సూర్యునితో కలిశాడు (***ఆదిత్యేన సమాజ గామ***) అని తైత్తిరీయ బ్రాహ్మణము నందు ఉంది.





సూర్య చంద్ర నక్షత్రాగ్నుల లోని దివ్యమైన ప్రకాశమును పరమాత్మ విభూతులుగా భావించి ఉపాసించడం వలన దురిత క్షయమే గాక, అంతఃకరణ శుద్ధి కలిగి, తద్వారా బ్రహ్మజ్ఞానము సిద్ధిస్తుంది. ద్వాదశాదిత్యులలో తాను విష్ణు వని, తేజస్సు గల వాటిలో తాను సూర్యుడని గీతాచార్యుడే సందేశాన్ని అందించాడు కదా! (*10 వ అ - 21 శ్లో*).

*మరి కొన్ని విభూతులను చెబుతున్నాడు.*

**గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా ।**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥** 13

***గాం-ఆవిశ్య-చ-భూతాని-ధారయామి-అహం-ఓజసా***
***పుష్ణామి-చ-ఓషధీః-సర్వాః-సోమః-భూత్వా-రసాత్మకః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | రసాత్మకః | = | రస స్వరూపుడగు |
| గాం | = | భూమిని | సోమః | = | చంద్రుడు |
| ఆవిశ్య | = | ప్రవేశించి | భూత్వా | = | అయి |
| భూతాని | = | భూతములను | సర్వాః | = | సమస్తమైన |
| ఓజసా | = | శక్తి చేత | ఓషధీః చ | = | ఓషధులను |
| ధారయామి చ | = | ధరిస్తున్నాను | పుష్ణామి | = | పోషిస్తున్నాను |

**అర్జునా! నేను భూమిలో ప్రవేశించి నా అసమాన శక్తితో సమస్త భూతాలను ధరిస్తున్నాను. రస స్వరూపు డైన చంద్రుణ్ణై ఓషధు లన్నిటిని నేనే పోషిస్తున్నాను.**

**వ్యాఖ్య**

సర్వులను, సమస్తమును ధరించునది ధరణి (***ధారయతి***). సమస్తమును ధరించునది ధరణి అయితే, ధరణిని ధరించు వాడు కనుక భగవంతుడు ధరణీధరుడు (***ధరణీం ధత్తే ఇతి ధరణీధరః***). భూధరుడు, భూపతి. భూమికి అధిష్ఠానంగా శోభించే వాడు. సత్తామాత్రుడు. ***భూః సత్తాయామ్*** - సత్తామాత్ర మైనది భూమి. ***భువనం, సత్తా, మహీవా!*** - సత్తా కలది కనుక ఇది భూమి. ఆ సత్తాయే మహిమ. మహిమ కలది కనుక భూమి మహి అయింది. వాస్తవానికి సత్తారూపుడు భగవంతుడే కనుక, మహిలో మహిమ ఏదైనా సర్వాధారుడైన సర్వేశ్వరునిదే.

**ధారణ శక్తి**

'గాం' అంటే భూమి. భగవంతుడు భూమి యందు ప్రవేశించి తన తేజస్సు చేత సర్వ భూతాలను, స్థావర జంగమాత్మక మగు సమస్తమును ధరిస్తున్నాడు. ఇదే ధారణ శక్తి. ఆధార వస్తువులో అగుపించే ఓజస్సు, లేదా బలం.

భూమికి ధారణ శక్తి ఉంది కనుక, భూమాతను ధరణీమాత అంటాము. ఎంతటి భారాన్నైనా మోసే శక్తి భూమి కుంది. అదే భూశక్తి. శక్తి ఉన్నందునే భూమి నిలబడి ఉంది. శక్తి ఉన్నందునే తిరుగుతూ ఉంది. నిలబడాలన్నా, తిరగాలన్నా శక్తి అవసరం. శక్తి లేకపోతే ఏదైనా, ఎవరైనా కూలబడ వలసిందే. భూదేవికి కులుకు తెలుసే గాని కూల బడటం తెలియదు. చుట్టూ నీరు తడుపుతూ ఉన్నా, యుగాల తరబడి కరగకుండా నిలబడి ఉంది. అంత బరువైన దైనా ఆకాశంలో వేగంగా తిరుగుతూ ఉంది. మట్టిగడ్డ లాగా విరిగి పోలేదు. మట్టికుండ లాగా పగిలి పోలేదు. ఎందుకో తెలుసా! ఇక్కడ, అంటే అవనిలో నిక్షిప్తమై ఉండేది బలమే గాని భారము కాదు. అదే భూమి లోని ఆకర్షణా శక్తి.

మరి, భూమి లోని శక్తి భూమికి సంబంధించిం దేనా? కాదు. అన్నిటిని ధరించే శక్తి భూమి దైతే, భూమిని ధరించే వాడు భగవంతుడు. అతడే సత్తా స్వరూపుడు. సమస్తమును ధరించే వాడు. అతని చేత ధరింప బడేది ధరణి **(ధ్రియతే)**. కనుక, భూమి లోని బలం భూమిది కాదు, భూపతిది.

మట్టిగోడలో ఏముంది? మట్టే ఉంది. మరి, మట్టిని కుప్ప పోస్తే గోడ లాగా గట్టిగా ఉండ దెందుకని? అలా ఉండే టట్లైతే, ఇంటి చుట్టూ మట్టిగోడ నిర్మించు కోవడం కన్నా మట్టినే గుట్టగా పోసుకుంటే సరిపోతుంది కదా! పోసుకోవచ్చు. అలా పోసుకున్నది గాలికి ఎగిరి పోవచ్చు. వర్షానికి తడిసి కరిగి పోవచ్చు. కాని, గోడ గాలికి ఎగిరి పోదు. వర్షానికి కరిగి పోదు. అది రాశి పోసిన దుమ్మూ కాదు, కుప్ప పోసిన ధూళీ కాదు. నీటితో తడిపిన మట్టితో కట్టిన గోడ. నీటి యొక్క జిగట బలం గోడంతా వ్యాపించి ఉంది. అందుకే గోడ గట్టి దైంది. మట్టి బరువుకి, గోడ బలానికి ఇదే తేడా. మట్టిగా బలం లేనిది గోడగా బల మైనది కావడానికి జిగట బలం కలిగిన జలం గోడంతా వ్యాపించి ఉండటము ఎలా కారణమో, సమస్తాన్ని భరించే శక్తి భూమికి ఉండటానికి భగవానుడు ఓజశ్శక్తితో భూమిలో ప్రవేశించి ఉండటమే కారణము. అర్జునా! ఈ విధంగా నేను భూమిలో ప్రవేశించి ***(గాం పృథివీం ఆవిశ్య)*** నా తేజస్సు చేత, నా బలం చేత ***(ఓజసా బలేన)*** సమస్త భూతాలను, భూతాలను మోసే భూమిని ***(భూతాని జగత్)*** నిలబెడు తున్నాను ***(అహం ధారయామి)***.

వాయువు మేఘాలలో ప్రవేశించి జలాలను ధరిస్తున్నదా, లేదా? విచారించి చూస్తే, మేఘ రూపంలో ఉన్నది వాయువే కదా? వాయువు కన్నా వేరుగా మేఘ మండలానికి ప్రత్యేకమైన అస్తిత్వ మేది? చలించే వాయువును మేఘ రూపంలో నిలిపి ఉంచే బలము ఏదైతే వాయువులో ఉందో అది వాస్తవానికి వాసుదేవుని ఓజస్సే. భగవంతుని తేజస్సే. చల్లని అయఃపిండము, అంటే ఇనుపగుండు వేడిగా, ప్రకాశవంతంగా ఉండ టానికి అయఃపిండము నందు వ్యాపించి ఉన్న అగ్ని తేజము ఎలా కారణమో, అలాగే ఈ విశ్వంలో ఉన్న సత్తా స్ఫురణలకు భగవంతుడే ఆధారము. అదే ధరణిలో ధారణా శక్తి. దైవబలం. ***స దాధార పృథివీం*** - ఆ భగవంతుడే భూమిని ధరించాడు అని తైత్తిరీయ సంహిత. ఈ విధంగా సర్వేశ్వరుడు సర్వాధారుడు.

ఆధార ఆధేయ సంబంధ విషయంలో సూక్ష్మ స్థూలాలను ప్రధానంగా పరిగణన లోకి తీసుకోవాలి. ఎప్పుడైనా, ఎక్కడైనా స్థూలాన్ని సూక్ష్మం ధరిస్తుందే గాని, సూక్ష్మాన్ని స్థూలం ధరించ లేదు.

పృథివి స్థూలం. పృథివి కన్నా జలం సూక్ష్మం. సూక్ష్మమైన జలం స్థూలమైన పృథివిని ధరించ గలదే గాని, స్థూలమైన పృథివి సూక్ష్మమైన జలాన్ని ధరించ లేదు. అలాగే సూక్ష్మమైన జలాన్ని అంతకంటే సూక్ష్మమైన అగ్ని ధరిస్తుంది. అగ్ని కంటే సూక్ష్మమైన వాయువు అగ్నిని ధరిస్తుంది. వాయువు కంటే సూక్ష్మమైన ఆకాశము వాయువును ధరిస్తుంది. అంతేగాని, స్థూలమైన వాయువు సూక్ష్మమైన ఆకాశాన్ని ధరించ లేదు. కనుక వాయువు ఆధేయ మైతే, ఆకాశము ఆధార మైంది. ఆధారము ఎప్పుడూ సూక్ష్మమే. ఆధారంతో పోల్చి చూస్తే ఆధేయం ఎప్పుడైనా స్థూలమే.

ఇలా చూచి నపుడు పంచభూతాలలో ఆకాశము అన్నిటి కన్నా సూక్ష్మము. సర్వభూతాధారము. కాని, పరమేశ్వరుని నుండే ఆకాశం ఆవిర్భవించడం చేత ***(తతః ఆకాశః సంభూతః)*** సూక్ష్మమైన ఆకాశము ఆధేయము కాగా, ఆకాశానికి ఆధారమైన పరమాత్మ సర్వాధారుడుగా శోభిస్తున్నాడు. కనుక పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మ రూపుడు. ఆదికారణ మైన వాడు ***(ఆకాశాదే రపి సూక్ష్మతరమ్)***. తనకు మరొక ఆధారం లేని నిరాధారుడు సృష్టికి సర్వాధారుడు. సర్వ శక్తిమంతుడు.

ప్రాణు లన్నీ జీవించడానికి ప్రాణం ఆధారము. ప్రాణం లేకుండా జీవము కొనసాగదు. ప్రాణం వల్లనే జీవం కొన సాగుతుంది. కాని, పోషణ లేకపోతే, జీవం నిర్జీవ మవుతుంది.





మొక్కలలో ప్రాణం ఉంది. మొక్కలు ప్రాణశక్తితో బ్రతక డానికి సూర్యరశ్మి ఎంతైనా అవసరం. సూర్య రశ్మి సోకకుండా మొక్కను ముంతలో దాచి పెడితే అది చచ్చి పోతుంది. సూర్యరశ్మి వల్ల మొక్కలు బ్రతుకుతాయి. కాని, పోషణ లేకపోతే నిర్జీవ మవుతాయి. నీళ్ళు లేక, భూమి నుండి పత్తువ అందక పోతే మొక్కలు వాడి పోతాయి. ఆకులు రాలి పోతాయి.

మొక్కలకు పోషణ శక్తి చంద్రుని నుండి లభిస్తుంది. అదే ఓషధుల లోని రసం. ఈ విధంగా ఓషధులను పోషించే చంద్రుని లోని రసాత్మక శక్తి పరమేశ్వరునిదే. ఎలాగైతే భూమి లోని ధారణాశక్తి భగవంతునిదో, చంద్రుని లోని పోషణాశక్తి కూడా పరమేశ్వరునిదే.

**పోషణ శక్తి**

భూమిలో ధారణా శక్తిగా ప్రవేశించి సర్వ భూతాలను, సమస్త జగత్తును నిలబెడుతున్న భగవంతుడు, చంద్రునిలో పోషణా శక్తిగా నిలిచి, రస రూపుడైన చంద్రుని ద్వారా ఓషధులను పోషిస్తూ, సర్వ ప్రాణులను రక్షిస్తున్నాడు. సోముడు అంటే చంద్రుడు. చంద్రుడు రస స్వరూపుడు. భూమి మీద పుడుతున్న వరి, గోధుమ మొదలైన ఓషధులలో రసాన్ని, రుచినీ కలిగించే వాడు సోముడు. అన్ని రసాలకు నిలయమైన వాడు సోముడు. రసనిధి. చంద్రుడు. తనలో ఉన్న రసాన్ని ఓషధులలో నింపి, వాటిని రసపూర్ణం చేస్తాడు. అందుచేతనే ఓషధులు రసపూర్ణాలై పుష్టిని, తుష్టిని కలిగిస్తాయి. అర్జునా! సర్వ రస స్వరూపుడైన చంద్రుణ్ణి నేనై ***(రసాత్మకః సోమః భూత్వా)*** సమస్తము లైన ఓషధులను - వరి, యవలు ***(ఓషధీః సర్వాః వ్రీహి యవాద్యాః)***, వృక్ష, లతా, తృణ, గుల్మాదులను నేనే పోషిస్తున్నాను ***(అహం పుష్ణామి)***. ధరించే వాటిలో ధారణా శక్తిగా ఎలా ఉన్నాడో, పోషించే వాటిలో పోషణా శక్తిగా కూడా పరమాత్మే ఉన్నాడు. ధారణ పోషణాది ధర్మ రూపంలో తానే ఉండి జగత్తును సంరక్షిస్తున్నాడు. జగతికి స్థితి కారకు డయ్యాడు. భూమి లోని శక్తి రూపం తానే. ఓషధుల లోని రస రూపం కూడా తానే.

సోముని వల్ల ఓషధులు రసపూర్ణ మవుతున్నాయి. రస పూర్ణమైన ఓషధుల వల్ల ఆహారము లభిస్తూ ఉంది. ఆహారం కారణంగా ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. ***ఓషధీభ్యోఽ న్న మన్నా త్పురుషః*** - ఓషధుల వలన అన్నం కలిగింది. అన్నం వల్ల ప్రాణులు పుడుతున్నాయి. అన్నమును సృష్టించే వాడు తానే ***(అన్న స్రష్ట)***. అన్నమును ప్రసాదించే వాడు కూడా తానే ***(అన్నదాత)***. అవన్నీ సోమామృత పుష్టాలు కావడానికి చంద్రుడు కారణం కాదు, సర్వ రస స్వరూపుడైన బృందావన చంద్రుడే కారణము. కనుక సోమ నామధేయము శశాంకు నికే కాదు; శ్యామసుందరునికి కూడా ఉంది. చంద్రుని రూపంలో శోభిస్తూ, ఓషధులను పుష్టిమంతంగా, రస వంతంగా పోషించడం చేత పరమాత్మ సోముడు. అతడే ఘనశ్యాముడు ***(సోమ రూపేణ ఓషధీః పోషయన్ సోమః)***.

రశ్మిమంతుడైన సూర్యునిలో తానే ఉండి జీవనానికి కారణమైన పరమేశ్వరుడు, రస రూపుడైన సోమునిలో తానే ఉండి పోషణకు ఆధార మయ్యాడు. సూర్యునిలో ప్రకాశంగా తాను ప్రవేశించక పోయిన ట్లైతే విశ్వమే అంధకార బంధుర మయ్యేది. చంద్రునిలో రస రూపంగా తాను చేరక పోయి ఉంటే, జీవు లందరూ ఆకలితో మరణించే వారు. అతని వల్లనే వెలుగు. వెలుగులో ఉన్నది తానే. అతని వల్లనే ఓషధులు. ఓషధులలో శక్తి రూపంలో, రస రూపంలో, రుచి రూపంలో ఉన్నది కూడా తానే. ఇదంతా అర్థమైతే, బ్రతుకు తెరువులో భగవంతుడే దర్శన మిస్తూ ఉంటాడు. ఇన్ని విధాల మనలను కరుణించే దయామయుని వైపు ప్రార్థనలు కదులుతాయి.

పల్లవి : **గానలోల! కరుణాల వాల!**

**గాచి బ్రోవు నిరుపమ గుణశీల!** ॥ గాన ॥

చరణము : **కన్నులలో వెలుగువు నీవే**

**వెన్నెలలో వెలుతురు నీవే**

**జలమున ప్రాణము జగతిలో జీవము**

**అంతా నీవే! అనంతము నీవే!** ॥ గాన ॥ అని చైతన్యగీతం నినదించింది.

ధారణాశక్తిగా, పోషణాశక్తిగా సర్వమూ తానే అయిన సర్వేశ్వరుడు, జగత్తును ధరించి, పోషించి, పాలించే కార్యంలో దివ్యంగా భాసిస్తున్నాడు. ముల్లోకాలనే కుటుంబాన్ని పాలించే ప్రభు పాత్రను పోషిస్తున్నాడు (**స త్రైలోక్య కుటుంబ పాలనా పరః**).

కుటుంబాన్ని తండ్రి ఎలాగైతే పాలిస్తూ, పోషిస్తూ ఉంటాడో, అలాగే త్రైలోక్య కుటుంబాన్ని పరమేశ్వరుడు తండ్రి లాగా పోషిస్తున్నాడు. జీవుల భార మంతా తానే వహిస్తున్నాడు. ఈ సత్యాన్ని లోకం గ్రహించ గలిగితే, ధర్మాత్ముడైన తండ్రి సంతానంగా విశ్వం లోని మానవు లందరూ ధర్మబద్ధంగా జీవించ గలుగుతారు. ఇక్కడే సర్వ మానవ సౌభ్రాతృత్వం ప్రాణం పోసుకుంటుంది. విశ్వకళ్యాణం ఆవిష్కృత మవుతుంది.

*రసాత్మకుడైన చంద్రునిలో ప్రవేశించి, రసపూర్ణ ఓషధుల ద్వారా పౌష్టికాహారాన్ని ప్రసాదించిన పరమేశ్వరుడు, దానిని వంట పట్టించే కార్యంలో కూడా తానే మన వెంట ఉన్నాడు. ఇది వైశ్వానర విభూతి.*

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।**

**ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥** **14**

*అహం-వైశ్వానరః-భూత్వా-ప్రాణినాం-దేహం-ఆశ్రితః*

*ప్రాణాపాన సమాయుక్తః-పచామి-అన్నం-చతుర్విధం*

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | ఆశ్రితః | =ఆశ్రయించి |
| వైశ్వానరః | = జఠరాగ్ని | ప్రాణాపాన సమాయుక్తః | =ప్రాణాపానాది వాయువులతో కూడిన వాడనై |
| భూత్వా | = అయి | చతుర్విధం | =నాలుగు విధాలైన |
| ప్రాణినాం | = ప్రాణుల యొక్క | అన్నం | =అన్నమును |
| దేహం | = దేహమును | పచామి | =పచనము చేస్తున్నాను |

**అర్జునా! నేను వైశ్వానర రూపంలో జఠరాగ్నినై ప్రాణుల శరీరాలను ఆశ్రయిస్తాను. ప్రాణాపాన వాయువులతో కలిసి నాలుగు రకాలైన ఆహారాలను పచనం చేస్తున్నాను.**

### వ్యాఖ్య

పరమాత్మ సర్వాత్ముడు అనే దానికి హేత్వంతరమును విభూతి సంక్షేపంగా వివరించే ప్రయత్నంలో భగవానుడు వినిపించిన నాలుగు శ్లోకాలలో ఇది మూడవది. ఈ శ్లోకంలో సర్వులకు అనుభవంలో ఉండే వైశ్వానర విభూతిని వర్ణిస్తున్నాడు.

### వైశ్వానరాగ్ని

మనలో అగ్ని రూపంలో ఉన్నది కూడా భగవంతుడే. అదే వైశ్వానరాగ్ని. ఉదరంలో ఉన్న అగ్నిని వైశ్వానరాగ్ని





అంటారు. అది తానే అంటున్నాడు భగవంతుడు (**వైశ్వానరః ఉదరస్థః అగ్నిః అహ మేవ**). మనం భుజించిన ఆహారము పక్వం కావడానికి ఉపకరించే జఠరాగ్నియే ఈ వైశ్వానరాగ్ని.

భూమి మీద ఓషధుల జీవనానికి సూర్యుని రూపంలో కారణమై, రసాత్మకుడైన సోముని రూపంలో ఓషధులలో రసమును, రుచిని కల్పించిన పరమేశ్వరుడు మన కొరకు ఈ విధంగా ఓషధులను పోషించడమే గాక, మనం ఆరగించిన ఆహారాన్ని పచనం చేసే కార్యాన్ని కూడా తానే నిర్వర్తిస్తున్నాడు. బాహ్యంలో ఓషధులు తయారు కావడానికి కారణమైన సూర్యచంద్రులు తానే. ఆ ఓషధులను మనం వంట చేసుకోవడానికి మంట రూపంలో ఉన్న అగ్ని తానే (**తత్తేజో విద్ధి మామకమ్**). మనం వంట చేసుకొని ఆరగించిన ఆహారాన్ని దేహంలో ఉండి, దానిని పచనం చేసి దేహానికి వంట పట్టించే వైశ్వానరాగ్ని కూడా తానే.

వండిన ఆహారాన్నే మనం తింటాము. తినడం వరకైతే మనం చేయగలం. మరి తిన్న ఆహారం దేహానికి వంట పట్టాలి కదా? దానికి మనం ఏమి చెయ్యగలం? ఏమీ చెయ్యలేము. ఆహారం నాలుక మీద ఉన్నంత వరకే మన నాట్య మంతా. అధరం నుండి జారి ఉదరంలో పడిన తరువాత మనం చేయ గలిగింది ఏమీ లేదు. అక్కడ జరగ వలసింది ఏమిటో కూడా మనకు తెలియదు. అక్కడున్న వాడికే తప్ప. మరి అక్కడెవ రున్నారు? వాసుదేవుడే ఉన్నాడు. ఎలా ఉన్నాడు? వైశ్వానరాగ్ని రూపంలో ఉన్నాడు. ఎందు కున్నాడు? వంట చేయడానికి ఉన్నాడు. వంటకు కావలసిన మంట పెట్టేందు కున్నాడు.

అదేమిటి? వండిన ఆహారాన్నే కదా మనం ఆరగించేది! మళ్ళీ దానిని వండట మేమిటి? నిజమే. మనం వండుకున్న వంట తినడానికి పని కొస్తుంది కాని వంట పట్టడానికి కాదు. మనం భుజించిన ఆహారము తిరిగి పచనం కావాలి. అప్పుడే అది వంట బడుతుంది. ఆ వంటకు ఉపయోగపడే మంట ఏదో అదే వైశ్వానరాగ్ని. దానినే మనము జఠరాగ్ని అంటాము. ఈ అగ్ని ఆంతర్యంలో ఆహారాన్ని తిరిగి వండి అన్న రసాన్ని తయారు చేస్తుంది. ఆ రసం నుండే రక్తం ఉత్పన్న మవుతుంది (**రసాద్రక్తం**).

***అయ మగ్నిః వైశ్వానరో యోఽ యమన్తః పురుషే, యే నేద మన్నం పచ్యతే*** - పురుషునిలో ఉన్న అగ్ని వైశ్వానరాగ్ని. దీని చేత అన్నం పచనము చేయబడుతూ ఉంది అని బృహదారణ్యక ఉపనిషత్తు (*5 - 9 - 1*). పచనము చేయడ మంటే జీర్ణం చేయడ మని అర్థం. మనం తినిన ఆహారము జీర్ణం కాకుండా ఉదరములో అలా ఉండి పోతే ఎలా ఉంటుందో ఒక్కసారి ఆలోచించండి. కనుకనే, మనిషి బ్రతికేది అన్నంతో కాదు, అచ్యుతునితో అనే సత్యాన్ని కష్టించి అయినా అర్థం చేసుకోవాలి. ఓషధుల రూపంలో ఎవడు అన్నాన్ని సృష్టించాడో, వాడే వైశ్వానరాగ్ని రూపంలో ఆహారాన్ని మనకు వంట పట్టిస్తున్నాడు. అన్నమును సృష్టించిన వాడు తానే. అన్నమును భక్షించే వాడు కూడా తానే. **సోమ ఏవ అన్నమ్ అగ్ని రన్నాదః** - అన్న రూపంలో సోముడుగా శోభించిన వాడే అగ్ని రూపంలో వైశ్వానరుడుగా భాసిస్తున్నాడు. సోముడు అన్నము, అగ్ని అన్నాదుడు అన్నది తైత్తిరీయం. అగ్ని సోముల రూపమున (**అగ్నీ షోమ రూపం**) పరమేశ్వరుని ఆరాధించడమే వైశ్వానరోపాసన.

### దేహమే ఆశ్రయము

అన్నవంతుడైన పరమేశ్వరుడు అన్నాదుడు కావటానికి ప్రాణుల దేహాన్ని ఆశ్రయించి ఉన్నాడు (**ప్రాణినామ్ ప్రాణవతామ్ దేహం ఆశ్రితః ప్రవిష్టః**). దేహము ఏదో కాదు; అన్న వికారమే. అన్నము నుండే ఉత్పన్న మైంది (**అన్న భావనః అన్నాత్ ఉత్పత్తిః యస్య సః**). అన్నాన్ని సృష్టించిన వాడు, కనుక దానిని అన్న భావనగా చెబుతారు. వైశ్వానరాగ్ని రూపంలో అన్నమును పచనం చేసిన వాడు, అన్న అన్న రూపంలో దేహంలో ప్రవేశించిన వాడు, వైశ్వానరాగ్ని రూపంలో దేహమును వికారంగా మరొక దేహానికి కారణమైన వాడు - అన్నీ పరమేశ్వరుడే. ఇలా వైశ్వానరాగ్ని రూపంలో దేహమును

ఆశ్రయించుకొని ఉన్న భగవంతుడు ప్రాణాపానాలతో కూడి, మనం భుజించే నాలుగు విధాలైన ఆహార మును పచనం చేస్తున్నాడు.

నిప్పును ఊదితే అది రగుల్కొంటుంది. పొయ్యి లోని అగ్నిని ఊదుతూ ప్రజ్వలింప చేసినట్లు, కొలిమి లోని అగ్నిని కొలిమి తిత్తి ద్వారా రగిలించినట్లు, ప్రాణాపానాలు కొలిమితిత్తి లాగా వాయువును అందించి వైశ్వానరాగ్నిని జ్వలింప చేస్తూ ఉంటాయి. ఉచ్ఛ్వాస నిశ్వాస రూపాలుగా చలిస్తూ, భుజించిన ఆహారాన్ని వైశ్వానరాగ్ని పచనం చేయడానికి ప్రాణాపానాలు సహకారులుగా పని చేస్తూ ఉంటాయి. అంటే, సర్వ ప్రాణుల దేహా లను వైశ్వానరాగ్ని రూపంలో ఆశ్రయించి ఉన్న జఠరాగ్నిని ప్రాణాపానాలు ఉద్దీపింప చేస్తూ ఉంటాయి. అలా ప్రజ్వలింప బడిన వైశ్వానరాగ్ని మనం భుజించే నాలుగు విధాలైన ఆహారమును పచనం చేయడం జరుగుతుంది.

అర్జునా! ప్రాణుల దేహాలను వైశ్వానరుని రూపంలో ఆశ్రయించిన నేను, ప్రాణాపాన వాయువులతో కలిసి (**ప్రాణాపానాభ్యాం సంయుక్తః**) నాలుగు రకాలైన అన్నమును జీర్ణం చేస్తున్నాను (**పచామి పక్తం కరోమి, చతుర్విధం అన్నం, భోజ్యం, భక్ష్యం, చోష్యం, లేహ్యం చ**). భోజ్యములు, భక్ష్యములు, చోష్యములు, లేహ్యములు అనేవే నాలుగు విధాలైన ఆహారములు.

## అన్న చతుష్టయము

మనం తినే ఆహారము నాలుగు రకాలుగా ఉంటుంది. ఈ నాలుగు విధాలైన ఆహారమును వైశ్వానరాగ్ని రూపంలో ఉండి పరమేశ్వరుడే పచనం చేస్తున్నాడు (**అన్నం చతుష్ప్రకారమ్**). భక్ష్యములు, భోజ్యములు, చోష్యములు, లేహ్యములు అనేవి నాలుగు రకాల అన్నములు.

దంతముల చేత కొరికి, బాగా నమిలి తినబడే వాటిని భక్ష్యములు అంటారు. వీటినే ఖాద్యములు అని కూడా అంటారు. గారెలు, అరిసెలు, కొబ్బరి ఉండలు, బొబ్బట్లు - ఇవన్నీ భక్ష్యములు. వీటిని చర్వ్యములు అని కూడా అంటారు (**చర్వ్, చర్వతి, చర్వయతి - తే**). కొరికి, నమిలి తినబడేవి కనుక అవి చర్వ్యములు.

ఎక్కువగా నమల వలసిన పని లేకుండా, నాలుక చేత అటు ఇటు త్రిప్పి ఆస్వాదించ బడేవి భోజ్యములు. భక్ష్యముల కన్నా మెత్త నైనవి. అన్నము, హల్వా, పొంగలి, కూరలు ఇవన్నీ భోజ్యములు.

నాలుకపై ఉంచుకొని, ఆస్వాదించి మ్రింగేవి చోష్యములు. నమల వలసిన, తినవలసిన అవసరం లేకుండానే ఆస్వాదించ దగినవి. పాయసము, ఐస్‌క్రీమ్ మొదలైనవి చోష్యములు. చోష్యములను పేయములు అని కూడా అంటారు. పేయములు అంటే త్రాగ దగినవి. పాలు, మజ్జిగ, మధుర పానీయా లన్నీ చోష్యములే.

చివరగా నాలుగో రకము లేహ్యములు. నాలుక చేత నాకబడేవి లేహ్యములు. ఇవి కొరికేవి కావు; నమిలేవి కావు; త్రాగేవి కావు. కేవలం చప్పరించి మ్రింగ బడేవి. తేనె, పెరుగు, పచ్చళ్ళు, ఊరగాయలు - ఇవన్నీ లేహ్యములే.

ఈ విధంగా మనం భుజించే నాలుగు రకాలైన అన్నాలను వైశ్వానరాగ్ని రూపంలో ఉండి భగవంతుడే జీర్ణం చేస్తున్నాడు. అంటే, అన్నము, అన్నమును తినే వాడు ఇరువురూ పరమేశ్వరుడే. భోక్త , అగ్ని రూపంలో ఉన్న వైశ్వానరుడు. వైశ్వానరాగ్ని రూపంలో ఉన్నది భగవంతుడే (**భోక్తా వైశ్వానరః అగ్నిః**). భోజ్యము, అన్న రూపంలో ఉన్న సోముడు. సోముని రూపంలో ఉన్నదీ పరమేశ్వరుడే. కనుక వైశ్వానర విశేషము విభూతియే. భోజన క్రియ యజ్ఞకార్య మైంది. యజ్ఞ కర్మలో హవిస్సులు మొదలైన అర్పణాదికాలను పరమేశ్వర స్వరూపమైన అగ్ని యందు ఎలా హోమం చేయడం జరుగుతుందో, అలాగే భోజనాదికాలనే హవిస్సును వైశ్వానరాగ్ని అనే బ్రహ్మ స్వరూపము నందు హోమం చేయడం జరుగుతూ ఉంది అని అర్థము (**అగ్నిః అపి బ్రహ్మ ఏవ యత్ర**





**హూయతే**). భోజన క్రియ ఎప్పుడైతే యజ్ఞముగా భావింప బడిందో, మనం ఆరగించే ఆహారము అమృత మైంది. బ్రహ్మమే అయింది. బ్రహ్మఫలం అందిన ట్లైంది (**యత్ తేన గంతవ్యం ఫలం తదపి బ్రహ్మైవ**). అందుచేతనే భోజన వేళల్లో **అహం వైశ్వానరో భూత్వా** అనే ఈ శ్లోకాన్ని పఠించి, ఆ తరువాత అర్పణ భావంతో **బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః** ( 4 వ అ - 24వ శ్లో) అనే శ్లోకాన్ని పలికి, జలాన్ని ఔపాసనం పట్టి ఆహారంపై చల్లు కుంటారు. అన్నశుద్ధి, అర్పణ సిద్ధి కారణంగా ఆహారం అమృత రూప మవుతుంది.

## ఆరాధనా భావము

భోజ్యమైన అన్నములో సోముని రూపం లోను, భోక్త యైన వైశ్వానరునిలో అగ్ని రూపం లోను, జఠ రాగ్నిలో పచనం చేసే శక్తి గాను, సర్వత్ర బ్రహ్మమే ఉన్నందున, **ఊర్ధ్వ మూలం** అనే ఆరంభ శ్లోకం యొక్క తత్త్వార్థం సిద్ధిస్తూ ఉంది. **తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః** - సర్వత్ర కాంతు లీనుచూ, సర్వతోముఖంగా ఈ దేహంలో గొప్ప అగ్ని ప్రకాశిస్తూ ఉంది అనే వేద ప్రమాణం అనుభూత మవుతూ ఉంది.

భోజన సమయంలో యజ్ఞకార్యం నడుస్తూ ఉన్నందున, ఆరాధనా భావంతో ఆహారాన్ని నైవేద్యంగా సమర్పిస్తూ, కొందరు **బ్రహ్మార్పణం** అనే శ్లోకాన్ని ఉచ్చరిస్తే, కొందరు మొదటి అన్నపు ముద్దను ఉండ చుట్టి ప్రక్కన పెడతారు. ఆ తరువాత దానిని పక్షులకు బ్రహ్మభావంతో సమర్పిస్తారు. ఆహారాన్ని ఆరగించే సమయంలో ఉదరములో వైశ్వానర క్రియ సాగుతూ ఉన్న కారణంగా, బ్రహ్మకర్మకు అంతరాయం కలగ రాదని మౌనంగా భోం చేస్తారు. భోజన మధ్య కాలంలో కృతజ్ఞతా భావంతో పరమేశ్వరుని స్మరించుకుంటూ గోవింద నామాన్ని పలుకుతారు.

ఆహారాన్ని పరమేశ్వరునికి సమర్పిస్తున్నాము కనుక, భోక్త భగవంతుడే కాబట్టి, అర్పించే ఆహారాన్ని సాత్త్వికంగా, పవిత్రంగా ఉండే విధంగా హిందువులు వంట వార్పులు మొదలుకొని, వడ్డన ఆరగింపుల వరకు సాత్త్విక శ్రద్ధను ప్రదర్శిస్తూ ఉంటారు. సాత్త్వికాహారాన్నే భుజిస్తారు. ఏది సాత్త్వికాహారము? అని సందేహించ కండి. ఈ విషయాన్ని శ్రద్ధాత్రయ విభాగ యోగము - ఎనిమిదవ శ్లోకం వచ్చి నపుడు చెప్పుకుందాం.

ఆహారము సాత్త్వికంగా ఉండటమే కాదు. ఆహార సంపాదనా మార్గం కూడా ధర్మబద్ధంగా ఉండాలి. న్యాయార్జితమే నైవేద్య మవుతుంది. అన్యాయార్జితాన్ని అచ్యుతుడు అంగీకరిస్తాడా? ఆరగిస్తాడా? ఒక్కొక్కప్పుడు మనకు తెలియకుండానే సంపాదనలో అధర్మము చోటు చేసుకొనే అవకాశం ఉంది కదా! అలాంటిది కూడా గర్హనీయ మేనా? అనే సందేహము మీకు రావచ్చు. దోషము ఏదైనా దోషమే. కాకపోతే, ఈ విధమైన అన్న దోషము వైశ్వానరోపాసన వల్ల తొలగి పోతూ ఉంది. అన్న రూపంలో ఉన్న సోముడు, అన్నాదుని రూపంలో ఉన్న వైశ్వానరాగ్ని రెండిటిని, అంటే అగ్నిషోమములను పరమేశ్వర స్వరూపంగా భావన చేసే వారికి అన్న దోషం వల్ల కలిగే లోపం అంటదు (**అగ్నీ షోమౌ సర్వమ్ ఇతి పశ్యతః అన్న దోష లోపః న భవతి**).

ఆరాధనా భావంతో ఆహారాన్ని పరమేశ్వరునికి సమర్పించడం జరిగిన తరువాత, భోక్త పరమేశ్వరుడే కనుక ఆ దోషం మనల్ని అంటదు. ఆ పాపం ఇక మనది కాదు. మరి, మన పాపాన్ని పరమేశ్వరునికి అర్పించి, ఆ దోషం ఆయనకు అంటేటట్లు చేయడం పాపం కాదా? కానే కాదు. ఎందుకని? ఆయన కర్త కాదు. పైగా, అకర్త. మనకు ఏది వాస్తవమో అదంతా ఆ దివ్యాత్ముని దృష్టిలో మిథ్య.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్ ॥ 15

సర్వస్య-చ-అహం-హృది-సన్నివిష్ఠః-మత్తః-స్మృతిః-జ్ఞానం-అపోహనం-చ
వేదైః-చ-సర్వైః-అహం-ఏవ-వేద్యః-వేదాంతకృత్-వేదవిత్-ఏవ-చ-అహం

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | అహం ఏవ | = | నేనే |
| సర్వస్య చ | = | సమస్త ప్రాణుల యొక్క | సర్వైః | = | సమస్తములైన |
| హృది | = | హృదయము నందు | వేదైః | = | వేదముల చేత |
| సన్ని విష్టః | = | ఉన్నాను | వేద్యః చ | = | తెలియదగిన వాడను |
| మత్తః | = | నా వలన | అహం ఏవ | = | నేనే |
| స్మృతిః | = | జ్ఞాపకశక్తి | వేదాంతకృత్ | = | వేదాంతకర్తను |
| జ్ఞానం | = | జ్ఞానము | వేదవిత్ చ | = | వేదవిదుణ్ణి కూడా |
| అపోహనం చ | = | మరపును | | | |

**అర్జునా! అందరి హృదయాలలో నేను ఉన్నాను. నా వల్లనే స్మృతి, జ్ఞానము , వాటి మరపు కూడా. సమస్త వేదాల చేత తెలియదగిన వాణ్ణి నేనే. నేనే వేదాంత కర్తను. వేదాన్ని తెలిసిన వాణ్ణి కూడా నేనే.**

### వ్యాఖ్య

విశ్వంలో వెలుగులను ఆరబోస్తున్న సూర్య చంద్రాగ్నుల లోని తేజము, సర్వ ప్రాణులను ధరిస్తున్న భూమి లోని ధారణా శక్తి, భూమి మీద సమస్త ఓషధులను రసపూర్ణం చేస్తున్న సోముని రసాత్మక స్వరూపము, ప్రాణుల లోని వైశ్వానరాగ్ని, అన్న - అన్నాద రూపములో విశేషంగా విస్తరించి ఉన్న తన వైభవము - ఇలా భగవానుడు సంక్షేప విభూతులను వివరించడం ద్వారా తన సర్వాత్మకత్వాన్ని నిరూపించడం జరిగింది. విశ్లేషించి అవలోకిస్తే ఇదంతా 'తత్' పదమును నిర్దేశించినట్లు అర్థ మవుతుంది. ఇక వ్యక్తి లోని 'త్వం' పదమును విస్పష్టం చేస్తే జ్ఞానం పరిపూర్ణ మవుతుంది. పురుషోత్తమ తత్త్వము అనుభూత మవుతుంది. కనుక, పన్నెండవ శ్లోకంలో *యదాదిత్యగతం తేజః* అంటూ ప్రారంభించిన విభూతుల సంక్షేపాన్ని ప్రస్తుత శ్లోకంలో ఆత్మ విభూతిని, జ్ఞాన విభూతిని, సంప్రదాయ విభూతిని దివ్యంగా ప్రవచించి సమాప్తం చేస్తున్నాడు.

### హృ'దయ'ంలో దయానిధి

'అర్జునా! సర్వ ప్రాణుల (*సర్వస్య ప్రాణి జాతస్య*) హృదయంలో (*హృది బుద్ధౌ*) నేను ఆత్మరూపంగా ఉన్నాను (*అహమ్ ఆత్మా సన్ సంనివిష్టః*)'. భగవానుడు ఆత్మరూపంలో ఉండటము అంటే తన స్వరూప మహిమలో శోభించడము అని అర్థము. సచ్చిదానంద స్వరూపంగా భాసించడము అని భావము. ఇదే స్వరూప మహిమ, లేదా స్వరూప వైభవము.

***అహమస్మి*** - 'నేను ఉన్నాను' అని ప్రతి మనిషి చెబుతున్నాడు. ఈ విషయాన్ని అందరూ ఒకే విధంగా చెబుతున్నారు. ఎలా ఉన్నావు? అని తిరిగి ప్రశ్నించి నపుడే, పరిస్థితి క్లిష్టంగా మారుతూ ఉంది. ఎవరి మధ్య ఏకాభిప్రాయం లేదు. ఎందుకని? ఏకమైనది ఏదో, దానికి సంబంధించిన జ్ఞానం లేకపోవడం చేత ఏకాభిప్రాయం లేదు.

'నేను ఉన్నాను' అని శరీరం చెబుతుందా? లేదు. శరీరం చెప్పే టట్లైతే, పిచ్చివాడు మొదలుకొని శవం వరకు అన్ని దేహాలు చెబుతాయి 'నేనున్నాను - నేనున్నాను' అని. దేహం ఉంది. కాని, తాను ఉన్నట్లు దేహానికి తెలియదు. అందుచేత, నేనున్నాను అని దేహం చెప్పదు. పైగా, 'ఇది నా దేహము' అని మనం చెబుతున్నాం. కనుక, 'నేను' అనే భావన (*అహం భావన*) దేహంలో లేదు. దేహానికి లేదు.





దేహానికి అహంభావన ఎలా లేదో ఇంద్రియాలకూ లేదు. అవన్నీ విషయాల్ని మనస్సుకు చేర వేసే పరికరాలుగా ఉన్నాయే కాని, విషయాలను తెలుసుకొనే స్థితిలో లేవు. అందుచేత 'నేను తెలుసుకున్నాను' (*అహం జానామి*) అని ఏ ఇంద్రియమూ చెప్పడం లేదు.

'నేను ఉన్నాను' అనే జ్ఞానం మనోవృత్తికి మాత్రమే ఉంది అని చాలా మంది మేధావులు కూడా భ్రమిస్తూ ఉంటారు. వృత్తి మనస్సులో ఉంటుందే గాని, వృత్తిలో 'నేను' అనే జ్ఞానం లేదు. స్వరూప జ్ఞానం లేదు. దేహం మొదలు మనస్సు వరకు అన్నీ ఆధేయాలే గాని ఏదీ ఆధారం కాదు. వీటన్నిటికి ఏది అధిష్ఠానంగా ఉందో అదే ఆధారము. సర్వాధారము. స్వప్రకాశము. స్వరూప వైభవము (*స్వమహిమ*).

ఇంద్రియాలు పరవశ మైతే, మనస్సు నిష్క్రియ మైతే, దేహం కొయ్యమొద్దు లాగా పడి ఉంటుంది. అంతే గాని, 'నేనున్నాను' అని లేచి నడవదు. దేహం స్వతంత్ర శక్తి లేనిది. పరాధీనమై ఉన్నది. ఇంద్రియాలు కూడా విషయాలను గ్రహించ గలవే కాని, విషయాలకు సంబంధించిన జ్ఞానం కలగడానికి అవి మళ్ళీ మనస్సుపై ఆధారపడి ఉన్నాయి. మరైతే, మనస్సుకు స్వయం సత్తా, స్వయం స్ఫూర్తి ఉన్నాయా? లేవు. ఉంటే, గాఢనిద్రలో కూడా మనస్సు విషయ గ్రహణం చేయ గలిగి ఉండాలి. మనస్సుకు సత్తా స్ఫురణలు చైతన్యం వల్ల కలుగు తున్నాయి. దేహేంద్రియ మనస్సులు ఒక దానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. మరి చైతన్యము దేనిపై ఆధారపడి ఉంది? చైతన్యము ఆధార పడటానికి మరొక చైతన్యము లేదు. చైతన్యము ఏకము, అద్వయమే గాని రెండుగా ఉండ లేదు. రెండు చైతన్యాలు ఉండటం అనూహ్యము, అసంభవము, అశాస్త్రీయము.

మరొక దానిపై ఆధారపడి లేనందున చైతన్యము స్వతఃసిద్ధము. స్వతఃసిద్ధమైన సత్తారూప చైతన్యాన్ని ప్రకాశింప చేయడానికి మరొక చైతన్యము లేనందున అది స్వప్రకాశము. సత్తా స్ఫురణాత్మకమైన ఈ చైతన్యమే ఆత్మ. *అహం* స్వరూపము. దేహేంద్రియ మనస్సులకు అధిష్ఠానమైన ఈ చైతన్యాత్మ ప్రతి ప్రాణి హృదయంలో దివ్యంగా ప్రకాశిస్తూ ఉంది (*హృది సన్నివిష్టః*).

ఇప్పుడు తత్త్వం స్పష్ట మైందని భావిస్తాను. 'నేను ఉన్నాను' (*అహమస్మి*) అని ఎవరు అన్నా, 'నేను ఆత్మ రూపంగా ఉన్నాను' (*అహమ్ ఆత్మా సన్ సన్నివిష్టః*) అనేదే పరమార్థం. అట్టి జ్ఞానం వ్యక్తికి లేక పోవచ్చు. జ్ఞానం లేని కారణంగా, ఉన్న దానిని మరొక విధంగా భావించ వచ్చు. అంత మాత్రాన వస్తువు వస్తువు కాకుండా పోదు. ఇది రోజా పుష్పము అనే జ్ఞానం లేని వాడు దానిని చేమంతి అన్నంత మాత్రాన అది చేమంతిగా మారి పోతుందా?

రోజా పుష్పానికి సంబంధించిన జ్ఞానం లేక పోవడం చేత ఇది రోజా పుష్పము అని తెలుసుకోలేక పోయాడు. అంతే. కనుక, అతని వద్ద రోజా పుష్పానికి సంబంధించిన జ్ఞానం లేదు. మరే ముంది? రోజా పుష్పానికి సంబంధించిన అజ్ఞానం ఉంది. అజ్ఞాన కారణంగా రోజా రోజాగా తెలియక పోగా, చేమంతిగా అర్థమైంది. ఇదే అధ్యాస. అది కాని దాని యందు అది అనే బుద్ధి (*అతస్మిన్ తద్బుద్ధిః*).

అధ్యాస నివారించ బడదు. అజ్ఞాన నివృత్తి జరిగితేనే అధ్యాస తొలగుతుంది. అజ్ఞానము జ్ఞానము వల్లనే పోతుంది. దేనికి సంబంధించిన జ్ఞానం? ఉన్న దానికి సంబంధించిన జ్ఞానము. అదే ఆత్మజ్ఞానము. సత్య జ్ఞానము. వేదాంత జ్ఞానము.

దీనిని తెలుసుకోవాలి. దీనిని దర్శించాలి అన్నది బృహదారణ్యక శ్రుతి (*ఆత్మా వా అరే ద్రష్టవ్యః*). నీవు చైతన్య రూపుడవు, సర్వాత్మవు అని శాస్త్రం ప్రామాణికంగా బోధిస్తూ ఉంది. అది నీవు కానవసరం లేదు. అది నేను అని తెలుసుకుంటే చాలు. ఇదే అర్థం కావలసిన విషయం.

అయ్యా! నువ్వు గాయకుడివి అని గాయకుడు కాని వ్యక్తికి చెబితే, అది విని, ఆసక్తిని పెంచుకొని 'అనగ అనగ రాగ' మంటూ దివారాత్రాలు సాధన చేసి, ఎలాగైతే నేమి సంగీత జ్ఞానాన్ని సముపార్జించుకొని అతడు గాయకుడు కావచ్చు.

అదే విధంగా, నువ్వు ఆత్మవు. నువ్వే బ్రహ్మానివి ***(త్వం బ్రహ్మాసి)*** అని ఒక వ్యక్తికి చెబితే, అతడు బ్రహ్మము కావడానికి ప్రయత్నించా డనుకోండి. కఠోర సాధన చేశా డనుకోండి. అతడు బ్రహ్మము అవుతాడా? కానే కాడు. ఎందుకని? అతడు బ్రహ్మము అయ్యే ఉన్నాడు కనుక. ఎవడైనా లేని దానిని పొందగలడు గాని ఉన్న దానిని ఎలా పొందుతాడు? ఉన్నది అని తెలుసుకుంటాడు. అంతే. అదే జ్ఞానం. నేను ఆత్మ గానే ఉన్నాను అనే జ్ఞానం. ఆత్మజ్ఞానం. ఈ విషయం గురువు చెబుతాడు. అది అవునో కాదో నువ్వు విచారించు కోవాలి ***(అతః విచారః కర్తవ్యః)***. శాస్త్ర విచారం చెయ్యాలి. అది కూడా గురూప సదనం లోనే జరగాలి.

అప్పుడు తెలిసి వస్తుంది. నేను ఆత్మను. చైతన్యాత్మను. క్రొత్తగా సంభవించే వాణ్ణి కాను. సదా సిద్ధమై ఉన్నాను. సద్రూపంగా ఎప్పుడూ ఉన్నాను ***(సద్రూపేణ అహం సదా అస్మి)***. చిద్రూపంగా సదా ప్రకాశిస్తూ ఉన్నాను ***(చిద్రూపేణ అహం సదా భామి)***. సద్రూపముగా, చిద్రూపముగా ఉన్న నేను అనంత స్వరూపముగా విరాజిల్లు తున్నాను. అనంతాత్మ సమస్తము తానై ఉంది. మరి బ్రహ్మము? ఆత్మయే బ్రహ్మము. ఈ ఆత్మయే బ్రహ్మము ***(అయమాత్మా బ్రహ్మ)***.

***సర్వం ఆత్మైవ, తల్లక్ష్యం శుద్ధాత్మ దృష్ట్యా వా యః పశ్యతి స ఏవ బ్రహ్మ నిష్ఠో భవతి*** - 'సమస్తమూ ఆత్మయే. ఈ వాక్యానుసారము పరమాత్మయే లక్ష్యము. ఈ విధంగా ఆత్మ పరమాత్మ స్వరూపము అనే అద్వయ జ్ఞానంతో దర్శించే వాడు బ్రహ్మనిష్ఠుడు' అని మండల బ్రాహ్మణోపనిషత్తు.

**అధిష్ఠానమే సర్వాధారము**

సర్వాత్మయే హృదయస్థమై ఉన్నందున, మనిషి మనస్సులో ఏర్పడే స్మృతి, జ్ఞాన, అపోహనాలు ఆత్మ కారణం గానే కలుగు తున్నాయి. అర్జునా! ఈ కారణంగా ***(అతః)*** నా వల్లనే సర్వ ప్రాణులకు ***(మత్తః ఆత్మనః సర్వ ప్రాణినాం)*** స్మృతి, జ్ఞానము, అపోహనము కలుగు తున్నాయి ***(స్మృతిః జ్ఞానం తదపోహనం చ)***.

మొదటిది స్మృతి. స్మృతులు అంటే జ్ఞాపకాలు. గత అనుభవాలకు సంబంధించిన జ్ఞానమే స్మృతి. రెండవది జ్ఞానము. విషయ ప్రపంచానికి సంబంధించిన పరిజ్ఞాన మంతా జ్ఞానము అని చెప్ప బడింది. అది ఇహ పరాలకు సంబంధించిన ఏ జ్ఞాన మైనా కావచ్చు. ప్రధానంగా జ్ఞానము అంటే వృత్తి రూప జ్ఞానము అని అర్థము. ఇక మూడవది అపోహనము. అంటే వ్యక్తిలో స్మృతి జ్ఞానాలు ఏవైతే ఉన్నవో, అవి లేకుండా పోవడము, స్మృతి జ్ఞానాలను మరచి పోవడము అపోహనము. ఇవన్నీ చైతన్యం వల్లనే సంభవిస్తున్నాయి అంటున్నాడు.

చైతన్యం లేనిదే మనస్సు ఆలోచించ లేదు. చైతన్యము లేనిదే చిత్తానికి స్మృతి రాదు. చైతన్యం లేనిదే బుద్ధిలో జ్ఞానం వికసించదు. జ్ఞానాలకు, స్మృతులకే కాదు, మరపుకు కూడా ***(విస్మృతి)*** చైతన్యమే ఆధారము.

కొందరికి అన్నీ జ్ఞాపక ముంటాయి. కొందరికి కొన్నే జ్ఞాపక ముంటాయి. కొందరికి ఏవీ జ్ఞాపక ముండవు. కొందరికి జ్ఞాపక శక్తి ఉంటుంది గాని, అవసరానికి ఉపయోగ పడకుండా ఉంటుంది.

ఒక యువకుడు ఉద్యోగ నిమిత్తం ఇంటర్వ్యూకి వెళ్తాడు. అక్కడ తనకు ఎదురైన ప్రశ్నలకు చక్కని సమాధానాలు చెప్పి, ఉద్యోగాన్ని సంపాదించి సంతోషిస్తాడు. ఆ యువకుని సంతోషానికి అతని లోని జ్ఞానము, స్మృతియే కారణము.

ఒక అభ్యర్థి పోటీ పరీక్షలో పాల్గొని, పరీక్ష చక్కగా వ్రాసి ఉత్తీర్ణుడై, పెద్ద ఉద్యోగాన్ని సంపాదించి తృప్తి





చెందుతాడు. అతని తృప్తికి అతని లోని జ్ఞానము, స్మృతియే కారణము. ఈ విధమైన జ్ఞానము, స్మృతి బుద్ధిలో ఏర్పడ టానికి ఆత్మ చైతన్యమే కారణము.

ఇక మూడవది అపోహనం. దీనినే కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అపోహనం అంటే మరపు. మరచి పోయేది ఉన్న వాటినా, లేని వాటినా? లేని వాటిని మరచే దేముంటుంది? కనుక ఉన్న వాటినే మరచి పోవాలి. బుద్ధిలో ఉన్న వాటినే మరచి పోవాలి. ఉన్న జ్ఞానము జ్ఞాపకం రాదు. పొందిన అనుభవము స్మృతికి అందదు. అదే అపోహనం. జ్ఞాపకం రాదు; స్మృతికి అందదు అంటే, శాశ్వతంగా మరచి పోయాడని కాదు. అది అపోహనం క్రిందికి రాదు.

బుద్ధి లోని స్మృతి, జ్ఞానములు అవసరమైన సమయాలలో బుద్ధికి అందవు. అదే అపోహనం యొక్క ప్రభావము. 'ఏదో చెప్పాలనుకున్నా నండి, అదే అర్థం కావడం లేదు!' అని కొందరు అంటూ ఉంటారు. మరి కొందరేమో, 'గొంతు లోనే ఉందండి, జ్ఞాపకం రావడం లేదు!' అంటూ ఉంటారు. గొంతులో ఏముంది? గొంతు లోనే ఉంటే శుభ్రంగా చెప్పొచ్చు కదా, పచ్చి వెలగకాయ అని!

అమెరికా వెళ్తున్న ఆత్మీయుణ్ణి కలిసి అతి ముఖ్యమైన విషయం ఏదో చెప్పాలని ఒక వ్యక్తి విమానాశ్రయానికి వెళ్తాడు. అక్కడికి వెళ్ళిన తరువాత అవీ - ఇవీ మాట్లాడి, చెప్ప వలసిన ముఖ్య విషయాన్ని మరచిపోయి, ఇంటికి తిరిగి వస్తాడు. ఇంటికి వచ్చిన తరువాత జ్ఞాపక మొస్తుంది చెప్పడం మరచి పోయాడని. ఈ లోగా భార్యామణి, 'ఏమండీ, చెప్పి వచ్చారు కదా!' అంటుంది. అంతే. ఇక సమాధాన మేముంటుంది, నీళ్ళు నమలడం తప్ప! అప్పుడు గీత - పదిహేనవ అధ్యాయం అధ్యయనం చేసినందుకు మనం జ్ఞాపకం చెయ్యవలసి వస్తుంది. అయ్యా! నీళ్ళను నమలరు. నీళ్ళు చోష్యములు కదా! పేయము లైన వాటిని అలా నమలడ మేమిటి? నమల వలసినవి భక్ష్యములు కదా! అని అన్న చతుష్టయాన్ని వివరించ వలసి వస్తుంది.

స్మృతికి, జ్ఞానానికి, అపోహనానికి చైతన్యాత్మయే ఆధారము అనేదే ఇక్కడ ప్రధానమైన విషయము. నిజమే, చైతన్యాత్మ అందరిలో సమంగా ఉంది కదా! అలాంటప్పుడు, కొందరికి స్మృతి జ్ఞానాలు చక్కగా ఉండట మేమిటి? కొందరికి అపోహనం ఎక్కువ ఎందుకని? అలా ఉండబట్టే కదా కొందరికి సుఖము, కొందరికి దుఃఖము కలుగుతూ ఉన్నాయి! స్మృతి, జ్ఞాన, అపోహనాల కారణంగా మానవులకు సంభవించే సుఖదుఃఖాలకు చైతన్యమే కారణము అని అంగీకరించ వచ్చా? కూడదు. అది కుదరదు. చైతన్యాత్మ నిష్క్రియము. నిర్మలము. నిష్క్రియాత్మకు కర్తృత్వాన్ని అంటకట్ట డానికి వీలు లేదు. ఆత్మ సదా అసంగము. మరి, వ్యక్తులలో స్మృతి, జ్ఞాన, అపోహనాది భేదాలకు, తత్ఫలితంగా సంభవించే సుఖదుఃఖాలకు హేతు వేమిటి? అనేది శంక.

ఈ సందేహానికి భాష్యంలో సమాధానం స్పష్టంగా ఉంది. ఎవరైతే పుణ్య కర్మ లాచరించారో, వారికి పుణ్య ఫలంగా బుద్ధి శుద్ధిపడి ఉన్నందున విస్పష్టమైన స్మృతి జ్ఞానాలు ఉంటాయి. ఎవరైతే పాప కర్మలు ఆచరించారో, వారికి పాప ఫలంగా బుద్ధి దూషితమై ఉన్నందున స్మృతి జ్ఞానాలు లోపించడము అనే అపోహనం కలుగుతూ ఉంటుంది ***(యేషాం యథా పుణ్య కర్మిణాం పుణ్య కర్మానురోధేన జ్ఞాన స్మృతీ భవతః తథా పాప కర్మిణాం పాప కర్మాను రూపేణ స్మృతి జ్ఞానయోః అపోహనం చ అపాయనం అపగమనం చ)***.

**వేదితవ్యం**

వేదము లన్నిటి చేత ***(వేదైశ్చ సర్వైః)*** తెలియదగిన వాణ్ణి నేనే ***(అహ మేవ వేద్యః వేదితవ్యః)*** అంటున్నాడు భగవంతుడు.

వేదము అనేది జ్ఞాన భాండాగారము. వేదములు అనేక విషయాలను ప్రతిపాదిస్తాయి. ద్రవ్య సంబంధ మైన యజ్ఞ యాగాదులు వేదంలో చెప్ప బడ్డాయి. కర్మకాండ ఉంది. అలాగే ఉపాసనా కాండ కూడా ఉంది. ఇవి అన్నీ కర్మ ప్రధానంగా ఉంటాయి. ఫలసంగంతో కూడి ఉంటాయి. కర్మఫల ప్రాధాన్యంగా ఉంటాయి. కాని, వేదాల లోని ఉపనిషత్తులు కేవలం జ్ఞాన ప్రధానంగా ఉంటాయి. వేదాలలో ఇదే శ్రేష్ఠమైన జ్ఞానము. పరమాత్మకు సంబంధించిన జ్ఞానము. కనుక ఇదే వేదితవ్యం, అంటే తెలియ దగింది. అట్టి వేదితవ్యుడు తానే అంటున్నాడు గీతాచార్యుడు ***(వేద్యః)***. మోక్షమును పొంద గోరే ముముక్షువులు తెలుసుకోదగిన వాడు పరమాత్మ ఒక్కడే కనుక ఆయన వేదితవ్యుడు. వేద్యుడు ***(నిశ్శ్రేయసార్థిభిః వేదనార్హాత్వాత్ వేద్యః)***. మోక్షము అనేది అమృతత్వ స్థితి అయినందున మోక్షమును పొందిన జీవులు జననమరణాల నుండి విముక్తులై తరిస్తారు. అట్టి మోక్షము జ్ఞానరూపంలో ఉంది. అది పరమాత్మకు సంబంధించిన జ్ఞానము. అదే వేద్యము, వేదితవ్యము, జ్ఞేయము. అర్జునా! దేనిని తెలుసుకుంటే నీవు మృత్యువు నుండి విడిపడి అమృతత్వమును పొందుతావో అట్టి జ్ఞేయమును నీకు బోధిస్తున్నాను అన్నాడు భగవంతుడు *(13 వ అ - 12 వ శ్లో)*. అక్కడ ఏదయితే జ్ఞేయంగా చెప్ప బడిందో అదే ఇక్కడ వేద్యంగా చెప్పబడుతూ ఉంది. పరమాత్మ జ్ఞానమును పొందిన తరువాత మరొక జ్ఞానమును పొంద వలసిన అవసరం ఉండదు. కారణం, దానికి మించిన జ్ఞానం లేక పోవడమే *( 6 వ అ - 22 వ శ్లో )*.

**వేదము - వేద్యము**

వేదము జ్ఞానమయం. పరమాత్మ జ్ఞానమయుడు. జ్ఞానమును తెలియ చేసేది వేదము. జ్ఞానము ద్వారా తెలియబడే వాడు పరమాత్మ. పరమాత్మ, పరమాత్మ జ్ఞానము వేరు కానందున వేద్యుడైన పరమాత్మ వేదరూపుడు. కనుకనే, 'వేద' నామధేయుడు ***( వేద రూపత్వాత్ వేదః )***. అంతే కాదు. పరమాత్మ అనుగ్రహం చేతనే వేద జ్ఞానము ప్రాప్తిస్తుంది. అందువలన కూడా ఆయన వేద నామధేయుడు ***(వేదయతీతి వా వేదః)***. వేద నారాయణుడు. భగవానుడు వేద స్వరూపము. వేదము భగవ త్స్వరూపము. సృష్టికి పూర్వము పరమాత్మ ఒక్కడే సద్రూపంగా, ఏకంగా, అద్వితీయంగా భాసించాడు. సృష్టికి పూర్వం పరమాత్మ ఉంటే, ఆయన జ్ఞానం కూడా సృష్టికి పూర్వమే ఉంది. అదే వేదం. పరమాత్మ తన జ్ఞానం తోనే ఈ సృష్టి కార్యాన్ని నిర్వర్తించాడు. కనుక, సృష్టి లోని జ్ఞాన మంతా వేద జ్ఞానమే. ఈ కారణం చేతనే వేదములు అపౌరుషేయములు. జ్ఞానము అనేది తెలియ బడేదే గాని సృష్టింప బడేది కాదు. అందుచేత వేదము ప్రమాణమై మోక్షమును అనుగ్రహించే స్థితిలో ఉంది.

*పల్లవి :* **హైలెస్సా! హైలెస్సా!**<br>
**వేదము నే నని తెలుసా** **॥ హైలెస్సా ॥**

*అనుపల్లవి :* **ఎన్నో ఎన్నో చెప్పి ఊరిస్తా**<br>
**మరుక్షణమే బ్రతుకంతా మారుస్తా** **॥ హైలెస్సా ॥**

*చరణములు :* **(1) సంసార తిమిరాలు చీలుస్తా**<br>
**అజ్ఞాన జలములు పీలుస్తా**<br>
**రాగద్వేషాలు రాల్చేస్తా**<br>
**శాంతి ప్రేమలు నింపేస్తా** **॥ హైలెస్సా ॥**

**(2) స్వర్గం నీకు చూపిస్తా**<br>
**మోక్షం నీకు అందిస్తా**<br>
**అంద మంతా చిందిస్తా**<br>
**ఆనందం నీవే అనిపిస్తా** **॥ హైలెస్సా ॥**





అని వేద విజ్ఞాన నౌకలో మనలను కూర్చో పెట్టి, వేద నాదాన్ని వినిపిస్తూ శాంతి విహార యానం చేయించింది చైతన్య గీతిక.

**వేదాంత కర్త**

వేదాంతము అంటే ఉపనిషత్తులు. ఉపనిషత్తుల లోని ఆత్మజ్ఞానమే వేదాంత జ్ఞానము. జ్ఞానము ఏదైనా బోధ ద్వారానే అందుతుంది. ఈ విషయంలో వేదాంతము విలక్షణంగా లేదు. జ్ఞానము కలిగిన వ్యక్తి తన జ్ఞానమును తాను అందించి నపుడే మరొకరికి అది అందుతుంది. జ్ఞానము అంటే బోధ. బోధను అందించా లంటే బోధనా విధి కూడా తెలిసి ఉండాలి. ఈ విషయాన్ని ఇప్పటికే మనం విస్తరించి చెప్పుకున్నాం. బోధ ఎంత ప్రధానమో బోధనా విధి కూడా అంత ప్రధానము. విధానము తెలిసి బోధించి నపుడే బోధ శ్రోతకు అందు తుంది. వేదాంతము విషయంలో దీనినే సంప్రదాయము అంటారు.

అదలా ఉంచితే, ఇక్కడ వేద్యమైన పరమాత్మను వేదాంత కర్తగా కూడా అభివర్ణిస్తున్నాడు ***( వేదాంత కృత్)***. వేదాంతము అంటే జ్ఞాన మని చెప్పుకున్నాం. జ్ఞానము సృష్టింప బడేది కాదు. పరమాత్మ విశ్వాన్ని సృష్టించి నట్లు జ్ఞానాన్ని సృష్టించాడా? లేదు. ఆయనే జ్ఞాన స్వరూపుడు. మరి, అటువంటి పరమాత్మను 'వేదాంత కర్త' అనడంలో అర్థ మేమిటి?

***వేదాంత కృత్, వేదాన్తార్థ సంప్రదాయ కృత్ ఇత్యర్థః -*** వేదాంత కర్త అంటే, వేదాంతార్థ సంప్రదాయాన్ని నడిపించడములో కర్త అని భావము. సంప్రదాయ రక్షకుడు అని అర్థము.

మరి, సంప్రదాయ కర్తలు ఋషులు అని తెలుసుకొని ఉన్నాం. అందుచేతనే కదా బోధను ప్రారంభించే ముందు సంప్రదాయ కర్తలైన ఋషులను *బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో* అంటూ స్మరించు కుంటున్నాము. ఋషులు సంప్రదాయ కర్త లైనపుడు ***( ఋషిభిః సంప్రదాయ కర్తారః )***, భగవంతుని సంప్రదాయ కర్తగా చెబుతూ ***వేదాంతకృత్*** శబ్దానికి అర్థం చెప్పడం పొసగుతుందా?

సంప్రదాయ కర్తలు జ్ఞాను లైన ఋషులే అనడంలో ఎటువంటి సందేహము లేదు. కాకపోతే, పరమేశ్వరుని అనుగ్రహం చేతనే ఋషులకు సంప్రదాయ స్పృహ కలుగుతుంది కనుక భగవంతుని ***వేదాంత సంప్రదాయ కృత్*** అనడం జరిగింది. ఈశ్వర కృప చేతనే ఋషులు వేదాంత ఉపదేశ కర్త లయ్యారు ***(వేదాంత ఉపదేశ కృత్)***. పైగా తనకు, జ్ఞానికి తేడా లేదని, జ్ఞాని తన ఆత్మే నని గీతాచార్యుడే బోధించాడు కదా! *(7 వ అ - 18వ శ్లో)*.

**వేద విదుడు**

వేదవిదుడు అంటే వేదము తెలిసిన వాడు. అంతే కాదు వేదార్థమును తెలిసిన వాడు ***( వేదవిత్ వేదార్థ విదేవ చాహమ్ )***. వేదమును, వేదార్థమును తెలిసిన వారు ఎందరైనా ఉండొచ్చు. కాని, వేదమును, వేదార్థ మును యథావిధిగా, సంపూర్ణంగా, స్పష్టంగా, నిస్సంశయంగా తెలిసిన వాడు భగవాను డొక్కడే ***( యథావత్ వేదం వేదార్థం వేత్తి ఇతి వేదవిత్ )***.

వేద సారాన్ని, వేదాంత సారాన్ని విచారించి అమృతమయ మైన గీతా జ్ఞానమును అందించడం చేత కూడా ఆయన వేదవిదుడు. ***వేదాన్ విన్తే - విచారయతి ఇతి వేదవిత్ -*** వేద విచారము చేసి సార భూతంగా భగవద్గీతను ప్రసాదించిన వాడు కావడం చేత కూడా భగవానుడు వేదవిదుడు.

చివరగా, సంక్షేప విభూతుల లోని ఈ చివరి శ్లోకంలో **ఊర్ధ్వమూలం** అనే అధ్యాయారంభ శ్లోక తత్త్వార్థం సంపూర్ణంగా ఆవిష్కరించ బడింది. శ్లోక పూర్వార్ధం 'త్వం' పద నిర్దేశం కాగా, శ్లోకం యొక్క ఉత్తరార్ధం 'తత్' పద నిర్దేశమై, అఖండార్థ బోధ సఫల మైంది. ఆత్మయే బ్రహ్మము ***( అయమాత్మా బ్రహ్మ )*** అనే వాక్యము

అనుభూత మైంది. సర్వ ప్రాణుల హృదయాలలో ఆత్మరూపంగా తానున్నా నని ప్రకటించుకొనిన పరమాత్మ, సర్వభూతాల హృదయాలలో ఈశ్వర స్వరూపంగా తానే ఉన్నట్లు మళ్ళీ పద్దెనిమిదవ అధ్యాయం అరవై ఒకటవ శ్లోకంలో ప్రకటించి జీవేశ్వరుల మధ్య అభేదాన్ని, అఖండత్వాన్ని స్పష్టం చేస్తాడు.

*భగవంతుడైన ఈశ్వరుని యొక్క విశిష్టమైన ఉపాధుల ననుసరించి విభూతుల సంక్షేపాన్ని గడచిన నాలుగు శ్లోకాలలో బోధించిన గీతాచార్యుడు, ఇప్పుడు క్షరాక్షర ఉపాధుల నుండి వేరు చేయడం ద్వారా, నిరుపాధిక మైన శుద్ధ బ్రహ్మమును నిర్ధారణ చేయాలనే అభిప్రాయంతో తరువాత మూడు శ్లోకాలను చెబుతున్నాడు.*

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16

***ద్వౌ-ఇమౌ-పురుషౌ-లోకే-క్షరః-చ-అక్షరః-ఏవ-చ***
***క్షరః-సర్వాణి-భూతాని-కూటస్థః-అక్షరః-ఉచ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోకే | = | లోకము నందు | సర్వాణి | = | సమస్తమైన |
| క్షరః చ | = | క్షరుడు | భూతాని | = | భూతములు |
| అక్షరః ఏవ చ | = | అక్షరుడు | క్షరః | = | క్షర మనియు |
| ఇమౌ | = | ఈ | అక్షరః | = | అక్షరుడగు పురుషుడు |
| ద్వౌ | = | ఇద్దరు | కూటస్థః | = | కూటస్థుడని |
| పురుషౌ | = | పురుషులు | ఉచ్యతే | = | చెప్పబడ్డాడు |

**లోకంలో పురుషులు ఇద్దరే ఉన్నారు. ఒకడు క్షర పురుషుడు. మరొకడు అక్షర పురుషుడు. సర్వ భూతములు క్షరములు. కూటస్థుడు అక్షర స్వరూపుడు.**

### వ్యాఖ్య

లోకంలో, అంటే సంసారంలో సోపాధిక చైతన్యము ఇద్దరు పురుషులుగా చెప్పబడుతూ ఉంది. ఒకడు క్షర పురుషుడు. మరొకడు అక్షర పురుషుడు. కార్యోపాధి కల వాడు క్షర పురుషుడు. కారణోపాధి కల వాడు అక్షర పురుషుడు.

క్షరము అంటే నశించేది కనుక, నశించే కార్యోపాధి కల వాడు క్షర పురుషుడు ***( క్షరః క్షరతీతి క్షరః వినాశీ).*** అక్షర పురుషుడు అంటే దానికి భిన్నమైన వాడు. కారణోపాధి కల వాడు. కాల ప్రవాహంలో నశించని ఉపాధి కారణో పాధి. అదే భగవంతుని ఆశ్రయించుకొని ఉన్న మాయా శక్తి. త్రిగుణ మిళిత మైంది ***( అక్షరః తద్విపరీతః భగవతః మాయా శక్తిః ).***

క్షరోపాధి గల కార్య పురుషునికి ఉత్పత్తి స్థానం కావడం చేత, అక్షరోపాధి గల కారణ పురుషుడు, లేదా మాయాశక్తి సంసారానికి బీజ భూత మైంది. క్షరోపాధి గల పురుషునికి ఉత్పత్తి బీజము. సంసారులైన ప్రాణుల కామ కర్మాది సంస్కారాలకు అక్షర పురుషుడే ఆశ్రయ స్థానము.

### క్షర పురుషుడు

క్షరము అంటే నశించేది. ఒక కాలంలో కనిపించి మరొక కాలంలో కనుమరు గయ్యేది. వికారయుతమైంది.





కనుక సకల భూతాలు, సర్వ కార్యాలు, ఇవన్నీ నడవటానికి ఆశ్రయమైన దృశ్యమాన జగత్తు - అంతా క్షరమే కనుక అది క్షర పురుషుడు. కార్యోపాధి గల వాడు. అంటే కార్య రూప ప్రపంచంగా గోచరించే వాడు **(క్షరః సర్వాణి భూతాని సమస్తం వికార జాతమ్ ఇత్యర్థః ).** ఆద్యంతాలు కలిగి కార్య రూపంలో గోచరిస్తూ, వికారాన్ని పొందుతూ, వినాశ మయ్యే సర్వభూత శరీరాలు క్షర పురుషుని క్రిందికే వస్తాయి.

### అక్షర పురుషుడు

అనేక నామ రూపాలతో, అనేక విధాలుగా ఏదైతే కార్య రూపంలో గోచరిస్తూ ఉందో అట్టి వ్యక్త రూప ప్రపంచము క్షరము. వ్యక్త మయ్యే ఈ కార్య రూప జగత్తుకు కారణమై, ఏదైతే అవ్యక్తంగా ఉందో, అంటే వ్యక్తం కాకుండా ఉందో అదే అక్షరము. అవ్యక్తంగా ఉంటూ జగత్కార్యానికి కారణమైన మాయా శక్తియే అక్షరము. మార్పు లేనిది. కూటస్థము.

కూటస్థము అనే పదాన్ని ఇక్కడ జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అక్షర పురుషుడు కూటస్థుడు అని చెప్ప బడ్డాడు ***( కూటస్థః అక్షర ఉచ్యతే ).***

పరబ్రహ్మమును 'కూటస్థం' అని, 'అక్షరం' అని ఇదివరకే మనం చెప్పుకొని ఉన్నాం *(12 వ అ - 3 వ శ్లో).* ఇక్కడ మళ్ళీ మాయను 'కూటస్థం', 'అక్షరం' అని చెప్పుకుంటున్నాం. ఈ తేడాను స్పష్టంగా గ్రహించాలి.

పరబ్రహ్మము సర్వాధారమై, సర్వ వికారాలకు ఆశ్రయమై, తాను స్వరూపతః అవికార్యమై ఉండటం చేత కూటస్థం అని చెప్పబడ్డాడు ***( కూటస్థః కూట రూపేణ తిష్ఠతి ఇతి ).*** దాగలి వలె కూటస్థుడు అని కూడా చెప్పుకున్నాం. కాని, ప్రస్తుతం 'అక్షరము', 'కూటస్థము' అనే పదాలకు బ్రహ్మము అనే అర్థాన్ని గ్రహించ డానికి వీలు లేదు.

కార్యమైన జగ ద్రూపంలో గోచరించే క్షర పురుషుడు కాల ప్రవాహంలో కరిగి పోతాడు. వ్యక్త మయ్యే కార్య రూప క్షర పురుషునికి కారణమై, అవ్యక్తంగా ఉండే మాయ ఇక్కడ అక్షరంగా, కూటస్థంగా చెప్ప బడింది.

'అక్షరము' అంటే పరబ్రహ్మము లాగా అవినాశి అని అర్థం కాదు. క్షరము లాగా కాలంలో నశించకుండా అవ్యక్తంగా ఉండి పునః సృష్టికి కారణ మవుతూ ఉంది అని అర్థము. ప్రళయ కాలంలో క్షర పురుషుడు నశించినా, అవ్యక్త మైన మాయ నశించకుండా ఉండి పునః జగత్కార్యానికి కారణం కావడం చేత అది సాపేక్షికంగా అక్షరమే గాని, పారమార్థికంగా అక్షర మైన బ్రహ్మము కాదు. జ్ఞానోదయంలో నశించే మాయ జ్ఞాన స్వరూపు డైన పరబ్రహ్మము లాగా అక్షర మెలా అవుతుంది?

అక్షర మెలాగో కూటస్థమూ అంతే. కూట మంటే మాయ అని, మోస మని, వక్ర మని, కుటిలత్వ మని కూడా అర్థా లున్నాయి ***( కూటః మాయా వంచనా జిహ్మతా కుటిలతా ఇతి పర్యాయాః ).*** మాయలో ఇవన్నీ ఉంటాయి. కనుక 'అక్షరము', 'కూటస్థము' అనే శబ్దాలు పరబ్రహ్మమును సూచించేవే అయినా, ఇక్కడ వాటిని మాయకు అన్వయించు కోవాలి.

ఉపాధులు క్షరమైనా, అక్షర మైనా అవి పరబ్రహ్మమునకు అన్యంగా ఉండ లేవు. క్షరాక్షరాలు రెండూ పరమాత్మకు ఉపాధులే కనుక, ఉపాధులను తొలగిస్తే, కేవలం శుద్ధ చైతన్యమే అద్వయంగా శోభిస్తుంది. **తద్ధామ పరమం మమ** అని ఆరవ శ్లోకంలో భగవంతుడు తెలిపింది ఇదే. ***నేతి నేతి : న హ్యస్మా త్పర మస్తి*** - ఇది కాదు, ఇది కాదు అని అన్నిటిని నిషేధిస్తూ, దాని కంటే పర మైనది లేదు అని ఉపనిషత్తు దేని నైతే ప్రతిపాదించిందో, అదే క్షరాక్షరాలకు విలక్షణ మైన పరమాత్మ తత్త్వము. అదే పురుషోత్తమ తత్త్వము.

*దానినే తరువాత శ్లోకంలో ప్రతిపాదిస్తున్నాడు.*

**ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।**
**యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః ॥** 17

***ఉత్తమః-పురుషః-తు-అన్యః-పరమాత్మా-ఇతి-ఉదాహృతః***
***యః-లోకత్రయం-ఆవిశ్య-బిభర్తి-అవ్యయః-ఈశ్వరః***

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | అన్యః తు | = అన్యుడైన |
| అవ్యయః | = అవినాశియు | పురుషః | = పురుషుడు |
| ఈశ్వరః | = ఈశ్వరుడు | ఉత్తమః | = ఉత్తముడు |
| లోకత్రయం | = మూడు లోకములను | పరమాత్మా ఇతి | = పరమాత్మ యని |
| ఆవిశ్య | = ప్రవేశించి | ఉదాహృతః | = చెప్పబడ్డాడు |
| బిభర్తి | = భరిస్తున్నాడో | | |

**అర్జునా! నాశము లేని వాడు, ఈశ్వరుడు, ముల్లోకాలలో ప్రవేశించి భరించు ఉత్తమ పురుషుడే పురుషోత్తముడు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో మనం చూచిన క్షర అక్షర పురుషుల కంటే భిన్నమైన లక్షణాలు, భిన్నమైన స్వభావం గల ఉత్తము డైన పురుషుని ఈ శ్లోకంలో ప్రవేశ పెడుతున్నాడు. ఇతడు క్షరాక్షరముల కంటే విలక్షణ మైన వాడు ***(క్షరాక్షరాభ్యాం విలక్షణః)***. క్షర, అక్షర ఉపాధుల దోషాల చేత అంటబడని వాడు ***(క్షరాక్షరోపాధి ద్వయ దోషేణ అస్పృష్టః)***. స్వతంత్రమైన వాడు. ఉపాధుల కన్నా పరముడు కావడం చేత ఉత్తమ పురుషుడు పరమాత్మ అయ్యాడు.

కార్యోపాధికి అంటని వాడు కనుక పరమాత్మ అసంగుడు. కారణోపాధిని నియమించే వాడు కనుక నియామకుడు. అసంగుడు, నియామకుడై నందున కార్యకారణో పాధులకు విలక్షణుడై ఉత్తమ పురుషు డయ్యాడు. పరమాత్మ నామధేయు డయ్యాడు ***(పరమాత్మ ఇతి ఉదాహృతః)***.

ఆత్మ శబ్దానికి అనేక అర్థా లున్నాయి. దేహమును ఆత్మ అంటారు. ఇంద్రియాలను ఆత్మ అంటారు. మనస్సును ఆత్మ అంటారు. ఇవన్నీ ఆత్మ శబ్దం తోనే వినిపిస్తాయి. ఈ ఆత్మ లన్నీ క్షర మైనవి. క్షర పురుష నకు సంబంధించినవి. పరిమిత మైనవి. పరిచ్ఛిన్న దోషముతో కూడినవి. వీటికి విలక్షణము, పరమైన ఆత్మయే పరమాత్మ ***(పరమశ్చ అసౌ ఆత్మా చేతి పరమాత్మా)***. అన్యములైన ఆత్మల కన్నా భిన్న మైనది ***(అన్యః అత్యంత విలక్షణః)***. అలాగే వాటి కన్నా ఉన్నత మైనది ***(ఉత్తమః ఉత్కృష్ట తమః)***.

కార్యమైన క్షర పురుషుని కంటే, కారణమైన అక్షర పురుషుని కంటే విలక్షణుడు కావడం చేత పరమాత్మ ***(కార్య కారణ విలక్షణః)*** ఉత్తమ పురుషుడు. క్షరాక్షరములు రెండూ పరమాత్మకు ఉపాధులే కనుక, వ్యక్త మైన కార్య రూప జగత్తును, అవ్యక్తమైన కారణ రూప మాయను - రెండిటినీ తానే భరిస్తున్నాడు. భరించడము అంటే, వాటికి సత్తా స్ఫూర్తి ప్రదాయకంగా ఉన్నాడని అర్థము. క్షరాక్షరాలకు పరమాత్మ వల్లనే సత్తా స్ఫురణలు కలుగు తున్నాయి అని భావము.

క్షరాక్షరాల స్వరూపమే జగత్త్రయము కనుక, పరమాత్మ ముల్లోకాలను సృష్టించి, తానే వాటిలో ప్రవేశించి,





వాటికి సత్తా స్ఫురణలను కలిగిస్తున్నాడు. ఈ విషయాన్ని శ్రుతి కూడా ధృవపరచింది. ***తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్*** - తానే సృష్టించి, తానే అందులో ప్రవేశించి, అంతటా తానే వ్యాపించి ***(ఆవిశ్య)***. లోకత్రయాన్ని ధరిస్తున్నాడు, లేదా నిలుపు తున్నాడు ***(బిభర్తి ధారయతి)***.

ఇక్కడ ధరిస్తున్నాడు అంటే, బరువును మోస్తున్నాడు అని అర్థం కాదు. గుడ్డ వంతా నూలు వ్యాపించి ఉన్నట్లు, తన శక్తి చేత సర్వత్ర విస్తరించి ఉన్నాడని అర్థము. మట్టిపాత్రలలో మట్టి వ్యాపించి ఉన్నట్లు, అంతటా వ్యాపించి ఉన్నాడని భావము. ఈ విధంగా విలక్షణుడు కావడం చేత ఉత్తమ పురుషుడైన పరమాత్మ అవ్యయుడు. అంటే వ్యయం లేని వాడు. నాశ మెరుగని వాడు. మార్పు అర్థం కాని వాడు ***(అవ్యయః న అస్య వ్యయః విద్యతే ఇతి అవ్యయః)***. తనకు మించిన వారు లేనందున తానే ఈశ్వరుడు. నియమించే శీలము కల వాడు. సర్వజ్ఞుడు ***(ఈశ్వరః సర్వజ్ఞః ఈశన శీలః)***.

*ఇంతవరకు ఈశ్వరుడుగా అభివర్ణింప బడిన వాడు పురుషోత్తముడే. ఆ పురుషోత్తముడు తానే అంటున్నాడు భగవంతుడు.*

**యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥** 18

***యస్మాత్-క్షరం-అతీతః-అహం-అక్షరాత్-అపి-చ-ఉత్తమః***
***అతః-అస్మి-లోకే-వేదే-చ-ప్రథితః-పురుషోత్తమః***

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | అతః | = ఆ కారణం చేతనే |
| యస్మాత్ | = ఏ కారణం చేత | లోకే | = లోకము నందు |
| క్షరం | = క్షరమునకు | వేదే చ | = వేదము నందు |
| అతీతః | = అతీతుడనో | పురుషోత్తమః | = పురుషోత్తముడని |
| అక్షరాత్ అపి చ | = అక్షరము కన్నను | ప్రథితః | = ప్రసిద్ధుడను |
| ఉత్తమః | = శ్రేష్ఠుడనో | అస్మి | = అయ్యాను |

**నేను క్షరమును, అక్షరమును రెండింటిని అతిక్రమించి ఉన్నాను. అందుచేత లోకము నందు, వేదము నందు పురుషోత్తముడుగా ప్రసిద్ధుణ్ణి.**

**వ్యాఖ్య**

***బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం*** అని పూర్వాధ్యాయం చివరి శ్లోకం లోను, ***తద్ధామ పరమం మమ*** అని ప్రస్తుత అధ్యాయం ఆరవ శ్లోకం లోను అభివర్ణించిన తన వైభవమును నిర్ధారించ డానికి తన పురుషోత్తమ తత్త్వమును తానే దర్శింప చేస్తున్నాడు,

అశ్వత్థ మనే పేరు గల సంసార మాయా వృక్షమైన క్షరమును అతిక్రమించి ఉండుట చేత, అలాగే ఈ సంసార వృక్షానికి బీజ భూతమైన ప్రకృతి, లేదా మాయ అనే అక్షరమును అధిగమించి ఉండటమే గాక, దాని కంటే కూడా ఉత్కృష్టమైన వాడు కావడం చేత భగవానుడు పురుషోత్తముడు ***(క్షరమ్ అతీతః అతిక్రాన్తః అక్షరా దపి ఉత్తమః)***.

దేహము క్షరము. దీనినే క్షేత్ర మని పదమూడవ అధ్యాయంలో చెప్పుకున్నాం. అలాగే క్షేత్రాన్ని పురం అని కూడా అర్థం చేసుకున్నాం. పురములో ఉండే వాడు పురుషుడు. పురమైన క్షేత్రము క్షరము కనుక నశిస్తుంది.

పురమును తెలుసుకొనే వాడు పురుషుడు లేదా క్షేత్రజ్ఞుడు. పురుషుడైన క్షేత్రజ్ఞుడు అక్షరము కనుక నశించడు. పురానికి పురుషుడు ఆధారంగా ఉన్నాడు. క్షరమైన పురమును, అక్షర మైన పురుషుని, ఇద్దరినీ ప్రకాశింప చేసే దివ్య చైతన్యం ఏదో అదే పురుషోత్తమ తత్త్వం. క్షరానికి, అక్షరానికి అతీత మైంది. అదే పురుషోత్తమ స్థితి. అదే సత్, చిత్, ఆనందంగా భాసిస్తూ ఉంది. అదే సర్వాధిష్ఠానంగా ప్రకాశిస్తూ ఉంది. ఏకమై, అద్వయమై, అఖండమై, అద్భుతంగా భాసించే దివ్య ప్రకాశైక చైతన్యం అదే.

***దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః।***
***అప్రాణో హ్యమనాః శుభ్రో హి అక్షరాత్ పరతః పరః॥***

'స్వప్రకాశు డైన పురుషుడు ఆకారం లేని వాడు. వెలుపల, లోపల నిండి యున్న వాడు. పుట్టుక లేని వాడు. ప్రాణము లేని వాడు. మనస్సు లేని వాడు. నిర్మలమైన వాడు. అక్షర స్వరూపమునకు అతీతుడు' అన్నది ముండకోపనిషత్తు *( 2 - 1 - 2 ).*

క్షరాక్షరముల కంటె ఉత్కృష్టమైన వాడు కావడం చేత ***( క్షరాక్షరాభ్యాం ఉత్తమత్వాత్ )*** లోకము లోను, వేదము నందును పరమాత్మ పురుషోత్తముడుగా ప్రసిద్ధుడు ***( లోకే వేదే చ ప్రథితః ప్రఖ్యాతః పురుషోత్తమః ).***

*ఈ విధంగా పురుషోత్తమ తత్త్వమును తెలుసుకొను వారికి ఫల మేమిటో చెబుతున్నాడు.*

**యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ॥** 19

***యః-మాం-ఏవం-అసమ్మూఢః-జానాతి-పురుషోత్తమం***
***స-సర్వవిత్-భజతి-మాం-సర్వభావేన-భారత***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | జానాతి | = | తెలుసుకుంటున్నాడో |
| యః | = | ఎవడు | సః | = | వాడు |
| అసమ్మూఢః | = | మోహము లేని వాడై | సర్వవిత్ | = | సర్వము తెలిసినవాడై |
| మాం | = | నన్ను | సర్వభావేన | = | సమస్త భావముల చేత |
| ఏవం | = | ఈ విధంగా | మాం | = | నన్ను |
| పురుషోత్తమం | = | పురుషోత్తముడ నైన నన్ను | భజతి | = | పొందుతాడు |

**అర్జునా! మోహము నుండి విడిపడిన వాడు, పురుషోత్తమ స్వరూపమును తెలుసుకున్న వాడు సర్వము తెలిసిన వాడు అవుతాడు. అతడు అన్ని విధాల నన్నే పొందుతాడు.**

**వ్యాఖ్య**

పురుషోత్తమ తత్త్వము అనే అఖండ జ్ఞానము యొక్క ఫలమును చెబుతున్నాడు. సర్వ వేద సారము, గీతా శాస్త్ర సారభూతము అయిన ఈ పదిహేనవ అధ్యాయమును అద్భుతంగా ప్రవచించిన భగవానుడు, అట్టి జ్ఞానము యొక్క ఫలమును విశదం చేస్తున్నాడు.

అర్జునా! పురుషోత్తముడ నైన నన్ను ఈ విధంగా *( ఏవం )* తెలుసుకున్న వాడు మోహము నుండి విడిపడు తున్నాడు. *ఏవం -* ఈ విధంగా, అంటే, ముందు చెప్పుకున్న విధంగా ***( ఏవం యథోక్తేన ప్రకారేణ )*** తెలుసుకున్న వాడు. అంటే కార్యోపాధిని పొంది నశించేది క్షర మని, కారణోపాధిని పొంది మార్పు చెందనిది





అక్షర మని, కార్యకారణా లైన క్షరాక్షరములకు అన్యము, అతీతము, ఉత్కృష్ట మైనది పురుషోత్తము డని ఎవడైతే తెలుసుకుంటాడో వాడు సర్వమును తెలుసుకున్న వాడు అవుతున్నాడు ***( సర్వవిత్ - సర్వం వేత్తీతి ).***

సర్వమును ఏమని తెలుసు కుంటాడు? సర్వము బ్రహ్మమే అని తెలుసుకుంటాడు. తనతో పాటు సమస్తమూ అద్వయ బ్రహ్మ స్వరూపమే అని తెలుసు కుంటాడు ***( ఇదం సర్వం యదయ మాత్మా -*** బృహదారణ్యక శ్రుతి *; 2 - 4 - 6 ).* సర్వమూ భగవంతుడే అనే సర్వాత్మ బుద్ధి కలిగి ఉంటాడు. అలాంటి వాడికి మోహం ఎలా ఉంటుంది? అందుకే అతడు అసమ్మూఢుడు ***( అసమ్మూఢః సంమోహ వర్జితః ).*** ఊర్ధ్వమూలంగా వర్ణింప బడిన పురుషోత్తముని తెలుసుకున్న వాడు సమస్తము తెలిసిన వాడు అవుతున్నాడు ***( సర్వం జానాతి ఇతి ).*** సర్వము తెలిసిన సర్వవిదుడు సర్వాత్మ స్వరూపుడైన పురుషోత్తముని యందే లగ్నమైన చిత్తముతో, ఆ సర్వాత్ముణ్ణే పొందుతాడు ***( భజతి మాం సర్వ భావేన సర్వాత్మ చిత్తతయా ).*** ఇదే సర్వాత్మ జ్ఞానఫలం. పురుషోత్తమ ప్రాప్తి ఫలం.

ఈ జ్ఞానము సుస్పష్ట మైంది. స్వచ్ఛ మైనది. ఈ జ్ఞానమును పొందిన వాడు నిత్యానంద స్వరూపుడు అవుతున్నాడు. అతడికి ప్రపంచం గోచరించినా అది విస్మృత ప్రాయము. కర్తృత్వము అర్థం కాని వాడు. భోక్తృత్వం పై ఆసక్తి లేని వాడు. గతం అతనిని కలత పెట్ట లేదు. భవిష్యత్తు అతనిలో ఆశలు రేప లేదు. వర్తమానం జ్ఞాన స్నానం చేస్తూ ఉంటుంది.

అతడు సముడు. అతనిలో అంతా సమత్వమే. అతడు సమదర్శి. రాగాలు వినిపించవు. ద్వేషాలు కనిపించవు. నిందలు బాధించవు. స్తుతులు తృప్తి నివ్వ లేవు. అతడు ఆకాశము వంటి వాడు. అతని లోపల, అతని చుట్టూ ఎన్ని కదలి పోతూ ఉన్నా తాను అస్పర్శుడై ఉంటాడు. అసంగుడై ఉంటాడు. మేలుకున్న వాడికి స్వప్న మెలా ఉంటుందో, జ్ఞానికి ప్రపంచం అలా ఉంటుంది. తాను అకర్త గానే చరిస్తాడు. అభోక్త గానే శోభిస్తాడు.

ఆలయంలో భగవంతు డున్నట్లు, జ్ఞాని హృదయాలయంలో పురుషోత్తముడు దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాడు. ఆత్మజ్ఞానికి జీవత్వం లేదు. అతడే దేవుడు. ఆ మహాత్ముని పొందిన పుణ్య దేహము కదిలే దేవాలయం.

అతనికి ఆత్మ తప్ప మరొకటి కనిపించదు. ఏది కనిపించినా అది ఆత్మ గానే దర్శన మిస్తుంది. అదొక మంగళకర మైన దృష్టి. ఆత్మదృష్టి. సర్వాత్మ దృష్టి. బ్రహ్మదృష్టి. బ్రహ్మాత్మ జ్ఞాన దృష్టి.

***బ్రహ్మ విజ్ఞాన సంపన్నః ప్రతీత మఖిలం జగత్।***
***పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్॥***

'బ్రహ్మజ్ఞాన సంపన్నుడు కనిపించే ప్రపంచమును చూస్తూ ఉండినా, దానిని ఆత్మ కంటే వేరుగా చూడడు' అన్నది వరాహోపనిషత్తు.

*ఇక చివరగా, శాస్త్ర స్తుతి చేస్తున్నాడు.*

**ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ ।**
**ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృతకృత్యశ్చ భారత ॥** 20

***ఇతి-గుహ్యతమం-శాస్త్రం-ఇదం-ఉక్తం-మయా-అనఘ***
***ఏతత్-బుద్ధ్వా-బుద్ధిమాన్-స్యాత్-కృతకృత్యః-చ-భారత***

అనఘ = పాపరహితుడా!
భారత = అర్జునా!
మయా = నా చేత
ఇదం = ఈ
గుహ్యతమం = అతి రహస్యమైన
శాస్త్రం = యోగశాస్త్రము
ఇతి = ఈ విధంగా

ఉక్తం = చెప్పబడినది
ఏతత్ = దీనిని
బుద్ధ్వా = తెలుసుకొని
బుద్ధిమాన్ = బుద్ధిమంతుడు
కృతకృత్యః చ = కృతకృత్యుడు
స్యాత్ = అవుతాడు

**అర్జునా! అతి రహస్య మైన శాస్త్రమును నీకు బోధించాను. దీనిని తెలుసుకున్న వాడు బుద్ధిమంతుడు అవుతాడు. కృతకృత్యుడు అవుతాడు.**

**వ్యాఖ్య**

## శాస్త్రం గుహ్యతమం

మోక్ష ఫలాన్ని అందించే పరమాత్మ జ్ఞానాన్ని పూర్వ శ్లోకంలో ప్రస్తావించిన భగవానుడు, ప్రస్తుత శ్లోకంలో అధ్యాయాన్ని ప్రశంసిస్తూ ఉపసంహరిస్తున్నాడు. సాధారణంగా భగవద్గీతను గీతా శాస్త్రం అంటాము. కాని, భగవంతుడు ఈ అధ్యాయాన్నే శాస్త్రముగా పేర్కొనడంలో అధ్యాయ ప్రశంసను చెప్పకనే చెప్పిన ట్లైంది. పరమేశ్వరుడు అర్జునునకు బోధించిన ఈ పురుషోత్తమ తత్త్వము గుహ్యతమము అంటున్నాడు ***(ఇదం ఉక్తం శాస్త్రం గుహ్యతమం)***. గుహ్యము అంటే రహస్యము. గుహ్యతమము అంటే అత్యంత రహస్య మని అర్థము. పరమాత్మకు సంబంధించిన జ్ఞానం కావడం చేత ఇది అతి రహస్య మైంది.

రహస్యము అంటే తెలియనిది అని అర్థము. తెలియనంత వరకే ఏదైనా రహస్యంగా ఉంటుంది. తెలియని దానిని తెలిపిన తరువాత ఇక రహస్య మంటూ ఉండదు. కాని, పరమాత్మ జ్ఞానము అలాంటిది కాదు. లౌకిక విద్యలు ఏవైనా చెబితే తెలుస్తాయి. వేదాంత విద్య చెప్పినా అర్థం కాదు. అర్థమైనట్లే ఉంటుంది. ఏమి అర్థమైంది? అని ప్రశ్నించుకుంటే అర్థం కాలేదనే సమాధానం వస్తుంది. అందుకే అది గుహ్యతమము. పరమాత్మే గుహ్య మైన వాడు. ఆయనకు సంబంధించిన జ్ఞానం కావడం చేత బ్రహ్మవిద్య గుహ్యతమ మైంది.

ఇంతకీ పరమాత్మ స్థావర మెక్కడ? పోనీ, ఉపలబ్ధి స్థానం ఏది? హృదయమే కదా! నేను ప్రాణు లందరి హృదయాలలో ఉన్నాను అని ఈ అధ్యాయంలో భగవంతుడే స్వయంగా చెప్పాడు కదా! మరి, హృదయం లోనే ఉన్నవాడు ఎంత పిలిచినా పలకడు. ఎంత నిరీక్షించినా కనిపించడు. తెలుసుకుందా మంటే అర్థం కాడు. అలాంటి వానిని ఏమనాలి? గుహ్యమైన వాడు అనాలి. వ్యాసుడు అలాగే అన్నాడు. భీష్మాచార్యుల వారి చేత అనిపించాడు ***గుహ్యః*** అని. గుహలో దాగినట్లు హృదయ గుహలో రహస్యంగా ఉన్నందున పరమాత్మను 'గుహ్యుడు' అని అనవలసి వచ్చింది. తానే గుహ్యుడు కావడం చేత తనకు సంబంధించిన జ్ఞానము గుహ్యతమ మైంది. రహస్యంగా ఉండే వాడికి సంబంధించిన జ్ఞానము అత్యంత రహస్య మైంది ***(తత్ గుహ్యతమం గోప్య తమమ్ అత్యన్త రహస్యమ్)***.

వేదాంత జ్ఞానము, అంటే ఉపనిషత్తుల లోని జ్ఞానము అతి రహస్య మైనది. గహన మైనది కనుక రహస్యము. ఉత్కృష్ట మైనది కావడం చేత రహస్యము. గుహ్యమైన, అంటే రహస్యమైన ఉపనిష ద్విజ్ఞానము చేత పొందబడే వాడు కనుక భగవానుడు గుహ్యుడు ***(గుహ్యః రహస్యోపనిషత్ వేద్యత్వాత్ గుహాయాం హృదయా కాశే నిహిత ఇతి వా గుహ్యః)***.





**ఎవరు నీవు ? ఎవ్వరూ ఎరుగ లేరు**
**ఎరిగిన వారు తిరిగి ఎరుక పరచ లేరు**
**ఎదను చేరి సొదలన్నీ విందువయ్యా!**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా !**

అని గోవిందుని గుట్టు విప్పింది చిన్నికృష్ణ శతకము.

గుండె లోనే ఉన్నా గుర్తు తెలియక పోవడము ఒక రహస్య మైతే, అత డెవరో కాదు, నీవే అని ఎంత మొత్తుకున్నా అర్థం కాక పోవడము మరొక రహస్యం. స్వప్రయత్నంతో యత్నించినా, పరుల సహకారంతో ప్రయత్నించినా రహస్యం రహస్యం గానే ఉంటూ ఉంది. అందుచేత ***శ్రుతి రేవ శరణ మితి*** - వేదమే శరణ్యము, వేదాంతమే శరణ్యము అని శాస్త్రాన్ని ఆశ్రయించ వలసి వస్తోంది. శాస్త్రాన్ని గురుముఖతః అధ్యయనం చేసినా రహస్యం అలాగే ఉంది. అందుకే గుహ్యమైన పరమాత్మకు సంబంధించిన శాస్త్రము గుహ్యతమమై కూర్చుంది. అట్టి గుహ్యతమ మైన శాస్త్రాన్ని భగవంతుడు అర్జునునికి బోధించాడు.

రహస్యమై, దుర్విజ్ఞేయమై ఉండటం చేత 'గుహ్యతమం' అనే మాటను చర్విత చర్వణంగా పరమేశ్వరుడు గీతలో వినిపించాడు. గీత పూర్వార్ధము సమాప్త మయ్యే తొమ్మిదవ అధ్యాయం మొదటి శ్లోకం లోను, గీతను సమాప్తం చేస్తూ పద్దెనిమిదవ అధ్యాయం అరవై నాల్గవ శ్లోకం లోను గుహ్యతమం అని చెప్పడమే గాక, మధ్యలో గీతా హృదయంగా భాసిస్తున్న పదిహేనవ అధ్యాయాన్ని సమాప్తం చేస్తూ కూడా అదే మాటను వినిపించాడు. శాస్త్రం ఎంత గుహ్యతమమో దీనిని బట్టి అర్థం చేసుకోవచ్చు.

మనం ముందు గానే అధ్యాయ పీఠికలో చెప్పు కున్నట్లు, 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అనే ఈ అధ్యాయములో సమస్త గీతా శాస్త్ర సారమే గాక సమస్త వేదార్థము కూడా సమాప్త మైంది అని శ్రీ శంకరాచార్య స్వామి అభిప్రాయ పడ్డారు ***(సర్వో హి గీతా శాస్త్రార్థః అస్మిన్ అధ్యాయే సమాసేన ఉక్తః, న కేవలం గీతా శాస్త్రార్థ ఏవ, కిం తు సర్వశ్చ వేదార్థః ఇహ పరి సమాప్తః)***. మొదటి శ్లోకం, పదిహేనవ శ్లోకం, పద్దెనిమిదవ శ్లోకం ఈ అధ్యాయము వేదార్థ మనే విషయానికి అద్దం పడుతున్నాయి. అధ్యాయాంత శ్లోకమైన ప్రస్తుత శ్లోకం ***ఇతి*** అంటూ ప్రారంభమై అధ్యాయమును సమాప్తం చేయడము, సంప్రదాయానుసారం శాస్త్ర పరి సమాప్తిని సూచిస్తూ ఉంది. ఇటువంటి అద్భుతమైన, రహస్యమైన విషయాన్ని అర్జునునికి బోధించినట్లు భగవంతుడే స్వయంగా చెబుతున్నాడు. ఈ సందర్భంలో అర్జునుని ***అనఘ!*** అని, ***భారత!*** అని సంబోధించడం ముఖ్యంగా గమనించ దగిన విషయం.

అఘము అంటే పాపము. పాప రహితుడు కావడం చేత అర్జునుణ్ణి భగవంతుడు అనఘ! అని సంబోధించాడు. అర్జునుని జీవితంలో అకారాది క్షకారాంతం వరకు కాగడా పెట్టి వెతికినా పాపపు ఛాయలు కనిపించవు. అందుకే, అర్జునుడు అనఘుడు ***(అనఘ! అపాప!)***. అర్జునుడు అనఘుడు కావచ్చు. కాని, ఈ సందర్భములో భగవానుడు అతనిని ఇలా సంబోధించడం ఎంతో భావగర్భితంగా ఉంది. సమస్త వేదాంత సారమైన పురుషోత్తమ తత్త్వాన్ని గ్రహించాలి అంటే, ఆ ప్రయత్నం చేసే వ్యక్తి పాప రహితుడై ఉండాలి అని సూచించడమే దీని అంతరార్థము. శుద్ధి పడిన బుద్ధి లోనే పవిత్రమైన పరమాత్మ జ్ఞానము నిలుస్తుంది.

'భా' అంటే ప్రకాశము ***(భా దీప్తౌ)***. 'రత' అంటే ఆసక్తి అని, రమించడ మని అర్థము. ప్రకాశవంత మైన జ్ఞానము నందు ఆసక్తి కల వాడు, పాప రహితుడై ఉండాలి ***(అనఘ!)***. 'అనఘ' అనే పదం జ్ఞానార్హతను, అధికారిత్వాన్ని సూచిస్తూ ఉంటే, జ్ఞానమును పొందిన తరువాత జ్ఞానద్యుతిలో రమించడము జరుగు తుందని 'భారత!' శబ్దము సూచిస్తూ ఉంది.

అంతే కాదు, అర్జునుడు భరత వంశోద్భవుడు. వ్యక్తిగతంగా చూస్తే పాపరహితుడు. వంశ గతంగా, కుటుంబ నేపథ్యాన్ని చూచినా, ప్రకాశవంత మైన వాడు. కనుకనే పరమాత్మ నుండి పవిత్రమైన జ్ఞానాన్ని ఆలకించాడు. పైగా అనన్య సామాన్యంగా, అనితర సాధ్యంగా సాక్షాత్తు పరమాత్మ నుండే 'అనఘ!' అనే బిరుదును పొంది జన్మను సార్థకం చేసుకున్నాడు.

## శ్రవణ ఫలం

పరమేశ్వరుడు బోధించిన గుహ్యమైన పురుషోత్తమ తత్త్వమును ***( ఏతత్ శాస్త్రం యథా దర్శితార్థం )*** యథాతథంగా తెలుసుకున్న వాడు ***( బుద్ధ్వా )*** బుద్ధిమంతుడు అవుతాడు ***( స బుద్ధిమాన్ స్యాత్ ).***

జ్ఞానమును పొందిన తరువాత బుద్ధిమంతుడు కావడ మేమిటి? బుద్ధి తోనే కదా జ్ఞానమును సముపార్జిస్తారు? అనే సంశయము కలగ వచ్చు. ఇక్కడ బుద్ధిమంతుడు అంటే వివేకం కల వాడు అని అర్థము. జ్ఞానము కల వాడు అని భావము.

బుద్ధి అందరికీ ఉంటుంది. బుద్ధి ఉన్న వాళ్ళందరూ బుద్ధిమంతులు కారు. ఎవరి బుద్ధిలో వివేకం ఉంటుందో, ఎవరి బుద్ధి జ్ఞాన పూరితమై ఉంటుందో వారే బుద్ధిమంతులు.

'నీకు బుద్ధి లేదు' అని ఒకరు మరొకర్ని తిడుతూ ఉండటం అనేక సార్లు మనం విని ఉంటాము. దాని అర్థ మేమిటి? వాస్తవంగా అతను బుద్ధి లేని వాడే అయితే, ఈ నిందా వాక్యం అర్థం కావలసింది ఎవరికి? బుద్ధి లేని చెట్టుకో, గోడకో, పిల్లికో, నల్లికో అర్థం కాదు కదా! అతనికి బుద్ధి లేదు అనేదే గనుక దూషించే వ్యక్తి యొక్క అభిప్రాయ మైతే, అసలు బుద్ధి లేని దెవరికి? అని విన్న వాళ్ళం మీమాంసలో పడ వలసి వస్తుంది.

బుద్ధి లేని వ్యక్తినే నిందించాడు అనుకుందాం. బుద్ధి లేదు అని అంటే అసలే బుద్ధి లేదని కాదు. పని చేయని బుద్ధి ఉందని అర్థము. పని చేయనిది ఉన్నా, లేకపోయినా పెద్ద తేడా ఉండదు.

శాస్త్రాన్ని బుద్ధిమంతులే వింటారు. అది కూడా శుద్ధ బుద్ధి కల వారే వింటారు. శుద్ధ బుద్ధి కల వారే శాస్త్రాన్ని అర్థం చేసుకో గలుగుతారు. బుద్ధి కలిగి శాస్త్ర హృదయాన్ని అర్థం చేసుకున్న వారు బుద్ధిమంతులు అవుతారు. అంటే జ్ఞానవంతులు అవుతారు ***(బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ భవేత్!).*** పరమేశ్వరుడు జ్ఞాన స్వరూపుడు. అట్టి మహాద్భుత శక్తిని జ్ఞానం ద్వారా పొంద వలసిందే గాని మరో మార్గం లేదు ***(న అన్యథా).***

క్షర పురుషుడుగా కార్య రూప జగత్తులో సర్వత్ర తానే వ్యాపించి ఉన్నాడు (కుండలో మట్టి లాగా). అక్షర పురుషుడుగా కారణ రూప అవ్యక్తానికి, లేదా మాయకు కూడా తానే ఆశ్రయమై ఉన్నాడు. ఇలా కార్య కారణా లలో ఉన్న పరమేశ్వరుడు, ఆ రెండిటికి విలక్షణంగా తన మహిమలో ***( స్వే మహిమ్ని )*** పురుషోత్తముడుగా విరాజిల్లు తున్నాడు. అలాంటి వానిని ఎలా అర్థం చేసుకోవాలి? అర్థం చేసుకోవాలి అంటే ఎలాంటి బుద్ధి ఉండాలి?

ఉన్న దంతా పురుషోత్తమ తత్త్వమే అయినపుడు, అది సిద్ధించే ఉంది కదా! అది లేని దెప్పుడు? లేని దెక్కడ? మరి అంతట ఉన్న అద్వయ సత్తా స్వరూపాన్ని ఎలా పొందగలం? సాధ్య వస్తువును పొందగలం గాని సిద్ధ వస్తువును ఎలా పొందాలి? దానిని ఎలా చేరాలి అంటే ఏం చెప్పగలం? జ్ఞానం ద్వారానే పొందాలి. జ్ఞానం తోనే చేరాలి ***( జ్ఞానే నైవ గమ్యతే ).*** ఉండి తెలియక పోవడం అజ్ఞానం కనుక, అజ్ఞానము జ్ఞానము ద్వారానే తొలగించ బడాలి. మరో మార్గం లేదు.

పరమేశ్వరుని ఎవ్వరైనా అలాగే పొందాలి. ఎవరి కైనా భగవంతుడు హృదయస్థుడు గానే అర్థం కావాలి.





తన ఆత్మ స్వరూపం గానే తెలియాలి. కనుకనే, ***సర్వస్య చాహం హృది సన్నివిష్టః-*** నేను అందరి హృదయాలలో ఉన్నాను అన్నాడు భగవంతుడు ( *15 వ శ్లో*). కొందరి హృదయాల లోనే ఉన్నాను అని చెప్ప లేదు. కనుక, పరమేశ్వర దర్శనాన్ని అభిలషించే వారు, పురుషోత్తమ ప్రాప్తిని పొందగోరే వారు బాహ్యంలో అన్వేషించి పరమాత్మను పొంద లేరు. అంతరంగమున అవలోకించి మాత్రమే పొందగలరు.

## ఆఖ్యాయిక

హిరణ్యకశిపుని ఉగ్ర తపస్సును మెచ్చిన బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై, కోరిన వరాలను అనుగ్రహించిన తరువాత, నాయనా! హిరణ్యకశిపూ! నీవు కోరిన వరాలు సామాన్య మైనవి కావు. గతంలో ఎవ్వరూ ఇలా కోర లేదు. అయినా నిన్ను కరుణించి అనుగ్రహించాను.

***నన్నుం గోరిన వెల్ల నిచ్చితి బ్రవీణత్వంబుతో బుద్ధి సం***
***పన్నత్వంబున నుండు మీ సుమతి వై భద్రైక శీలుండవై !***

'బుద్ధితో ప్రవర్తించు. నేర్పుతో జీవించు. బుద్ధిమంతుడవై, మంగళ స్వభావంతో మసలుకో!' అని పలికి అరవింద సంభవుడు అంతర్హితు డయ్యాడు.

చెప్పిన హిత మంతా ఎటు పోయిందో! మరు క్షణమే సుర లోకంపై దండెత్తాడు హిరణ్యకశిపుడు. సురులను జయించాడు. యక్ష, కిన్నర, గంధర్వ, కింపురుషాదులను ఓడించి ఊర్ధ్వ లోకాలను స్వాధీనం చేసుకుంటూ వచ్చి, చివరగా శత్రువైన శ్రీహరిని జయించాలని వైకుంఠం వైపు తిరిగాడు.

మార్గ మధ్యంలో వైకుంఠం నుండి తిరిగి వస్తున్న నారద మహర్షి ద్వారా విష్ణువు వైకుంఠం లోనే ఉన్నాడని తెలుసుకొని పరమోత్సాహంతో ఆ వైపుకు దూసు కెళ్ళాడు. నారద మహర్షి కూడా వెనుదిరిగి హిరణ్యకశిపుని అనుసరించాడు. తీరా అక్కడి కెళ్ళి చూస్తే విష్ణుమూర్తే కాదు, ఆదిశేషుడు కూడా లేడు. ఇక, అమ్మవారు ఎక్క డుంటుంది?

నారదా! ఎక్కడ నీ హరి? అని నారదుని వైపు కళ్ళెర్ర జేసి చూశాడు హిరణ్యకశిపుడు. అయ్యా! నేను ఇక్కడే చూశాను. ఈ లోగా ఏమయ్యాడో? అని బిక్క మొగం వేశాడు నారదుడు.

చూస్తాను. ఈ చతుర్దశ భువనాలలో నన్ను ఎలా తప్పించు కుంటాడో చూస్తాను అంటూ విష్ణుదేవుని కొరకు భువనా లన్నీ గాలిస్తున్నాడు కశ్యపాత్మజుడు.

ఒక వైపు హిరణ్యకశిపుడు క్రోధంతో అన్వేషిస్తూ ఉంటే, మరో వైపు నారదుడు భక్తితో అన్వేషిస్తున్నాడు. అటు హిరణ్యకశిపునికి విష్ణువు కనిపించ లేదు. ఇటు నారద మహర్షికీ విష్ణుదర్శనం కాలేదు. విసిగి వేసారిన దితి నందనుడు రాక్షస లోకాని కెళ్ళాడు.

నారద మహర్షి పరిస్థితే అగమ్య గోచరంగా ఉంది. అచ్యుతుని కోసం వెతికి వెతికి నారదుడు కూడా అలసి పోయాడు. చివరగా, ఎందుకైనా మంచిది. మళ్ళీ ఒకసారి వైకుంఠానికే వెళ్ళి చూద్దా మని మహర్షి మాధవ సన్నిధానానికి పయన మయ్యాడు. తీరా వెళ్ళి చూస్తే **సిద్ధము సుమతీ** - విష్ణు భగవానుడు సతీ సపరివార సమేతంగా శేషతల్పం మీద పవ్వళించి ఉన్నాడు. మహర్షికి నోట మాట రాలేదు. 'నారదా! అదేమిటి? అదోలా ఉన్నావు? ఏం జరిగింది? అని అమాయకంగా ప్రశ్నించాడు జగన్నాటక సూత్రధారి.

అయ్యా! మహానుభావా! నా విషయం అలా ఉంచండి. తమరు ఇంతకాలం ఎక్క డున్నట్లు? తమరి మకాం ఎక్కడో అర్థం గాక నేను తిరగని చోటు లేదు అన్నాడు నారద మహర్షి.

అదేమిటి? నువ్వు ఒక్కడివే తిరిగినట్లు మాట్లాడుతున్నావు? హిరణ్యకశిపుడు కూడా నీ కన్నా ఎక్కువ గానే తిరిగాడు కదా! అన్నాడు విష్ణుమూర్తి.

నారదా! నేను ఎక్కడున్నా, ఏ లోకంలో ఉన్నా హిరణ్యకశిపుడు నా జాడ కనిపెట్టేస్తాడు. ఎక్కడ దాగితే అతడు కనిపెట్ట లేడో అక్కడ దాగాను అన్నాడు విష్ణుమూర్తి. అదెక్కడ స్వామీ? మీరు దాగింది ఎక్కడ? అని అడిగాడు నారద మహర్షి.

నారదా! నేను దాగింది హిరణ్యకశిపుని హృదయం లోనే. హిరణ్యకశిపుడు అహంకారి. తన కన్నా వేరైన ప్రదేశాలలో అన్వేషిస్తాడే గాని, తనలో తాను తల వంచి, అంతర్ముఖుడై చూడడు. అందుకనే నన్ను నేను దాచుకోవడానికి అదే అనువైన చోటు అని భావించి, అతని హృదయం లోనే ఒదిగి పోయాను అని రహస్యాన్ని విప్పి చెప్పాడు వైకుంఠ పతి.

**కృతకృత్యుడు**

పరమాత్మ జ్ఞానమును పొందిన వాడు కృతార్థు డవుతున్నాడు. ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానము మహోన్నత మైంది. పరమాత్మ జ్ఞానమును పొందిన వాడు అంతకు మించి పొంద వలసింది ప్రపంచములో మరొకటి ఉండదు. పర అంటే ఉత్కృష్ట మైనది అని అర్థము (*పరః సర్వ భూతేభ్యః ఉత్కృష్టం బ్రహ్మ*). అట్టి పరమాత్మ జ్ఞానము ప్రాప్తించిన వాడు కృతకృత్యు డవుతున్నాడు.

కృత్యము అంటే కార్యము. కృతం అంటే చేయబడింది. ఏది కర్తవ్యమో అదే కృతం. కర్తవ్యము అంటూ మిగలకుండా చేయ వలసిన కార్యము లన్నీ చేసేసిన వాడు కృతకృత్యుడు (*కృతం కృత్యం కర్తవ్యం యేన సః కృత కృత్యః*). ఎలాగైతే స్వప్నంలో చేయ వలసిన కర్తవ్యా లన్నీ మేలుకోగానే చేసినట్లే అవుతున్నాయో, అలాగే భగవ త్తత్త్వాన్ని తెలుసుకుంటే చేయ వలసిన కర్తవ్యా లన్నీ చేసినట్లే అవుతున్నాయి. అట్టి వాడు కృతకృత్యుడు అవుతున్నాడు (*యత్ కర్తవ్యం తత్ సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవేత్ ఇత్యర్థః*). ఈ విధంగా సమస్త కర్మలు జ్ఞానములో లయించి పోతున్నాయి (4 వ అ - 33 వ శ్లో). ఈ విధమైన అత్యంత రహస్యమైన బ్రహ్మాత్మ జ్ఞానమును బోధించి, అర్జునుణ్ణి కృతార్థుణ్ణి చేశాడు కరుణా సముద్రుడైన భగవంతుడు.

'అర్జునా! గుహ్యతమ మైన శాస్త్రాన్ని నీకు బోధించాను. పరమార్థ స్వరూపమైన పురుషోత్తమ తత్త్వమును నా ద్వారా శ్రవణం చేసి నువ్వు కృతార్థుడ వయ్యావు, కృతకృత్యుడ వయ్యావు' అని పలుకుతూ పదిహేనవ అధ్యాయాన్ని పరమేశ్వరుడు సమాప్తం చేస్తున్నాడు (*ఏతత్ పరమార్థ తత్త్వం మత్తః శ్రుతవాన్ అసి తతః కృతార్థః త్వం భారత ఇతి*).

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమప్రాప్తి యోగో నామ పఞ్చదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు పురుషోత్తమప్రాప్తి యోగ మనే పదిహేనవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ షోడశోఽధ్యాయః - పదహారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగః - దైవాసుర సంపద్విభాగ యోగము

**చీకటి వెలుగులు**

ఎవరైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా వెలుగునే వాంఛిస్తారు. ప్రకాశాన్నే కాంక్షిస్తారు. తేజమునే ఆహ్వానిస్తారు. చీకటి ఎవరి కైనా చికాకును కలిగిస్తుంది. చిడి పడేలా చేస్తుంది. కనుక, అందరూ వెలుగునే ఆదరిస్తారు. చీకటిని సర్వులూ చీదరించు కుంటారు.

కొందరికే పరిమితం కానిది, అందరూ ఆహ్వానించేది, ఆదరించేది వెలుగే అయినా, చీకటిలో ఉన్న వారికే వెలుగు యొక్క విలువ విశిష్టంగా తెలుస్తుంది. పంజరంలో బంధించ బడిన పక్షికే స్వేచ్ఛా విహారంలో ఉండే హాయి అవగత మవుతుంది. అనారోగ్యంతో అలమటించే వారికే ఆరోగ్యంలో ఉండే సుఖం అర్థ మవుతుంది. జనతకు దూరమై కారాగృహంలో కుమిలే ఖైదీకే జన సమూహంలో ఉండే జవము గోచర మవుతుంది. ఈ కారణం చేతనే, కేవలం వెలుగుల్ని మాత్రమే ఆరబోయడానికి ఆవిర్భవించిన శాస్త్రాలు అప్పు డప్పుడు, అక్కడక్కడ చీకట్లను కూడా చూపెడుతూ చర్చిస్తూ ఉంటాయి. దాని ఉద్దేశ్యం చీకటిలో పయనించ మని కాదు, చింతలలో శయనించ మనీ కాదు. ఏది పొంతమో, ఏది అంతమో పరిశీలించి అర్థం చేసుకోమని. విశ్లేషించుకొని ప్రయాణాన్ని సుగమం చేసుకోమని. శాస్త్రము వెలుగుల బాటలో అక్కడక్కడ నీడల్ని చూపిస్తూ నడక సాగించేది ఇందుకే.

అర్జునా! దుష్టులు, మూఢులు, నీచులు, మాయలో పడిన అవివేకులు - ఆసురీ సంపద కలిగిన ఈ అధములు (*ఆసురం భావ మాశ్రితాః*) నన్ను పొంద లేరు అన్నాడు ఏడవ అధ్యాయంలో భగవంతుడు (*7వ అ - 15 వ శ్లో*).

తిమిరంలో దూరి తారాడుతూ, తచ్చాడుతూ ఉన్న ఆసురీ ప్రకృతి కల వారిని విజ్ఞాన యోగంలో ప్రవేశ పెట్టిన భగవానుడు, పునః తొమ్మిదవ అధ్యాయం పన్నెండవ శ్లోకంలో పరామర్శిస్తూ మోహంలో కూరుకు పోతారు అని హెచ్చరించాడు.

పార్థా! వీరి ఆశలు వ్యర్థం. వీరి కర్మలు అనర్థం. వీరి జ్ఞానం అసమర్థం. వీరిది రాక్షసీ ప్రకృతి. ఆసురీ ప్రకృతి. వీరు మోహ కూపంలో పడి పోతారు అంటూ రాక్షసులకు, అసురులకు మధ్య ఉండే స్వల్పమైన అంతరాన్ని కూడా స్పృశిస్తూ రాజవిద్యా రాజగుహ్య యోగంలో మళ్ళీ చీకటి తెరను ముందుకు తెచ్చాడు వాసుదేవుడు (*9 వ అ - 12 వ శ్లో*).

చీకటి బ్రతుకులు ఇలా వ్యర్థ మైపోతూ ఉంటే, కాంతిమయ జీవితాలు ఎలా దేదీప్యమాన మవుతాయో చూడ మంటూ తొమ్మిదవ అధ్యాయం లోనే దైవీ ప్రకృతితో శోభించే మహాత్ములను కూడా పరిచయం చేశాడు.

పాండవా! మహాత్ములు దైవీ ప్రకృతిని ఆశ్రయిస్తారు (*దైవీం ప్రకృతిం ఆశ్రితాః*). నేను సర్వ భూతాలకు కారణ మని, నశించే వాడిని కానని వారికి తెలుసు. అందుచేతనే ఏకాగ్రచిత్తులై వారు నన్నే ఆరాధిస్తారు